# ఆంధ్రభవిష్యపర్వము

## (పద్యప్రబంధము)

జమీందారు లగు

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు గారు

సమాదరణమున వెలసినది.

ఇది

ఆంధ్ర విశ్వ కలాపరిష్కృతలాశాలా విశ్రాంతులును,
శ్రీజమజ్జయపుర సంస్థానాధీశ్వర సాహిత్య సమ్రాట్
కలాప్రపూర్ణ డాక్టరు బిరుదాంచితు లగు
శ్రీ విక్రమ దేవవర్మ మహారాజా
సాహేబువారి గౌరవాస్థాన
పండితులు నయిన

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు
నిర్మించినది.

ప్రకాశకుడు
షష్టిపూర్తి సమ్మాన సంఘ కార్యదర్శి.

తణుకు రాయల ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

1941

# నివేదన

---

శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు బహుశ్రుతులు. ఆగర్భ శ్రీమంతులు; నిరాడంబరులు, దివ్యజ్ఞానులు, విశేషించికవితాభిలాషులు. కావుటంజేసియే అచ్చుఁగూటము నెలకొల్పినారు. నెలకొల్పునాఁడె నేను ఇట్లా శీర్వదించితిని.

"ముంగలి గోస్తనీనది కన్ పూర్వవిలాసము నావహించు శు
భ్రాంగణ కావ్యహర్మ్యమునన్యందు సుఖంబుగఁ గూరుచుండి స
ర్వాంగ సలక్షణంబులుగన్ వ్రాయు కవీశుల గ్రంథజాలముల్
పొంగుచు నచ్చుగూర్చి పెనున్పుంగొను రాయలయచ్చుఁగూటమా!
రాయలతోడనే తెలుఁగున్ రాజ్యము పోయెను దానితోడనే
పోయిరి సత్కవీశులను న్మూర్ఖజనావళిమాట చెల్లఁగా
నీయనటంచుఁ జాటుటకెన్నిల్పెను 'రాయల' యచ్చుఁగూటమా!
రాయల తిమ్మరాజు నినుఁ, న్ బ్రాభవము గ్గనిపించి మించుమా!"

"ఈముద్రాక్షరశాల మీది అనఁగాఁగవులది. మహాకవుల గ్రంథములనుద్ధరించుటకే యిది నెలకొల్పఁబడినది. దీనఁ బ్రతిఫలాపేక్ష నాకులేదు. అసలుకు మోసము లేకుండ దీనిని మీయిష్టమువచ్చినట్లు ఉపయోగించుకొనుఁడు. దీనిమూలమున భాషాసేవ, మానవసేవ జరుగునట్టులు చూడుఁడు. ఇంతే నావాంఛ. నామకరణము మీరేచేయుఁడు' అన్నారు శ్రీతిమ్మరాజుగారు శ్రీ నాదెళ్ల కృష్ణమూర్తిగారితోడను; నాతోడను. మేము నిర్భరానందము చెందినాము. వారి తండ్రిగారి పేరుతో 'రాయల ముద్రాక్షరశాల' అని నామకరణము చేసినాము. ఇంగ్లీషులో 'రాయల్' తెలుఁగులో 'రాయల' అయి చాలచక్కఁగానున్నదన్నారు శ్రీ తిమ్మరాజుగారు. సరేయంత్రాలువచ్చినవి. పనిసాగినది. రెండు మూఁడేండ్లు కడచినవి. 'ప్రెస్సు' ఒక అవుడు. దిగలాగుటేకాని పైకిఁ దేలనీయదు.

అనుకొన్నపని నెఱవేఱలేదు. మా మొగముగాంచి శ్రీ తిమ్మరాజుగారు వారి మొగముచూచి మేము వెలవెల పాటుచెందవలసిన వారమైతిమి. ఇంతలోఁ గొంత వెలుఁగు చూపట్టినది. యజ్జిమిల్లి వేంకటాచలము మేనేజరైనాఁడు. మాకు శిష్యుఁడు అయినింటబిడ్డ. ఆర్థిక విషయము లందాటి తేటినవాఁడు. 'ఫరవా' లేదన్నాఁడు. క్రింద మీఁద పడ్డాఁడు. నిలఁద్రొక్కినాఁడు. ఇంతలో ఉపాధ్యాయ పండిత పరిషత్తు జరిగినది పెనుగొండలో; శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు భవిష్యపర్వము తెచ్చినారు. కవికులాలంకారునికి వినిపించినారు. చెంత నేనును ఉన్నాను. కవిత్వము మృదుమధురముగా ఉన్నది. 'వ్రతానాముత్తమంవ్రతమ్మ' న్నట్లుకాదు. వాఙ్మయోద్ధారకుఁడు శ్రీ జవ్వాది లక్ష్మయ గారు పుత్త్రిని వివాహ సందర్భములో విశ్వజిద్యాగము చేసినారు. ఇంకను వారిపై ఈభారము పెట్టుట తగదని తోఁచినది.

మా ముద్రాక్షరశాల ఆశయము తటాలున జ్ఞప్తికి వచ్చినది. మిత్త్రిలు కృష్ణమూర్తిగారు నేను యోజించుకొన్నాము. శ్రీ తిమ్మరాజుగారి చెవిని వేసినాము. "ఒక విశ్వకళాపరిషత్పండితుని గౌరవించి నామన్న యావదాంధ్ర దేశమును గౌరవించినామన్నమాట కానిండు పుస్తకము తెప్పింపుఁడు" అన్నారు జమీందారుగారు. ఆయుష్మంతుఁడు వేంకటాచలమును బిల్చినారు సంగతి చెప్పినారు. ఇఁకఁ గావలసిన దేమున్నది. మేమే కోరికతో ఈముద్రాక్షరశాల నెలకొల్పితిమో అది నెఱవేఱినది.

పిమ్మట శాస్త్రిగారు వచ్చినారు. నేను శాస్త్రిగారు కలిసి శ్రీ తిమ్మరాజుగారి దర్శనానికిఁ బొలములోనికి వెళ్లినాము. పగలు పండ్రెండు గంటలు వేళ. కన్నులు పండువుగాఁ బెరిఁగియున్నది పసుపుఁ దోఁట. ఆతోఁటలుచుట్టును జక్కని చిక్కని కొబ్బరిమొక్కలు తోరణ గట్టియున్నవి. తూర్పుగాలి మందమందముగా వీచుచున్నది. ప్రశాంత

మగుసమయము. కూలివాండ్రు కలుపు తీయుచున్నారు. కొబ్బరి మొక్క నీడను గూర్చుండి 'కళ్యాణకల్పతరువు' అను వేదాంతపత్త్రిక చదువు కొనుచున్నారు శ్రీ తిమ్మరాజుగారు. మమ్ములను చూచుచునే లేచి నారు. 'రండి దయచేయండి' అన్నారు. ముగ్గురము కూర్చుండినాము. "మన సమావేశము పసుపులేటలో జరిగినది. ఇది పరమేశ్వర విలా సము. శుభోదర్కము. తెలుగు రాజుగారు చెప్పినారు సంగతి అంతయు పుస్తకము పంపించండి" అన్నారు ఆదర పూర్వకముగా. పిమ్మట శాస్త్రి గారు, నేనును సెలవు తీసికొన్నాము. పుస్తకము వచ్చినది. అచ్చైనది.

నన్నయదొట్టి యింతదనుక భవిష్యపర్వము తెలిగింపఁబడ కుండ నెందులకో ఉండిపోయినది. నాఁటికి నేఁడు శాస్త్రిగారికి మాట దక్కినది. భారతము అంతా తెలిఁగింపఁబడినది. ఆదికవి నన్నయ తణుకువాఁడని చాలమంది యభిప్రాయము. తార్కాణముగా "నన్నయ భట్టుగారు యజనం బొనరించినచోట జమ్మిచెట్టున్నది. తణుకు తూర్పున" అను పట్టెమట్ట సరస్వతీ సోమయాజి పృథుచరిత్రలోని పద్యపాదమును జూపుచున్నారు. ఇంకను 'కైక్షీదు' లనుగూడఁ గొందఱు చూపు చున్నారు.

అయితే భారతారంభ భారతోపసంహారములు పూర్తి గావించిన యదృష్టము తణుకునకు లభించినది. గోదావరినది కావలి యొడ్డున రాజరాజనరేంద్రుఁడు, ఈవలియొడ్డున శ్రీ తిమ్మరాజుగారు. ఈవల తణుకువాఁడు వాగనశాసనుఁడు—ఆవల కడియమువాఁడు అభినవ వాగనుశాసనుఁడు—వాగనుశాసనుఁడు రాజరాజును ఆశీర్వదించినాఁడు- అభినవ వాగనుశాసనుఁడు-తిమ్మరాజుగారిని ఆశీర్వదించినారు. నలువురు ధన్యులు! పువ్వులలోని దారములమైన మేమును ధన్యులము!

ఇ తి శి వ మ్

తణుకు
18.8.41.

**పండిత సత్యనారాయణ రాజు.**

# వి జ్ఞ ప్తి

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి షష్టి పూర్తి సంపుటము లాటింటిలో నొకటి యగుదీనినిగూర్చి యించుకమనవి.

ప్రాచీనార్వాచీనకవితాశైలులకలయికయై "సంగః కస్య హి న స్వదేత మనసే మాధ్వీకమృద్వీక యోః" అన్నట్లు గుణగ్రహణపారీణుల హృదయ మాకర్షింపఁదగిన యాంధ్రభవిష్యపర్వ మన్న యీపద్యప్రబంధ మును దాము రచియింపఁబూనినకారణమును శ్రీ శాస్త్రిగారే గ్రంథా వతారికలోఁ దెలిపియున్నారు. వారీగ్రంథము 119వ పుటలో నడుగునఁ దెలిపినదానినిబట్టి యిది 1919 లో సుమారు రెండాశ్వాసముల గ్రంథ మైనపిదప నాఁగిపోయి మరల 1938 లోఁ బూర్తిగాంచినట్లు తెలియు చున్నది. ఆమధ్యకాల మిరువదిసంవత్సరములలో వారనేక కృతులు నిర్మించి ప్రకటించియు దీనిని బూరింపక యట్లే విడిచినందు కాలోచింప వలసినది లేదుగాని, యుత్తమపద్యప్రబంధములలో నొకటిగా గణింపఁ దగినయిది నేటి కైనను బ్రకటిత మగుట యాంధ్రసారస్వతభాగ్యమే యని సంతోషింపవచ్చును.

షష్టిపూర్తి సమ్మానసంఘమువారు శ్రీ శాస్త్రిగారియముద్రిత గ్రంథముల ముద్రణమునకు భాషాభిమానుల ప్రోత్సాహ మభిలషించు చున్నసమయమునం దనఁగా 1940 డిసెంబరులో, ఉపాధ్యాయపండిత పరి షద్వార్షికసభలు పశ్చిమగోదావరిజిల్లా పెనుగొండలో జరిగినవి. అపుడు పరిషదుద్ధారకులైన శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుఁడుగారి యింట శ్రీ శాస్త్రిగారుదీనిలోని కొన్ని భాగములు చదువఁగావిని ఇది శ్రీతిమ్మరా జుగారి సమాదరణమున ముద్రితమగుటభవ్యమని సంభావించి శ్రీపెన్మెచ్చ సత్యనారాయణరాజుగా రందుకుఁ దగినయేర్పాటు గావించిరి. ఉద్దార

హృదయులును వదాన్యులును మాతృభాషాభిజ్ఞులు నైన శ్రీ తిమ్మ రాజుగారు శ్రీ శాస్త్రిగారితో సంభాషించి యీ గ్రంథమందలి కొన్ని పద్యములు విని యానందించి "మనపరస్పరసందర్శన సంభాషణములు పసుపుతోటలో జరిగినవి. ఇది యెంతయు శుభోదర్కము. ఈగ్రంథము నే నచ్చువేయించెద" నని సెల విచ్చి యాప్రతిజ్ఞ నిర్వహించిరి "కృతి పోషక ప్రశంసలోఁ" బ్రతిఫలించినసుగుణసంపద నలరారునట్టి శ్రీతిమ్మ రాజుగారికిని, వారిని బ్రోత్సహించిన గుణపక్షపాతులును, తణుకు పుర్రోన్నతపాఠశాలోపాధ్యాయులునైన కవితావిశారద పండిత పెన్మెచ్చ సత్యనారాయణరాజుగారికిని, శ్రీనాదెళ్ళ కృష్ణమూర్తిగారినిికి, షష్టిపూర్తి సమ్మానసంఘము పక్షమున కృతజ్ఞతాపూర్వకాభివాదములాచ రించుచున్నాను. మఱియు నీకృతి ముద్రణదోషములు లేకుండఁ బ్రక టింపవలె నని యెంత యత్నించినను, తుద కవి తప్పినవి కావు. శుద్ధ పత్రమునఁజూపినవి గాక, థ-ధ, ర-ఱ, ట-ఠ, వర్ణములు తాఱుమాఱగుట మొదలుగా-ప్రథమ-అపరాథ-వంటివి మఱికొన్ని యుండును. క్షమించి పాఠకులు సవరించు కొందురుగాక.

ఇట్లు

దివాకర్ల వెంకటావధాని, ఎం. ఏ (ఆనర్సు)

షష్టిపూర్తి సమ్మాన సంఘ కార్యదర్శి.

# కృతిపోషక ప్రశంస

శ్లో. శ్రీ ముళ్లపూడి కులర
త్నాకరరాకాసుధాకరం సుమతిమ్,
శ్రీ తిమ్మరాజ మనిశం
శ్రీమన్నారాయణః పాయాత్!

ఉ. కమ్మకులమ్మునందు నుతిఁ గాంచిన వేంకటకృష్ణుపౌత్త్రుఁ డ
క్కమ్మకుఁ బెద్దబాపయకుఁ గాదిలి పుత్త్రుఁడు ధర్మతత్పర
త్వమ్మున వన్నె కెక్కినయుదారుఁడు వంశవివర్ధనుండునై
తిమ్మయ ముళ్లపూడికులదీపకుఁ డయ్యెను గోస్తనీతటిన్.

క. అతనికి నాశాలాంబా
సతియం దుదయించి సుజనసమ్మతుఁ డగుచున్
నుతి గను వేంకటరాయఁడ
ప్రతియూరను ముళ్లపూడి రాయుం డయ్యెన్.

సీ. ఆడినమాట కొరకొక్కఁడునైన దాఁటని
యట్టినిజాయతీఁ గాటపట్టు
తలఁచినకార్య మెంతటిదుష్కరం బైనఁ
గడముట్టఁ జూచెడుకార్యదీక్ష
పెండ్యాలవంశాభివృద్ధి తదైశ్వర్య
వృద్ధి గావించినబుద్ధిగరిమ
బంధుమిత్రులు దైన్యపాలెఱుంగకయుండ
సాహాయ్య మొనరించుసచ్చరిత్ర

గీ. అనఁగఁ బేరొందె పరధర్మమునకుఁ బోక
నిజకులోచితధర్మనిర్నిద్రుఁ డగుచు
దేవభూదేవభక్తుండు తిమ్మయార్యు
రాయుఁ డలరారుఁ దణుకుపురంబునందు.

క. అతనికి సుగుణసుశీలాన్విత యక్కాయమ్మకును జనించెను వంశ
స్థితికరుఁడై సత్త్వగుణాంచితమతియై తిమ్మరాజు శ్రీమంతుండై.

ఉ. తోరపుభాగ్యభోగ్యములతోఁ దులఁదూఁగుచుఁ గర్వికాక వి
ద్యారస మాన నాస గొని యాంధ్రము నాంగ్లము నభ్యసించి త
త్సార మెఱింగి తాత్త్వికవిచారణ సల్పుచుఁ దత్త్వవేత్తలన్
గౌరవబుద్ధిఁ గొల్చుగుణగణ్యుఁడు రాయని తిమ్మరాజిలన్.

సీ. సర్వార్థసంపూర్ణసంసారసౌఖ్యసం
పన్నుఁడే గాని లంపటుఁడు కాఁడు
గౌరవోద్యోగాధికారనిర్వాహప్ర
గల్భుఁడే గాని యక్రముఁడు కాఁడు
ధర్మమార్గప్రవర్తన మెచ్చుకొనుఁ గాని
కులమతభేదసక్తుండు కాఁడు
నిత్యసంతుష్టుఁడై నెగడును గాని య
న్యాయార్జనార్థచింతనుఁడు కాఁడు

గీ. అనుచుఁ బొగడొందుచుండ సజ్జనహితుండు
భారతాదిమహాగ్రంథపాఠకుండు
భక్తివిజ్ఞానసాధనాభ్యాసరతుఁడు
ధీరగంభీరభావుండు తిమ్మరాజు.

చ. అతఁడు సమస్తధర్మపురుషార్థపదం బగు భారతంబునన్
శతతమపర్వమై నవరసం బగు శ్రీహరివంశవర్ణనాం
చితము భవిష్య మేఁ దెనుఁగుచేయుట మిత్రులవల్ల వించు నీ
కృతి వెలయించు కీర్తి గనెఁ గృష్ణకథాశ్రవణప్రహృష్టుఁడై.

చ. మితహితభాషణంబు మెఱ మెచ్చులయీవి పరోపకారశీ
లత పరమార్థదృష్టియుఁ జెలంగినయాతఁడు తిమ్మరాజు శ్రీ
పతికరుణాకటాక్షమునఁ బత్నియుఁ దానును బుత్త్రపౌత్త్రసం
తతియును సర్వసౌఖ్యములుఁ దామరతంపరగాఁ దలిర్చెడున్.



కృతిపోషకులు: శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు

జమీందారు, తణుకు.

# విషయసూచిక.

—:o:—

శ్రీరస్తు.

ఓ న్నమః పరబ్రహ్మణే

# ఆంధ్ర భవిష్య పర్వము.

## ప్రథమాశ్వాసము.

### గ్రంథావతారిక.

శ్లో॥ ఓ న్నమ స్సర్వవేదాన్తవేద్యాయ పరమాత్మనే
బ్రహ్మవిష్ణుమహేశాంశై ర్జగజ్జన్మాదికారిణే. 1



వాణీపరమేశ్వరీరమణమూర్తిం దాల్చి యాత్మీయమా
యావిర్భూతజగత్త్రయీస్థితికిఁ బ్రాపై నిల్చి సంసారమో
హావేశంబునఁ గ్రీడ సల్పుతనుఁ దానానందియై చూచుస
ద్భావుం జిన్మయు నద్వితీయుఁ బరమాత్ము న్నిత్యు భావిం
చెదన్. 2

ఉ. శ్రీకరు జానకీవరు వశీకృతసద్గుణలోకు నుత్తమ
శ్లోకుని వేదవేద్యుఁ బరిశుద్ధుని రాముని గావ్యనేతఁ గాఁ
జేకొని యాదికావ్యము రచించిన తాపససార్వభౌము వా
ల్మీకిని వశ్యవాణిని సమీహితసిద్ధికి నాత్మఁ గొల్చెదన్. 3

ఉ. శ్రీరమణీమనోహరునిచిత్రచరిత్రుఁ బవిత్ర మామహా
భారతసంహితం బ్రజలభాగ్యముగా నొసరించినట్టియా
భారతవంశవర్ధను నపారతపోధనుఁ దత్త్వబోధనుం
గారుణికాగ్రణిం దలఁతుఁ గామితసిద్ధికి బాదరాయణున్. 4

చ. తెలుఁగును దోడిభాషలు నుతింప ననర్గళధార యాచితీ
కలితపదార్థభావరసకల్పన మొప్పఁగ నాంధ్రభారతం
బనఁ దొలుఁబల్కు లిచ్చినమహాత్ముని సత్కవితావిధాత వి
ద్యలనిధి నన్నపార్యుఁ గొనియాడెద సత్కవిమార్గదర్శకున్. 5

చ. అనుపమభావశుద్ధియు సమర్థపదాచితి యర్థపుష్టియుం
బనుపడ జిహ్వాకున్ రుచిగ భారతమందు పదేనుపర్వముల్
తెనుఁగున నిల్పి లోకమునుతిం గనువాఙ్మయమూర్తిఁ దిక్కయ
జ్వను గవిలోకనాథు నుతిసల్పెద సత్కవిమార్గవర్ధనున్. 6

క. ఆరణ్యపర్వశేషముఁ
బూరించి కవిత్రయంబుఁ బూరించినవి
స్ఫారయశుఁ దలఁతుఁ గవితా
పారగు నెఱ్ఱనఁ బ్రబంధపరమేశ్వరునిన్. 7

క. ఉత్తరహరివంశము బుధ
సత్తములు నుతింప వ్రాసి సర్వజ్ఞుఁడు నా
నుత్తమబిరుదము గనువి
ద్వత్తల్లజు సోమనాథుఁ దలఁచెదఁ బేర్మిన్. 8

గీ. సర్వలోకప్రసిద్ధయశస్కులైన
భాసకాళిదాసాదుల భక్తిఁ బొగడి
దలఁచెదను సత్కవిత్వావదాతకీర్తు
లైన శ్రీనాథసూరనార్యాదికవుల. 9

గీ. అనఘు నిరతాన్నదానవిఖ్యాతు శబ్ద
శాస్త్రగురుఁ జర్లబ్రహ్మయశాస్త్రిఁ గొలిచి
బ్రహ్మవిద్యాగురుం డగు భవ్యచరితు
మంథచెన్నయశాస్త్రి నెమ్మది భజింతు. 10

సీ. వెలనాటివైదికు విదితవేదశ్రౌతు
మల్లాదివంశసమ్మాన్యు హారిత
గోత్రు నాపస్తంబసూత్రు లక్ష్మీనర
సింహావధాని భజించి తాత
తండ్రిని, వేదశాస్త్రజ్ఞు రామస్వామి
శాస్త్రి నారాధించి జనకజనకు
నంచితస్వాధ్యాయు ననఘు వేదాంతవి
జ్ఞాని శ్రీరామావధాని జనకుఁ

గీ. దలఁచి గురుభక్తి నియతివ్రతంబు మెఱయ
వేదమయు నిత్యు నాదిత్యు వినుతిచేసి
యిష్టసిద్ధిని బడసిన శిష్టచరిత
జనని యగు వేంకమాంబ కంజలిఘటింతు. 11

వ. అనియిష్టదేవతాశిష్టకవిగురుజనవందనం బాచరించి శ్రీపరమేశ్వర
కరుణాకటాక్షసమాసాదితమదీయకవిత్వంబును దదీయమహిమాభి
వర్ణనంబునఁగృతార్థంబుఁగావించుటయె కర్తవ్యంబుగాసముదితకుతూ
హలవికసితాంతఃకరణుండనై యొక్కనాఁ డిక్కరణిం దలంచితి. 12

సీ. తెనిఁగించి విదురనీతిని బూర్తిగా మున్ను
శ్రీధర్మబోధినీకృతి యొనర్చి
స్వకపోలకల్పన సత్యకీర్తి రచించి
విస్మృతాంధ్రకవీంద్రవితతిఁ దెల్పి
ఆంధ్రీకరించి మహావీరచరిత ము
త్తరరామచరితంబు సరసఫణితి
ఘటియించి సంస్కృతకవిజీవితము ప్రతి
జ్ఞాశాంతనవనాట్యకంబు నుడివి

దశరూపకంబు నాంధ్రమొనర్చి సవిమర్శ
భారతోదంతంబు పరిఢవించి
భవభూతినాటకభాసరూపకముల
వచనకావ్యంబులు రచనచేసి
శృంగార మాంధ్రము చింతామణియు నాఁగఁ
జక్కనివ్యాసముల్ పెక్కు వ్రాసి
సురభారతిని బ్రహ్మసూత్రార్థదీపిక
సంస్కృతభాషాప్రశస్తి యువతి

గీ. పరిణయవిమర్శనంబును బలికినాఁడ
నింతకును జవ్వనం బింక నింత గలుగఁ
బరమపురుషార్థమున కాలవాల మైన
గ్రంథ మేదేని తెలిఁగింపరాదె యనుచు. * 13

వ. అట్టిదాని నన్వేషించుచుఁ దుదకు మహాభారతం బనుపంచమవేదం
బున కుపనిషత్తునాఁ బరగుహరివంశం బామూలాగ్రం బవలోకించి
మదుద్యోగంబు సద్యోగంబుగా నానందించి— 14

మ. హరివంశంబును విష్ణుపర్వము భవిష్యం బన్న పర్వత్రయిన్
హరివంశం బలరారెడున్ ఖిలపురాణాఖ్యన్ సదాఖ్యానసుం
దరమై సాత్యవతేయవాగమృతమై దానన్ భవిష్యంబు శ్రీ
హరితత్త్వప్రతిపాదకంబు శతపర్వామ్నాయశీర్షం బగున్. 15

గీ. ఆది నించుక గొనె నెఱ్ఱనార్యుఁ డందు,
తుది నొకించుక సోమనాథుండు గొనియె,
గాన వారిద్దఱిఁ దలంచి దాని నిప్పుడు
పూర్తిగాఁ దెనిఁగించుట పోలదొక్కొ? 16

---

* ఇందలికృతులానాఁటికి రచియించినవి. తరువాత రచియించినవి, ఆంధ్ర భాషానుశాసన సంస్కృతవాఙ్మయచరిత్రాదులు.

వ. అని యూహించి తత్కార్యంబునఁ గృతనిశ్చయుండనై మహా
భారతకవుల మరల నొక్కమాఱు వచశ్శుద్ధికై స్మరియించి పర
మేశ్వరానుగ్రహపురస్సరంబుగా సకలశ్రేయోఽభివృద్ధిగా నాయొన
ర్పంబూనిన మహాభారతమకుటమనెడియాంధ్రభవిష్యపర్వంబునకుఁ
గథాక్రమం బెట్టులనిన— 17

### కథాప్రారంభము

### జనమేజయవంశము

గీ. రమ్యతర మైననైమిశారణ్యమందు
సత్రయాగంబు జరిగెడిసమయమందు
సకలమునికులపతి యైనశౌనకుండు
కథకుఁ డుగ్రశ్రవసున కిక్కరణిఁ బలికె. 18

చ. భరతకులేతిహాస మగుపంచమువేదము సర్వధర్మసం
భరిత మనేకరాజమునివల్లభవృత్తము విష్ణుతత్త్వబం
ధుర మగు దాన నింతకును దొంబదితొమ్మిదిపర్వముల్ మహా
దరమునఁ దెల్పి నీవు మము ధన్యులఁ జేసితి రౌమహర్షణీ! 19

చ. తెలివిని జెందె మామనము దివ్యపరాశరసూనునిర్మితో
జ్జ్వలభరతాన్వవాయహరివంశకథాసుధ గ్రోలి యింక న
వ్వలికథ యేమొకో వినఁగ వాంఛ దలిర్చెను మాకుఁ దెల్పుమా
ఖిలముల నద్భుతం బనెడికీర్తిని గన్నభవిష్యపర్వమున్. 20

క. జనమేజయభూవరనం
దనులం దెవ్వండు పాండునందనకులవ
ర్ధనుఁ డయ్యె? సర్పయాగం
బున కవ్వల నాతఁ డేమి యొనరిచెఁ జెపుమా! 21

మ. అనఁగన్ సూతసుతుండు తాపసులయాహ్లాదంబు నీక్షించి యి
ట్లని చెప్పన్ జనమేజయుండు కనెఁ గాశ్యాదేవియందున్ యశో
ధనుఁడై యన్వయవర్ధనుం డయినచంద్రాపీడుఁడున్ బ్రహ్మవి
ద్యనుభూర్ణుండయి యాత్మవేత్త యగుసూర్యాపీడుఁడన్పుత్రులన్. 22

క. కలిగిరి చంద్రాపీడున
కలఘులు నూర్వురు కుమారు,లన్వయకరులై
వెలసినవారలఁ దొలివాఁ
డిల నేలెను సత్యకర్ణుఁ డిభపురపతియై, 23

క. వారాణసపురపతి యా
శూరాగ్రణి రాజ్య మేలి సుతునికి నుర్వీ
భారం బొసంగి పూర్వా
చారంబున సతిని గూడి చనె వనమునకున్. 24

ఉ. ఆనరనాథుసూనుఁడు మహాహవవీరుఁడు శ్వేతకర్ణభూ
జాని యదూద్వహాఖ్యం డగుసుచారునిపుత్రిని మానినీమణిన్
మానినిఁ బెండ్లియాడి జనమానితుఁడై భువి నేలి యేలి సం
తానము లేమి నేలుబడిఁ దద్దయు రోఁత జనించినంతటన్. 25

గీ. ధరణిరాజ్యంబు మంత్రులపరము చేసి
యెల్లభోగంబులను మది కెడముచేసి
నీడవలెఁ దోడ వచ్చుమానినియు, దాను
నరిగె వార్ధక్యవ్రతమాచరింప. 26

చ. వనగతుఁడై నయాతఁ డతిభక్తి మహేశసపర్య, లామె య
జ్జనపతిపాదపద్మపరిచర్యలుఁ జేయుచునుండునంత న
య్యనుపమశీలమానినికి నయ్యెను గర్భము దైవయుక్తి నం
తన నవమాసములు్ గడచెఁ దత్సమయంబున శ్వేతకర్ణుఁడున్. 2

క. మానస మతివైరాగ్యముఁ
బూనఁగ నిజవంశపూర్వపురుషులత్రోవన్
మానిత మైనమహాప్ర
స్థానము చేయంగఁ దలఁచి చయ్యనఁ గదలెన్. 28

చ. తనగతి చూడ కట్లు మమతారహితాత్మత నేగుచున్న భ
ర్తను వెడఁబాయ నోపక భరం బగు గర్భముతోన యాతనిన్
వెనుకొని మానినీసతి వనీస్థలిలోఁ బ్రసవించి కన్నపు
త్త్రుని విడనాడి యేగెఁ బతితో మును ద్రౌపది యేగినట్లుగా. 29

సీ. పతిభక్తి పేర్మి నపత్యమోహంబును
విడనాడి తనతల్లి వెడలినంత
నెండ తాఁకునఁ గంది యేడ్చునక్కసుఁగందు
గతి నచేతనములు కరఁగ వనఁగ
నంబుదంబులు నీడ నతనిపైఁ బఱపెడి
సమయమం దాదారిఁ జనుచునున్న
శాంతచిత్తులు శ్రీవిశ్వామిత్రు లగుపిప్ప
లాదుండు కౌశికుఁ డనెడివారు

గీ. కూర్మి నబ్బాలుఁ గొనిపోయి కొండకాల్వ
బండపై నిడి కడుగుచునుండ వాని
ప్రక్క లారాతిరాపిడిఁ బొక్కియల్ల
నల్లవాఱె క్రమంబుగ నల్లవాఱె. 30

గీ. అప్పు డజపార్శ్వములయట్టు లతనిప్రక్క
లెసఁగ నజపార్శ్వుఁ డనునామ మిడి నృపసుతు
వారు గొనిపోయి క్షేమకవనిత కిచ్చి
రామె యాబాలు నాత్మజప్రేమఁ బెంచె. 31

ఉ. వేమకిపుత్త్రుఁడై పెరిగి పెద్దయి యాతఁడు గానఁ దన్ను ము
న్నోమినవారు మంత్రులుగ నున్నతపూరుకులక్రమాగత
శ్రీమహితాత్ముఁడై గుణగరిష్ఠత భూతలమేలెఁ దన్మహా
ధాముని వంశ మాతనిప్రభానులవంశమునిండె నెల్లెడన్. 32

గీ. పాండువంశప్రతిష్ఠ యిప్పగిది నుండెఁ
బౌరవాన్వయనిష్ఠ నుపన్యసించి
పద్య మొండు యయాతి చెప్పండె తొల్లి?
దానిఁజదివెద వినుఁడు మేధావులార! 33

శ్లో. "అచంద్రార్కగ్రహా భూమి ర్భవే దపి న సంశయః
అపౌరవా నతు మహీ భవిష్యతి కదాచన" 34

రాజసూయప్రసక్తి—వ్యాసునిరాక

వ. ఇది యిట్లుండె నింకఁ బరీక్షిన్నందనువృత్తాంతంబు వినిపించెద వినుండు. 'జనమేజయభూనాయకుం డట్లుసర్పయాగంబు సమాప్తి గావించి పదంపడి యశ్వమేధం బొనరింపఁ గృతాభిలాషుండై యొక్కనాఁ డాసర్పసత్రప్రదేశమందలియొక్కశిబిరంబున ఋత్విక్పు రోహితాచార్యాదులకుం దనసంకల్పంబు విన్నవించి తదనుమతి నంతఁ దదాహవయోగ్యం బైనహయరత్నంబు విడువ సన్నాహంబు సల్పుచున్నయెడ యోగదృష్టి నతనిమనోరథం బెఱిఁగిన త్రికాలజ్ఞుం డగుకృష్ణద్వైపాయనుండు కామగమనంబున నచ్చటికి వచ్చి సాక్షాత్కరించె. అప్పుడమి ఱేఁడును సంభ్రమాశ్చర్యసంతోషపరీతచేతస్కుఁడై ప్రత్యుత్థానాభివందనపూర్వకంబుగ నర్ఘ్యపాద్యాదివిధు లాచరించి యమ్మహాత్ము నుచితాసనాసీనుం గావించి సకలవేద పురాణార్థసంగతంబు లగువివిధకథాప్రసంగంబులఁ గొంతప్రొద్దు గడపి యనంతరంబుతనతాతముత్తాతయుఁ గౌరవాన్వయస్థితికరుండు

నైనయప్పరాశరసూనుతో మహాభారతప్రశంసాపూర్వకంబుగ నిట్లనియె. 35

ఉ. వీనులవిందు మానసముకు వేడుక నాలుకతీపి యైనయా
ఖ్యానము సాంగవేదపరమార్థనిదానము సర్వధర్మసం
స్థానము పౌరవాన్వయనిధానము భక్తజనేష్టసిద్ధిసం
ధానము భారతంబును సదా వినుచుందును వీనులారఁగన్. 36

గీ. కాని, శంఖపయోధార♦కరణిఁ బరమ
పావనంబును హృద్యమై ♦పరగునీదు
దివ్యకవితాసుధాధార♦తీపి మరగు
నాదుమది కిప్పటికిఁ దృప్తి ♦లేదు సుమ్ము. 37

గీ. కాక,సుధ నారగించుట ♦నాకసుఖము
గాంచుటం గూడఁ దనివోవఁ♦గలను గాని
భారతకథాసుధారసా♦స్వాదనమున
నొక్కనిముసంబు నాపోవ ♦నోపనేను. 38

క. అనవరత మట్లు భారత
మును విన ననుమాన మొకటి ♦పొడమెను దానిన్
విని తీర్పుము ముమ్మనుమనిఁ
గని కూర్మిఁ దపోనిధాన ♦కరుణాభరణా! 39

సీ. ఆదిని రాజసూ♦యము సోముఁడొనరింపఁ
దారకామయసంప్ర ♦ హార మయ్యె,
అటుపైని వరుణుఁ ♦డయ్యాగంబు సాగింప
నుగ్రదేవాసుర♦యుద్ధ మయ్యె,
అంత హరిశ్చంద్రుఁ ♦డాజన్న మెలయింప
ఘనతరాడీబక♦కలహ మయ్యె,

అట ధర్మజుఁడు దాని ♦నాచరింపఁగఁ గురు
పాండవానీకంబు♦ప్రాప్తమయ్యె,

గీ. రాజసూయంబు దారుణ♦క్రతువు గాదె?
ధరణి కది యత్యుపద్రవ♦కరము గాదె?
యదియు కురువంశ మేర్చిన♦యగ్ని గాదె?
యింతయును నీ వెఱుంగని♦దే మునీంద్ర! 40

క. అలవికి మీఱినయంగం
బులు పెక్కులు రాజసూయ♦మున కవి యెల్లన్
దలమే జరపఁగ?నొక్కటి
తలఁగిన జనసంక్షయంబు ♦తప్పదుగాదే? 41

గీ. ఇంత యెఱిఁగియు ధర్మజుం ♦డేల గడఁగె
నన్వయక్షయమూల మ♦య్యజ్ఞమునకు
నాగతానాగతజ్ఞుఁడ ♦వై ననీవు
దాని మాన్పఁగ లేదేల ♦మౌనినాథ! 42

గీ. కానివారల నమ్మిన♦హీనమతులు
ననదలును దారితప్పుట ♦చనునుగాని
ఘనమనీషులు నీశిక్ష ♦గన్నవారు
పాండవులు త్రోవ తొలఁగుట ♦పాడియౌనె? 43

వ. అని యడిగిన నభిమన్యుపౌత్రునకుఁ బాండవపితామహుం డిట్టు
లనియె. 44

ఉ. కాలము దాఁట నేరికిని ♦గాదు తదద్భుతవేగ మాఁగఁగాఁ
జాలునె మానవుండు తన♦శక్తిని?గానఁ బ్రజావినాశ మా
చాలునఁ జేయఁ జూచువిధి♦చాపలభావ మెదుర్కొనంగఁ దాఁ
బోలక ధర్మజుం డపుడు ♦పుట్టినబుద్ధిన పోయె బాలకా! 45

ఉ. కాలవశంవదుం డగుటఁ ♦గాఁగలకార్యము నట్టులుంట న
న్నేల యుధిష్ఠిరుం డడుగు?♦నియ్యది యౌ నిది గా దటంచు నే
నేల వచింతు నాతని క♦పృష్టుఁడనై?యది గాక త్రోవఁగం
బోలునె నాకుఁ గాలకర♦ముద్రితమానవఫాలలేఖలన్? 46

ఉ. నీ విపు డశ్వమేధమున ♦నిక్కపుఁగూరిమి గల్గి యిట్టులీ
త్రోవకు వచ్చినాఁడ వని ♦తోఁచిన దెంతయుఁ,దెల్ల మయ్యె నీ
భావము,దైవయత్నమునఁ♦ బౌరుష మడ్డము గాదు గాని మే
ధావివి గానఁ జెప్పెదను ♦దాల్మి భవిష్యము నాలకింపుమా! 47

ఉ. రాజుల కశ్వమేధము గ♦రం బుచితం బగు,దాని కీవు పే
రోజఁ గడంగు,దవ్విధికి ♦నోర్వక వాసవుఁ డడ్డుచేయు ను
త్తేజముతోడ,నట్టు లని ♦తీర్పఁగఁ బూనినదాని మానఁగా
నీజతనంబు చెల్లునె?గ♦ణించునె దైవము పౌరుషంబులన్? 48

క. కావున నీహయమేధం
బీవిధముగ నగు నటంచు ♦నిపుడు తెలిసినన్
నీ వప్పుడు పురుహూతుని
కావించినపనికి నలుక ♦గాంచవు వత్సా! 49

ఉ. ఇప్పటి కశ్వమేధ మిది♦యే భువిలో నిఁకమీఁద నుండ దం
చప్పరమేష్ఠిశాసన మ♦హా!యిది సమస్తయజ్ఞముల్
ముప్పునఁ బోవు వానిఫల♦ముల్ తెగనమ్మెడివిప్రజాతిచేఁ
దప్పక సర్వభూతములు ♦తత్ప్రళయంబునఁ బోవుకై వడిన్. 50

వ. కావున సచరాచరం బైనయీసకలప్రపంచంబు దైవాధీనం బగుటం
జేసి పురుషుండు పౌరుషంబున నించుకేని ప్రతీకారంబు చేయ
నోపం డని భావింపు మన్నంతనన్నరనాయకుం డిట్లనియె. 51

గీ. అనఘ! యియ్యాగ మిఁకమీఁద ♦నాఁగిపోవ,
గారణం బెఱిఁగింతువేఁ ♦గరుణతోడ
దానిఁ దొలఁగింపఁ జూతు నే♦నైనఁ గాని
నీదుదీవనకతమున ♦నేర్పుకొలఁది. 52

మ. అనినన్ సాత్యవతేయుఁ డిట్లనుఁ గుమా♦రా!నీకు భద్రంబు,చా
లును దానిం దొలఁగింతునంట,యట నా♦లోచింపు లోకేశుశా
పనిమిత్తం,బిఁక భూమి యుండఁగ మహీ♦పాలావళి న్నీకుఁ ద
క్క నొరుం డొక్కని కశ్వమేధమునవం♦కం జూడఁ గాదేనియున్.53

చ. అనవుడు భూవరుండు చతు♦రాస్యునిశాపము సోఁకి యింక భూ
మిని హయమేధ మాఁగఁగ ని♦మిత్తము నేనయి దుర్యశంపుబం
ధనమునఁ జొత్తునేని యురి♦త్రాళులఁ జిక్కినరాజహంసచ
ర్యను గనఁజాల విష్ణుపద ♦మంచు భయంపడి యమ్మునీంద్రుతో.54

గీ. యోగిజనవందనీయ!నీ♦ యోగదృష్టిఁ
దురగమేధనివృత్తిహే♦తువును గాంచి
నట్ల తత్పునరావృత్తి ♦నరసి తేని
తెలిపి కూరిమి నావంత ♦దీర్పు మనఁగ. 55

గీ. వ్యాసుఁ డిట్లు వచించె ది♦నాంతవేళ
నఖిలతేజంబు భాస్కరు♦నం దణంగు
నట్లు లీహయమేధంబు ♦నణఁగియుండు
బ్రాహ్మణోత్తములందు గీ♦ర్వాణులందు. 56

వ. అట్లీయాగంబు పెక్కువేలేండ్లు వారియందు విలీనమై యుండినంతఁ గలియుగంబునఁ గాశ్యపగోత్రుం డైన సేనాని యనుద్విజశ్రేష్ఠుండు తనతపోయోగనిష్ఠ కునికిపట్టయినభూబిలంబు భేదించుకొని యీవలికి వచ్చి యశ్వమేధంబును మరల నవనిపైఁ బ్రవర్తిల్లఁజేయును.

తరువాత మఱికొంతకాలంబునకుఁ దత్కాలంబున మఱియొకఁ డుదయించి ప్రలయము శ్వేతగ్రహంబునట్లు రాజసూయ మావిష్కరింపఁ జేయఁగలండు. తదాదిగాఁ గ్రతువులు మానవుల శ్రద్ధాభక్తుల ననుసరించి ఫలించునుగాని,కలియుగాదిగా మనుష్యుల హృదయంబులు సనాతనాచారదూరంబులై దుర్బలంబు లగును. దానంజేసి చాతుర్వర్ణ్యధర్మంబు లడుగంటును. అయిన నక్కాలం బునఁ గోటి కొక్కం డెవ్వఁడేని ధర్మపరుం డున్నచో నతఁ డల్ప ధర్మకార్యంబునన్నే యధికఫలంబు గాంచఁగలం డనుచు నక్కాణింప జనమేజయుండు వెండయు నిట్లనియె. 57

చ. కలియుగపూర్వసంధి యిది గావున నింతకు ధర్మకర్మముల్
తలఁగక యుండె నింతట నధర్మము జాతుల నాశ్రమంబులం
గలఁచుట యల్పకర్మ మధికం బగుధర్మము గూర్చు టన్ననీ
పలుకుల విస్మయం బగుఁ గృపన్ వినిపింపు కలిప్రభావమున్. 58

క. అని యడిగిన నాద్వైపా
యనముని నిజయోగదృష్టి నరసి కలియుగం
బున నయ్యెడిపలువింతలు
వినిపింపఁ దొడంగె నిట్లు విబుధులు పొగడన్. 89

## కలిప్రభావము

క. మారణసాధనవృద్ధియు
దారుణయుద్ధములు ఘోరతరవర్షములున్
క్రూరతరపాలనము ని
ష్కారణజనహింస దుష్టకలిలక్షణముల్. 60

ఉ. పరులకష్టసుఖంబు లరయక నరపతుల్
బలిమిమై నదిమి కప్పములు గొందు

రక్షత్రియులు భూమి ♦కధ్యక్షులగు చాత్మ
భోగభాగ్యంబులఁ ♦బొంగుచుండు
రవనిదేవతలు శూ♦ద్రాశ్రయంబునఁ జిక్కి
కష్టజీవనమును ♦గడపుచుండు
రాశూద్రు లవనీసు♦రాచారు లగుదురు
బ్రాహ్మణు లాయుధ♦పాణు లగుదు
గీ. రఖిలవేదోక్తకర్మంబు ♦లంతరించు
నెల్లజాతులవారలు ♦నేకపంక్తి
నారగింతురు పానమాం♦సాశనములఁ
గాంక్ష హెచ్చును బ్రజలకుఁ ♦గలియుగమున. 61

క. ధనమునకుం గలగౌరవ
మున నొకవీసంబు సుగుణ♦ముల కబ్బదు నీ
చున కయ్యెడి తెఱఁగున స
జ్జనునకు నొకచిన్నపనియు ♦సాగదు కలిలో. 62

గీ. అన్న మమ్ముదు రూరూర ♦నఖిలజనులు
వీధివీధిని విప్రులు ♦వేదములను
వెల కొసంగెద,రందందు ♦కులముకులము
కాంత లమ్ముదు రంగముల్ ♦కలియుగమున. 63

గీ. కపటసన్యాసులు వితంతు♦కామినులును
బుత్త్రముఖవీక్షణసుఖంబు ♦పొందఁగలరు
పదియు నాఱేండ్లు నిండని♦బాలకులును
గలిని బిడ్డలతండ్రులై ♦వెలయఁగలరు. 64

క. తెలు పగుపండ్లును నున్నని
తలలును దండంబు శమము♦దమమేర్పడుప
ల్కులు కావిరంగుబట్టలు
నలవడఁ గలివేళ బోడ ♦లగుదురు కాఁపుల్. 65

గీ. ఉచితకర్మంబు లెల్లరు ♦నుజ్జగింప
బ్రహ్మవాదంబు నెపముగాఁ ♦బడయఁగలరు
కులమతభ్రష్టు లనియెడి♦కొఱఁత లేక
పతితు లందఱమన్ననఁ ♦బడయఁగలరు. 66

గీ. ఏమి యేమోయి యేమండి ♦యేమిర యని
యెచ్చుతగ్గులు కనిపెట్టి ♦యెచ్చరించు
నట్టిపిలుపులు తాఱుమాఱు ♦ అగుచునుండుఁ
దలఁగు నుత్తమమధ్యమా♦ధమవివక్ష. 67

చ. ఋతువులు తల్లక్రిం దగును ♦వృష్టియుఁ జిత్రవిచిత్రఖండప
ద్ధతిఁ గురియంగఁజొచ్చు గడి ♦తప్పనిదూడలు దుక్కిటెద్దు లౌఁ
గుతలము చౌడువాఱి జిగి ♦గోల్పడుఁ గోడులు మెట్టచే లగున్
హితరుచిఁ బాయుధాన్యములు♦ నెల్ల ఫలంబులుఁగూరగాయలున్. 68

క. పుడమికడ నున్న మ్లేచ్ఛులు
నడుభూమికి వత్తు రల్ల♦నడుచోటిజనుల్
కడఁ జొత్తు రిందు నందును
గుడియెడమలు లేక వారి♦కోర్కులు తీరున్. 69

క. కొనియమ్మకట మోసంబున
ధన మార్జించుటయు దొంగ♦తనమునఁ గలిమిం
గని త్రుళ్ళిపడుట పదరుట
యనునివి సామాన్యగుణము ♦లగు నందఱకున్. 70

క. చెడునడవడిఁ బూర్వార్జిత
మెడిలించిసమస్తభోగ♦హీనుం డగుచున్
గడియింపనేర కుండిన
జడమతిఁ బెండ్లాము ప్రోచు♦సమయము వచ్చున్. 71

క. అందఱు వాణిజ్యంబున
కుం దిగుదురు,తగ్గిపోవు ♦ గోకుల,మూళ్లం
జెందును వృకశార్దూలము
లందఱు ధర్మార్థశూన్యు ♦లగుదురు కలిలోన్. 72

క. విడనాడి సిగ్గు శీలము
తొడవులు,జడముడియె తమకుఁ ♦దొడవుగఁ బడఁతుల్
చెడుతెరు వంటుట పడుచుల
గడితము మగవారికొఱఁత ♦కలిలక్షణముల్. 73

గీ. వయసు మీఱక వచ్చెడి♦వార్ధకంబు
హద్దు మీఱినకోర్కెలు ♦వ్యసనములును
దరుణజనము నణంచు నం♦దఱు నణంచుఁ
దస్కరాగ్నినృపత్రయో♦త్పాతభీతి. 74

క. వికలాంగు లగుచు నాఁకట
నకనకఁ బడువారియార్త♦నాదము వెలిగా
నొకనిముస ముండ దట్టులె
యొకకబళము పెట్టునిల్లు ♦నుండదు కలిలో. 75

క. ఈసును ద్రోహంబును చే
రాసయుఁ బరదూషణంబు ♦నాత్మస్తవమున్
రోసము బ్రహ్మద్వేషము
దోసపుఁజేఁతలును జనుల♦తోడన పుట్టున్. 76

క. వడగండ్లవాన వేంద్రము
వడగాలియు గాలివాన ♦వనపావకమున్
బిడుగులు నుల్కాపాతముఁ
కడువడిఁ దలసూపుచుండుఁ ♦గలియుగమందున్. 77

సీ. వేదాంతవిద్యావి♦వేకంబు సంసార
పోషణసాధనం♦బుగ ఫలించు
ధర్మశాస్త్రపురాణ♦దక్షత్వ మభినవా
చారముల్ సాధింప ♦నందడించుఁ
జదివినకొంచెంబు ♦సాధుసమ్మతిఁ బాసి
సర్వజ్ఞభావంబు ♦సంతరించు
శబ్దార్థభావసౌ♦ష్ఠవదూరనిస్సార
నవనవకావ్యస♦న్తతి జనించు
గీ. సంత్యవర్ణంబులు ద్విజత్వ ♦మనుకరించు
నగ్రవర్ణంబులమహత్త్వ ♦మంతరించు
దయయు సత్యంబు శౌచంబు ♦దత్తఱించుఁ
గనఁదరంబౌకొ కలికాల♦జనముసంచు? 78
గీ. సమయములఁ బత్రముల సాక్షి♦శపథములను
స్వీయకరలేఖనంబుల ♦వేఱుచేసి
యుత్తమర్ణాధమర్ణు ల♦యోగ్యవిధులఁ
బాడితప్పుదు రన్యాయ♦వాదు లగుచు. 79
క. పరలోకంబును బూర్వో
త్తరజన్మంబులును బండి♦తమ్మన్యులచే
నరమరఁబడు శాస్త్రంబుల
పరమార్థం బప్రమాణ♦పద్ధతి నరుగున్. 80
క. కులమతనిందితకృత్యం
బులు చేసెడివాఁడు సంఘ♦మునఁ బెద్ద యగున్
గులటాపుత్త్రు లపాత్రే
యులు క్రతువులు చేయఁగడఁగు♦ నందుఁ గలిలో. 81

గీ. పాపచింతయుఁ గపటంబు ♦వంచనంబు
సత్యశూన్యత లేవడి ♦స్వార్థపరత
స్త్రీసమృద్ధియుఁ బూరుష♦క్షీణదశయు
లజ్జలేమియుఁ గలికాల♦లక్షణములు. 82

గీ. తల్లిదండ్రుల దండించుఁ ♦దనయుఁడెందు
నత్తమామలఁ గోడలు ♦నాడిపోయు
నాలు మగని మగం డాలి ♦నతకరించి
తిరుగుదురు శిష్యుఁ డెదిరించు ♦గురుని గలిని. 83

క. ఉపకారము శూన్యం బగు
నపకారము హెచ్చు నతిథి ♦నభ్యాగతునిం
గృపఁ జూచుగృహస్థుండఁడు
జపహోమసురార్చనాది♦సత్క్రియ లణఁగున్. 84

క. అందఱు కవనము చెప్పుదు
రందఱు నీతులు వచింతు ♦రందఱు దుర్నీ
తిం దిరుగుదు రొరులధనం
బందఱు చవిచూతు రంద ♦అధికులు కలిలోన్. 85

క. లోకం బివ్విధి బహుపా
పాకీర్ణము రోగమయము ♦నల్పాయుష్కం
బై కాఱియపడియెడు హా
హాకారము పెల్లుగా మ♦హాకలియందున్. 86

చ. అని వివరింప నాతఁ డన♦ఘా!జగ మివ్విధిఁ బుణ్యహీనమై
ఘనతరపాపపావకశి♦ఖావలితం బయి మండుచుండఁగా
జన మెటు లక్కలిం గడవఁ ♦జాలికృతంబును జేరుఁ దెల్పు నా
కనవుడు నక్కథా త్తమున ♦కమ్మునినాథుఁడు నవ్వి యిట్లనెన్. 87

మ. కలికాలం బొకమాత్రఁ బోవునొకొ? యా♦కార్పణ్య మాడంబమ
క్కలుషం బక్కలహంబు మచ్చరము నే♦కంబై జగంబెల్లఁ జి
చ్చులఁ బోఁద్రోయఁగ రూపుమాపి విడఁజూ♦చుం గాని యవ్విప్రవృ
త్తుల జాత్యంతరు లాక్రమించుటయె యం♦దు న్నాశమూలంబగున్. 88

చ. వినఁ గన రానిభూవలయ♦భీషణఘోరరణంబు,సస్యనా
శన మొనరించి నో రణఁచు♦సంతతవృష్టియు,దిక్కు లెల్ల తు
త్తునియలుగాఁ బగుల్చుబహు♦తూర్ణనినాదము,జంతుకోటికిన్
ఘనతరభీతిగాఁ గలియు♦గంబుతుదం బొడచూపు భూవరా! 89

చ. ఎవనికి వాఁడె యెల్లజగ♦మేలఁగఁ బూనినలోభవృత్తిచే
నవనితలంబు నల్గడల ♦నాహవ మేర్పడి కీడుమూఁడు భూ
ధవులు విధించుపన్ను లమి♦తం బగు భూములొకింతయేని పం
డవు కఱ వెంతయుం బొడమ♦ఁ జచ్చును లోకులు దాసవారలున్. 90

ఉ. దారుణ మైనయాఁకటికిఁ ♦దాళక యిం డ్లెడఁబాసి దేశసం
చారము చేసిచేసి యొక♦చక్కిని గూఁడుచు గుడ్డ లేక కాం
తారసముద్రతీరవసు♦ధాధరభూములఁ జొచ్చి తోళ్లులున్
నారలుఁజీర,లాకు లశ♦నంబుగ బొందెల నుందు రెట్టులో. 91

గీ. బహుజనం బట్లు దేశముల్ ♦వాసి పోవ
గడమవారలు నట్టులె ♦కుడుపులేక
కటకటంబడి బహురోగ♦కలితు లగుచు
నూళ్ళ నుందురు ప్రాణంబు ♦లూడినట్లు. 92

క. అప్పగిది ముప్పు లొప్పిన
నెప్పటి కప్పుడె ప్రజాభి♦వృద్ధి యగుటయున్
ముప్పదియేండ్లకు మీఱక
యప్పటిమానవుల కాయు ♦వగుటయుఁ గలుగున్. 93

గీ. అట్లు లోకంబు కుతకుతలాడునపుడు
పుడమి నిస్సారమై గొడ్డుపోవునపుడు
తారకంబులు తమగతుల్ తప్పునపుడు
మొదలు లేకుండ ధర్మంబు పోవునపుడు. 94

వ. సకలప్రపంచసంక్షోభం బుప్పతిల్లు దానంజేసి మానవులకుఁ బ్రాణభీతియు దానిచే మనోవ్యథయుఁ దన్నిమిత్తంబున బలగ్లానియుఁ దత్కారణంబున వ్యాధిపై వర్ణ్యంబులును వానిచే నాయుష్యక్షయంబును సంభవించు. అంత గలియుగం బంత కంతకుఁ బరిసమాప్తిం గాంచుచుండఁ గృషివాణిజ్యాదివివిధవృత్తిచ్ఛేదంబున నిర్వేదంబును నిర్వేదంబున నిష్కామతయు నిష్కామత్వంబున నిరహంకారతయు నిరహంకృతి సత్యాభిలాషయు దాన సత్వచింతయు బొడముటంజేసి ధర్మజిజ్ఞాసువు లగుకొందఱు ప్రచ్ఛన్న వేషంబుల నందందు నివసించుమహాత్ము లగుతపోధనులచెంత కరిగి సవినయభక్తిప్రణామపురస్సరంబుగాఁ దమయాపదలు వాకొచ్చి వానికిం దగినప్రతిక్రియలు వారివలన నెఱింగి వచ్చి తదుక్తప్రకారంబున శ్రేయోదాయకంబు లగుసత్కర్మంబు లాచరింతురు. వారిం జూచి తక్కినవారు నట్లే శుభకర్మధర్మపరాయణు లగుదు నంతకు మున్ను క్రమక్రమంబుగ ధర్మహాని కలిగినట్లే యంతటినుండి ధర్మంబున కుత్తరోత్తరాభివృద్ధి సంభవించుసూచన లేర్పడు నది మె కృతయుగారంభంబై పరిణమించు నంత 95

చ. అమితవిపత్పరంపరల నవ్విధిఁ జేడ్పడియున్న వారి కా
హిమరుచి రాహునోట వెలుఁగేని పదంపడి తోఁచినట్లుగాఁ
గ్రమముగ హీనమై కలియుగంబుతుదన్ మొద లూడినట్టియా
యమలినధర్మ మాకృతయుగాదిని గన్నులపండు వయ్యెడున్. 96

వ. అని చెప్పి కుమారా! యింతకుఁ బరమార్థంబుగ నొక్కమాట
చెప్పెద విను మని మఱియు నిట్లనియె. 97

గీ. ఒక్కటేకాల మది ధర్మ♦యుక్త మైనఁ
గృత మగును గానిచోఁ గలి,♦యిదియ భేద
మిందుఁ డొక్కండె యతఁడు పూ♦ర్ణేందుఁ డసియు
క్షీణచంద్రుండు నాఁ బేరు ♦చెంద లేదె? 98

ఆ. సర్వతోగతంబు ♦సంపూర్ణ మవికార
మవ్యయంబు కాల ♦మది నిజంబు
పగలు రేయి నెలయు ♦వత్సరం బను పేళ్లు
గ్రహగతులనుబట్టి ♦కల్పితములు. 99

ఆ. వేదశాస్త్రవిహిత♦వివిధవర్ణాశ్రమ
ధర్మవిధులగతుల♦ తారతమ్య
మనుసరించి కృతయు♦గాదిసంజ్ఞలు గూడఁ
గల్పితంబు లయ్యెఁ ♦గాలమునకు. 100

వ. కావున లోకంబు పాపభూయిష్ఠం బైనకతంబునఁ గలి యనఁబడు. కాలంబ చాతుర్వర్ణ్యంబు స్వస్వధర్మనిష్ఠం బై పుణ్యావర్తనంబున నున్నయెడఁ గృతమనఁబడు ననియు నవికార్యం బైనకాలంబునకుఁ పుణ్యాపాపంబులు లే వనియుఁ గాలము పరమేశ్వరస్వరూప మనియు భావింపు మనుచుఁ గాలతత్త్వం బుపదేశించి వెండియు నిట్లనియె. 101

గీ. అతిసుఖప్రద మైనయా♦కృతయుగమున
మరల ధరణి సమస్తసం♦పదలఁ బొదలు
నఖిలజనులకు శతమాన ♦మాయు వలరు
ధర్మ మప్పుడు నాల్గుపా♦దముల నడచు. 102

క. ప్రతియుగమును బురుషార్థము
లతితరవిపదాకులంబు లగుచుండఁగఁ ద
త్ప్రతిహతి యొనరిచి వానిన్
బ్రతికింతురు యోగమహిమఁ బరమమునీంద్రుల్. 103

క. పర్వమేశ్వరాజ్ఞ యుగముల
పరివర్తనములనుబట్టి బహుకాలముగాఁ
దిరుగుచు వృద్ధిక్షయముల
వరుసన నరలోక మిట్లె వచ్చుచునుండెన్. 104

వ. మఱియు నిందొక్కవిశేషంబు పుష్కరప్రాదుర్భావంబునకు సూత్రభూతంబును సకలశాస్త్రరహస్యంబు నైనది కల దది యాకర్ణింపుము. 105

మ. పరమాత్ముండె యనాదితత్త్వము జగద్భావంబుకోర్కిం జరా
చరమూ నాతఁడె ప్రత్యగాత్మ యన సంసారభ్రమన్ విస్మృతే
శ్వరభావుం డయి కాలచక్రవశుఁడై వర్తిల్లు నాతండె వే
దరహస్యజ్ఞత బంధముక్తిని దనుం దాఁ గాంచు నానందియై. 106

గీ. ముఱికి పట్టినమణి మట్టిముద్ద యగుచుఁ
బులు గడిగినంత రత్నమై వెలయునట్లె
తెలివి సంసారబంధంబు తొలఁగఁజేసి
నంత జీవాత్మ పరమాత్మయై వెలుంగు. 107

చ. అని పరమాత్మతత్త్వము ననాగతమున్ విశదీకరించి,య
జ్ఞనపతియున్ సభాసదులు సన్నుతిచేసి నమస్కరించి,త
న్ననుపఁ బరాశరాత్మజుఁ డనంతమహామహిముండు వారి వీ
డ్కొని నిజయోగశక్తిఁ దనకోరినచోటికి నేగెఁ బిమ్మటన్. 108

చ. హితమితభాషి యైనజన♦మేజయుఁ డాసహాయాయులం బురో
హితులను గూడి క్రొల్వ్యనకు ♦నేగి యథావిభవంబుగా మహా
వ్రతులును ఋత్విజుల్ హితులు ♦రాజులు మున్నగువారికిన్ యథో
చితకనకాంబరాభరణ♦జీవధనాదు లొసంగి పేర్మిమై. 109

గీ. సర్పమారణమునఁ దన♦చలము నుడిపి
తక్షకునిచావు తప్పించి ♦ధన్యచరితుఁ
డైనయాస్తీకమునికి స♦మ్మానవిధుల
వేడ్క సలిపియు నందఱ ♦వీడుకొలిపి. 110

జనమేజయుని యశ్వమేధము—విశ్వావసుని హితోపదేశము

క. పరివారంబును దానును
గరిపురముం జొచ్చిమెచ్చఁ♦గాఁబ్రజ లెల్లన్
ధరనేలు చెంత నొకతఱిఁ
దురగంబును విడిచెఁ గ్రతుకు♦తూహల మలరన్. 111

వ. అదియు నాయుధపాణు లైననెఱజోదులు వెంట రా నిరంత
రాయంబుగ ధరాతలం బెల్ల క్రుమ్మరి క్రమ్మఱి వచ్చి యథోక్త
భూరిదక్షిణల భూసురుల కాహ్లాదంబు సమకూర్చుచు నాజనమేజయుం
డున్నయాగశాలఁ జొచ్చినంత నధ్వర్యుండు నయ్యజమానుండును
దానినాలంభమంత్రోదకప్రోక్షణంబున నపగతప్రాణంబుఁ గావించి
యారేయి దానిచెంత నిద్రింప యజమానురా లగువపుష్టమను
నియోగించి తా మంతంత నుండిరి. ఆకాశ్యయు విధివిహితకర్మా
యత్తయై యట్లుండ నయ్యెద నెఱింగి వాసవుం డామెఁ గామించి
కామరూపంబున నాగుఱ్ఱంబుమేనం బ్రవేశించి యాదేవిం జెనక
నుంకింపఁ దద్వికారం బెఱింగి యారాణి యధ్వర్యుం బిలిచి
ఘోటకంబు కదలుచున్న దని చెప్పె. అంత నతండు జ్ఞానదృష్టిం

బరికించి యది యింద్రునిపని యని జేనికి విన్నవించె. అది విని యతండు మహాభీలరోషానలజ్వాలలు గ్రక్కుచు రౌద్రంబు దాల్చి దిగ్గనలేచి— 112

చ. శ్రుతివిహితక్రియాచరణ♦శూరుఁడ నేని సధర్మపాలిత
క్షితివలయుండ నేని ముని♦సేవనపావనమూర్తి నేని యూ
ర్జితసితకీర్తి నేని ననుఁ ♦జెందినయాఘల మాన,యుర్వి నీ
క్రతువు మహీశుఁ డింక సుర♦రాజునుగూర్చి యొనర్పకుండెడున్. 113

చ. అని శపియించి ఋత్విజుల ♦నందఱఁ బేర్కొని మీాయశక్తిచే
తన కద నాదుజన్మము వృ♦థా యవమానిత మయ్యెఁ జాలు మీా
పని యిఁక నాదురాజ్యమును ♦బాసి సపుత్త్రకళత్రమిత్రులై
చనుఁ డని పల్క నల్కవెలు♦చన్ బెలుచం గని వారు చెచ్చెరన్. 114

క. చనిరి నిజావాసములకు,
జనమేజయుఁ డంత యజ్ఞ♦శాలం దనకాం
తను జుట్టియున్నసుదతులఁ
గనుఁగొని రూక్షస్వరంబు♦గా నిట్లనియెన్. 115

మ. పరరాజన్యకిరీటరత్నరుచిభా♦స్వత్పాదపద్ముండ ని
ర్జరభూనిర్జరకీర్తితామలయశ♦స్సద్ముండ నై మించునా
శిర మీాపాంసుల పాంసులాంఘ్రిహతిఁ గా♦సింబెట్టి యీాజన్మమున్
గురువంశంబుయశంబు నామహిమ ము♦న్మూలించె దుశ్శీలలై. 116

చ. పరపరిచుంబితోష్ఠి యగు♦భార్యను గూడి సుఖింపఁ గోరుకా
పరుఁడును గుక్క ముట్టికొను♦పాపపుఁగూటికి నాసపడ్డకా
పురుషుఁడు వేఁడికోఁకమలి♦పోయినతమ్మని బోనిదీనిమో
మరయఁగఁజాలఁద్రోయుఁ డిపు♦డాహవశాలకు దవ్వులం బడన్. 117

క. అను చతఁడు వప్పుష్టమ్మపైఁ
గినియుతటిన్ దివమునుండి క్రిందికి దిగివ
చ్చినవిశ్వావసు వచ్చటి
జను లచ్చెరు వొంద నిట్లు జనపతి కనియెన్. 118

ఉ. ఏమిది కౌరవేంద్ర! తగునే? తగ వేదినమాటలాడి నా
రీమణి రాణి నిట్టు లొనరింపఁగఁబోలునె? వాసవుం డసూ
యామతి నీదుజన్మమున కడ్డముపెట్టిన వట్టిమాయకున్
నీమది తప్పుదారిఁ బడె నీసతిదోషము లే దొకింతయున్. 119

చ. నలువుగ మూఁడునూర్లసవనంబులొనర్చినవాఁడ వీవు నాఁ
జలమున నీమఘంబు కొనసాగినచోఁ దనుఁ బోలు దీవు నాఁ
దలఁపున దీని కీపదను తప్పినఁ దప్పక కీడు మూఁడు నాఁ
దలఁకున వజ్రియశ్వమున దాఁగుటయాత్రము దోషమందువా? 120

ఉ. ఇంతకు నొక్కమాట విను మీవు వపుష్టమగాఁ దలంచు ని
య్యింతి బలారిపీట సుఖయించినరంభ తదాజ్ఞఁ గాశిభూ
కాంతునిపుత్త్రి నీదుకులకాంతయు నయ్యెను గాన నేలు మా
వంతయుఁ దప్పు లేనియమరాంగన నీజగదేకసుందరిన్. 121

చ. ఇదియును గాక యింద్రుఁ డన నేమనుకొంటి? మహానుభావు తా
త్రిదశుల నేలుసద్గుణగరిష్ఠుఁడు గాఁడె? పతివ్రతామణిన్
మదిఁ దలపెట్టునట్టిమదమత్తుఁడె? జన్మముసం దెఱింగి యి
మ్మ్మదితను రంభఁ జేసి నిను మోసముచేసెను గాక యన్యమే? 122

క. అనుమానింపకు మిఁకఁ దన
మునిమనుమనికొడ లగువపుష్టమఁ జెసకం
గనునంతటి మూర్ఖుఁడు గాఁ
డనఘుఁడు మఘవంతుఁ డామెయతిసాధ్వియగున్. 124

గీ. అతిపవిత్రచరిత్రకు కులాంగనలకు
నన్యసంస్పర్శమున దోష మంటఁ బోదు
మలినతరవస్తుజాతసంపర్కదోష
మగ్నిచంద్రార్కదీప్తుల కంటు నొక్కొ? 124

క. మఱియుఁ బతివ్రత లగుసుం
దరులు నమస్కార్య లనుచుఁ దత్త్వజ్ఞులు చె
ప్పిరి యని యెఱుఁగవె? సన్నుత
చరితకుఁ గులసతికిఁ గీడు సలుపఁగ నగునే? 125

వ. అదియునుం గాక. 126

ఉ. ఆధరణీసురోత్తములు నందఱు నింత కనంతభక్తి నా
రాధన చేయు చిప్పు డపరాధ మొనర్చితి, గాని యింద్రుఁ డే
బాధ పడంగఁ గారణ మపారతపోమహిమాత్మతత్త్వసం
బోధబలాఢ్యు లాద్విజులపూన్కికి జంకుటగాఁ దలంచితే? 127

ఉ. కావున సర్వలోకమును గాలవశంబును గాఁ దలంచి పూ
జావిధి వాసవున్ మఱి ప్రసన్నునిఁ జేసి మహీసురాళినం
భావనచేసి నిల్పి యనవద్యగుణాభరణాభిరామ నీ
దేవిని గారవింపు నరదేవ మునిస్తుతు లొప్ప నెందియున్. 128

క. కృతయాగశతత్రయుఁడగు
చతురుఁడ వఖిలార్థబోధశాలివి నగుటన్
సతతైశ్వర్యసమాహిత
మతిభూతలశక్రకీర్తి మనియెద వధిపా! 129

వ. అని యనునయింప నజ్జనమేజయుండు ప్రసన్నహృదయుండై దైవ
మలంఘ్య మని వేదవ్యాసుండు తొల్లి చెప్పిన నీతివచనంబులు
స్మరించి కోపవేగంబుతో నయ్యశ్వమేధయాగంబునకును శాంతి

చెప్పి తనకుఁ జిత్తశాంతి గలిగించిన యాగంధర్వశ్రేష్ఠుఁ గృతజ్ఞతా పూర్వక ప్రణామపురస్సరంబుగా వీడ్కొలిపి శతక్రతునియెడ వీత మన్యుండై తనయనాదరణంబు వడసిన యవనీసురోత్తముల మరలఁ బిలిపించి తోడ్తెకై వడి గౌరవసత్కారంబు లాచరించి వపుష్టమం బ్రీతితో రావించి మృదుమధురాలాపంబుల ననునయించి పదంపడి సకలపరివారసమేతంబుగా యజ్ఞశాల వెలువడి వచ్చి యిభపురంబు చొచ్చి. 130

చ. యజనము దానభాజనధరామరపూజన మిష్టదేవతా
భజనము సర్వబాంధవసభాజన ముత్సవయోజనంబుఁ దా
బుజుమతిఁజేయు చాత్మహృదయేశ్వరిఁ గాశ్యనుగూర్మిఁ జూచుచున్
బ్రజలు సుఖింప ధర్మపరిపాలన భారతవర్ష మేలుచున్. 131

మ. ఒకనాఁ డాప్తగురుప్రధానతతితో నాస్థానరంగంబుండి య
య్యకలంకం బగుభారతంబు హరివంశాఖ్యానముం బ్రీతితో
సకలంబున్ వినిపించినట్టిముని వైశంపాయనుం జూచి పు
ణ్యకథాగోష్ఠికి డెంద మానపడనస్నానంబుతో నిట్లనెన్. 132

పుష్కరోదంతము.

సీ. కమలనాభుం డెంతకాలంబు వారాశి
నీరంబులో యోగనిద్ర నుండు ?
కాలకారణుఁ డాతఁ డేలీల నేలోకో
పవళించు? మరల నెప్పటికి లేచు ?
లేచి వెండియు నాత్మలీల నెవ్విధి బహు
చిత్రచరాచరసృష్టి చేయు ?
ఎందఱు బ్రహ్మ లైరి యింతకుఁ ? బుష్కరం
బున నెట్లు పొడమిరి మునులుసురలు ?

గీ. సకలభూతప్రపంచంబు సమయునప్పుడు
పరమపూరుషుఁ డాతఁ డెప్పగిది నుండు?
ననెడి నాసంశయము లెల్ల నణఁగఁ గరుణఁ
బద్మనాభప్రభావం బుపన్యసింపు. 133

మ. అన నత్తాపసుఁ డిట్లు వల్కె జననాథా! బ్రహ్మజిజ్ఞాస మీ
ఘనవంశంబున నుగ్గుపా లగుటచేఁ గాంక్షించి తీ విట్లు పా
వననారాయణకీర్తికీర్తనము, నీప్రశ్నాళి గారూఢబో
ధనిరూఢాత్ములు గాక యన్యులు సమాధానంబు లీ నేర్తురే? 134

సీ. కార్యంబు కర్తయుఁ గారణంబును, శాస్త్ర
శాసనీయంబును శాసనంబు,
జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయు, దృశ్యంబు
ద్రష్టయు దృక్కును, దాన యగుచు
సంకల్పనిర్మితస్థావరజంగమ
సర్గంబునకు నధిష్ఠాన మగుచుఁ
బ్రకృతిపూరుషభేదభావమై విలసిల్లు
వేదవేద్యంబు సంవిన్మయంబు

గీ. సత్యసంకల్పసర్వజ్ఞసర్వశక్తి
సచ్చిదానందరూపమై సర్వజగము
నావరించిన నారాయణాఖ్యమైన
యాత్మతత్త్వంబు బోధింప నగునె నాకు? 135

ఉ. ఐనను బాదరాయణమహాముని సద్గురుఁ డాగమాంతవి
ద్యానిధి నాకుఁ జెప్పినవిధంబున నాదిపురాణమర్మవి
జ్ఞానధనాదితేయముని చంద్రపరంపర తెల్పినట్టిచం
దానఁ బరాత్మతత్త్వము యథామతి నీకు నుపన్యసించెదన్. 136

వ. *దేవమానంబున నాలుగువేలయెనిమిదివందలసంవత్సరములు కృతయుగము. అందు తపశ్శౌచదయాసత్యము లనునాలుగుపాదంబుల ధర్మము నడచును. నాలుగువర్ణములవారును స్వధర్మనిరతులై యుందురు. మూఁడువేలయాఱువందలయేండ్లు త్రేతాయుగము. అందు ధర్మము మూఁడుపాదంబులఁ బ్రవర్తిల్లును. చతుర్వర్ణముల వారును మనోదౌర్బల్యంబున లౌల్యము నొందుదురు. రెండువేల నాలుగువందలవర్షంబులు ద్వాపర యుగము. అందు ధర్మము రెండుపాదంబుల నడచు. నాలుగుజాతులవారును రాజసంబున స్వార్థపరు లగుదురు. క్షుద్రజాతు లావిర్భవించును. కృతయుగమం దలిధర్మసేతువులు తలక్రిం దగును. ఒకవేయిరెండువందల హాయనంబులు కలియుగము. అం దొక్కపాదంబున నడచుధర్మంబునకు నాలుగుపాదముల నడచునధర్మము బాధకమగును. సర్వవర్ణముల వారును దామసావిష్టులై కామక్రోధాది దుర్గుణములకు వశ్యు లగుదురు. దయాసత్యశౌచము లంతరించును. వర్ణాశ్రమాచారములు విపర్యయముగాంచును.

ఇట్లు సంధికాలాబ్దములతోడి నాలుగుయుగముల సంవత్సరములు పండ్రెండువేలు. ఆకాల మొక్కదివ్యయుగమనఁబడును. అట్టిదివ్య యుగము డెబ్బదియొక్కమాఱు తిరిగినచో నొతమన్వంతర మగును. సంధికాలములందలి డెబ్బదిరెండువేలదివ్యాబ్దంబుతోడి యట్టిమన్వంతరములు పదునాలుగు జరుగునప్పటి కగువేయిదివ్యయుగముల

* మూఁడువందలయఱువది సౌరమాన సంవత్సరము లొక్కదేవమానసంవత్సర మగును. అనఁగా, సౌరమానమునఁ గృతయుగప్రమాణము ౧౭౨౮౦౦౦ సంవత్సరములు — దేవమానంబున నొకకృతయుగప్రమాణము మన్వంతరసంధి కాలము. పూర్వాపరసంధులఁగూడిన పదునాలుగు మన్వంతరసంధులు పదియే నగుటచే సంధికాలాబ్దములు ౭౨ వేలదివ్యాబ్దము లగుచున్నవి.

కాలము బ్రహ్మ కొక్కపగ లగును. అట్టిపగటితుదఁ బిపీలికాది బ్రహ్మపర్యంతం బైనసమస్తప్రాణివర్గంబునకుఁ గలశరీరసుఖాసక్తి నీక్షించి వివిధభౌతికజాతం బుపసంహరింప నభిలషించి సూర్యుండై చక్షురాదులను వాయువై ప్రాణంబుల నపహరించి సప్తమూర్తి యగువిభావసుండై ప్రచండదీప్తిగభస్తిచయంబులఁ జతుర్దశభువనంబులు నిశ్శేషంబుగ భస్మంబుగావించి ప్రచండమారుతుండై దాని నంతను దనయందు విలీనంబుగావించి యామహోగ్రతేజోరూపం బుపసంహరించి నష్టపంచభూతంబై సర్వశూన్యం బైనయామూత్మంబునఁ దా నొక్కరుండ యద్వితీయుండై పరంజ్యోతియై యోగియై వెలుంగుచు నాత్మమాయాప్రభూతం బగుక్షీరనీకాశమధురదివ్యతోయంబున కేకార్ణవసంజ్ఞితం బైనజలౌఘంబు కల్పించి యందు పవ్వళించి యోగనిద్ర నానందించుచుండు. 137

సీ. అత్యద్భుతం బైనయట్టియేకార్ణవ
విధి యిట్టి దని తెల్పనెరవు లేదు,
అమ్మహాయోగీంద్రుఁడానంద మొందునా
యోగం బెఱుంగువేఁడొకఁడు లేఁడు,
ఎంతకాలం బాతఁ డెందుచే నట్లు ని
ద్రించునో బోధించుదిక్కు లేదు,
ఆయోగి యెట్టిఁడో యాయోగ మెట్టిదో
విశదీకరించెడివేత్త లేఁడు,
గీ. ఏమి చెప్పుదు రాజేంద్ర! యేక మద్వి
తీయ మవ్యక్తము నఖండతేజ మైన
యాపరబ్రహ్మ మాయోగ మవ్విలాస
మాతఁడే కాక తెలియంగ నన్యుఁ డేఁడి? 138

చ. అనుపమయోగయజ్ఞమున కగ్నులు ఋత్విజు లాగమంబులుం
దనర నిజాంతరంగమునఁ దత్పరమాత్ముఁడు యజ్ఞకర్తయై
యనితరవేద్యరూపమున నట్టు లనేకయుగంబు లాజలం
బున శయనించి యుండునని పూర్వులు చెప్పఁగ విందుభూవరా! 139

వ. త్రికాలమూర్తియు సచ్చిదానందమూర్తియు నగునప్పురుషోత్తముని యేకార్ణవశయనోదంతమును గతమహాప్రళయకాలమున నప్పరమేశ్వరునియవ్యాజానురాగంబునకుఁ బాత్రుండు ననేకయుగసహస్రజీవియు నగుమార్కండేయుండు పునఃఖ్యాతం బైనయీప్రపంచమున ముముక్షువుల కుపదేశించుటం జేసి యింతమాత్రం బేని దేవతాపసక్రమోపలబ్ధమై తెలియవచ్చుచున్నది గాని లేకున్న నప్పరాత్పరునియనన్యదుర్గ్రాహం బైనయాప్రలయమందలి మహత్త్వ మెఱుఁగ నెవరితరము? కావున నీప్రశ్నముల కెల్ల నొక్కటియే సదుత్తరంబుగా నతివిస్మయానందజనకం బైనయాచిత్రకథ వినిపించెద నవధరింపుము. 140

### మార్కండేయుఁడు ప్రళయమునఁ బరమాత్మను దర్శించుట.

మ. ప్రళయం బొందిన యీజగంబు తనగర్భంబందు లీనంబుగా
జలజాక్షుం డటు పవ్వళించినతఱిన్ సర్వంసహాతీర్థయా
త్రలు సాగించు చిరాయురున్నతుఁడు మార్కండేయుఁ*డక్షీణపు
ణ్యలసద్యోగసమార్జితేశ్వరవరావ్యాపన్ననైజాకృతిన్. 141

ఉ. ఆపరమేశ్వరోదరగతాఖిలతీర్థము లాడియాడి యా
త్రాపరితుష్టచిత్తుఁ డయి క్రమ్మఱి తన్ముఖమార్గగామియై
వే పయి వచ్చి యెల్లెడలఁ బెల్లగుచీఁకటి వ్రేటు నాటి చూ
పేపఱి క్రిందఁ గూలఁబడియెన్ భయసంభ్రమవిహ్వలాంగుఁడై. 142

---

* అక్షీణపు । ణ్యలసద్దివ్యతపస్సమాధి బలనిర్వ్యాపన్న...... పా. అం.
అక్షీణని । ర్మల పుణ్యాంచిత దివ్యయోగబ్ధనిర్వ్యాపన్న-...

శా. ఆయేకార్ణవ మట్లు చొచ్చి యతఁడాహా స్వప్నమా భ్రాంతియా?
మాయావేశమ? యేమివింత యిది? నిర్మర్యాదగాఢాంధకా
రాయత్తంబయి లోక మిట్లనిలచంద్రాదిత్యతారాదులం
బాయంగారణ మేమి? యేమిగతి యీపై నాకు జీవింపఁగన్.? **143**

మ. ధరణీభాగము కానరాదు గిరిబృందం బంతరించెన్ లతా
తరుగుల్మాదులు లేవు జంతుతతి శబ్దం బేని లే దీదశాం
తరముం జొచ్చి జగంబు చేడ్పడుట సత్యం బౌనె? కాకున్న దు
స్తరలోకాంతరమో యి దంచు బహుచింతామోహనిర్మగ్నుఁడై.

చ. అరయఁగలేక సత్య మప్డు డాపద దాఁట నుపాయశూన్యుఁడై
మరణము నిశ్చయించుకొని మానస మాతఁడు నూలుకొల్పి యీ
శ్వరభజనంబు సల్పి హిమశైలనిభంబును గోటిసూర్యభా
స్వరమును నీలమేఘసదృశంబగు తత్పురుషోత్తమాకృతిన్. **145**

చ. కనుఁగొని యాతఁ డెవ్వఁ డని కన్గొనఁ జేరఁగఁ బోయి యజ్జనా
ర్దనువదనానిలంబువడిఁ దజ్జఠరంబును వెండి చొచ్చి ని
ద్రను గని మేలుగాంచినవిధంబునఁ దన్నుఁ దలంచి తొంటియో
జను జగతీతలాటనము సల్పఁగ వెల్వడి యల్లనల్లనన్. **146**

చ. హరియుదరంబులోని విపినాంబుధిశైలనదీనదంబుల
ధ్వరములు నాత్మధర్మపరతంత్రము జాతిచతుష్టయంబుఁ దా
నరసి యనంతకాల మచలాంతము గానక యెంత కేని వే
సరి తనచొచ్చినట్టిగతి చాలున వెల్వడివచ్చి వెండియున్. **147**

చ. మునుపడినట్టియబ్ధిఁ బడిమున్గుచుఁ దేలుచు నీదు లాడుచున్
దనగతి యట్టులౌటఁ బరితాపము నొందుచు నంత ముందటన్

క. నీ వింతకు బ్రతుకుటయును
నావర్తన మెఱుఁగుటయును నాకతమున నే
కావునఁ గొంకక గురుసం
భావనమతి నన్నుఁ జేరు మార్కండేయా! 154

చ. అన విని భక్తివిస్మయభయంబులు ముప్పిరిగొన్నమానసం
బున మునినాథుఁ డప్పుడు "నమో భగవతే జగత్పతే"
యని భగవత్కృపాశ్రయమునంది వటంబెగఁ బ్రాకి యప్పరా
త్మని గని గోత్రనామములతో నిరుగేలు మొగిడ్చి
మ్రొక్కుచున్. 155

చ. కనుఁగవ మానసంబును మొగంబుఁ గలంక దొలంగ నెంతయున్
వినయవినమ్రగాత్రుఁ డయి వేడ్కె మెయిన్ వినుతించి యోసనా
తనపురుషోత్తమా! లయవిధానము సర్గవర్తనంబు నీ
యనుపమయోగతత్త్వము దయామతిఁ దెల్పి యనుగ్రహింపవే!

చ. అనుడుఁ బరాత్పరుండు విభుఁ డవ్వటశాయి "కుమార! తొల్లి నీ
కనిన సమస్తసృష్టికిని కర్తయు భర్తయు హర్త నైన బ్ర
హ్మను జగదంతరాత్మను జరాచరజాలమ నేన నాతలం
పున మును పంచభూతములు పుట్టును బిమ్మట వానికూడికన్. 157

క. స్థిరచరరూపంబులు స్త్రీ
పురుషవిభేదంబు లగుచు భువనంబులు చె
చ్చెర నేర్పడుఁ బదునాలుగు
వెరవుల బహునామరూపభేదంబులతోన్ 158

క. ఈరీతిని జనియించిన
యీరేడుజగంబులందు నెందును నే నై
నారాయణనామంబుఁ ద్ర
యీరూపముఁ గలుగ నుందు నిచ్ఛాశక్తిన్. 159

గీ. త్రివిధకాలంబు దశవిధదిశలు రేయుఁ
బవలు నెలలును ఋతువు లబ్దములు యుగము
లఖిలతేజంబులు సురాసురాదిగణము
వివిధవర్ణాశ్రమాచారవిధులు నేన. 160

క. శమదమములు సత్యము వే
దము యజ్ఞము పురుషుడుం బ్రధానంబును యో
గము సాంఖ్యముఁ దపమును జ్ఞా
నము ధర్మము నాదువిలసనంబులు పుత్రా! 161

క. ఇది యది యని వివరింతునె?
యెది వినఁ గనఁ దినఁగ ననఁగ నీయఁగఁ గొనఁగా
నొదవును లోకంబుల న
య్యది యంతయు మామకంబ యగు నిక్కముగా. 162

క. ఈవిధమునఁ బలుతెఱఁగుల
నావిర్భావంబు నొందు నవ్విశ్వమునా
భావనఁ బెంపొంది తిరో
భావంబును గాంచుచుండు బహుచిత్రముగన్. 163

క. యుగయుగమును నేనిట్టులె
జగములు కల్పించి పెంచి నమయింతును నా
దగుమాయ,నఖిలవిశ్వం
బగపడు నాకుక్షి నీలయావసరమునన్. 164

వ. అని యాత్మప్రభావం బెఱింగించి యంత. 165

చ. వనజభవాదులైనసురవర్యులు కాశ్యపుఁ డాదిగాఁ దపో
ధనులును నాదుకుక్షి నిజధర్మపరాయణులై చరింతు రా
ఘనులను గూడి నామహిమఁ గాంచి సుఖింపడు మీ వటంచు నా
తని మరల న్నిజోదరపదంబునఁ జేర్చెను దొంటికైవడిన్. 166

క. ఈవిధి మార్కండేయుం
డావిశ్వేశ్వరునిత్యాత్మారసి తద్గ
ర్భావిష్టుం డయి నిశ్చల
భావంబునఁ బరమహంసభావముఁ డయ్యెన్. 167

చ. హరిహరమూర్తి యప్పరమహంసయు నట్లె చిరంబు నమ్మఁ దా
నరయుచు యోగదృష్టిని నిరంతనిరంతర తోయసూక్ష్మగ
హ్వారమున నుండి యుండి పరమాద్భుత మైనతపం బొనర్చి యాం
తరసకలప్రపంచముఁ బ్రదంపడి వెల్వడఁ జేయుఁగోరికన్. 168

సీ. ఆమహార్ణవ మించుకంత గలంచిన
దాన నేర్పడియె రంధ్రంబొకింత
యాచిన్నయాకాశమందు శబ్దంబుతోఁ
గలిసి యొక్కించుక గాలి పొడమె
నాగాడ్పు పెద్దదై యర్ణవంబును గడు
వడిఁ గలంచిన దాన వహ్ని పుట్టె
నాయగ్ని వర్ధిల్లి యర్ణవం బింకింపఁ
బెరిగినచవల నావిరియు నిండె.

గీ. దాన వాన జనించెఁ దద్వర్ష జలము
నడుము పరమాణుసంఘటనంబు పేర్మి
బురదయై గడ్డగట్టంగఁ బుడమి పొడమెఁ
బద్మనాభునిబొడ్డునఁ బద్మ మగుచు. 169

గీ. సురభిళంబు సమున్నత సముచితరంబు
నగ్నిసూర్యప్రకాశంబునై చెలంగె
సచ్చిదానందసంకల్పజనిత మైన
పార్థివం బగుతన్నాభిపద్మ మపుడు 170

మ. పరమాత్ముండును బంచభూతముల నాసాదించి యానందసం
భరితుండై మది లోకసర్గమును సంభావింపఁ దన్నాభిపు
ష్కరగర్భంబున బ్రహ్మపేరఁ జతురాస్యంబై తదంశంబు గో
చర మయ్యెన్ వివిధప్రపంచరచనాసామర్థ్యసంపన్నమై. 171

చ. అతఁడె హిరణ్యగర్భుఁ డఖిలాగమమూర్తి విధాత నా జగ
న్నుతుఁ డగు, నాహిరణ్మయ మనోహరపుష్కరమే నదీసరి
త్పతికులపర్వతాదికలితం బయి యే డగుదీవు లొప్పు నీ
క్షితి యని కీర్తి కెక్కె మునిశేఖరగీతపురాణపద్ధతిన్. 172

వ. అది యెట్లంటేని వినుము. నారాయణోదరసంజాతంబును బార్థివలక్షణలక్షితంబు నయి యాపుష్కరంబునం దిమిడియున్న సారవద్భాగంబులె దేవగణావాసయోగ్యంబు లైన హిమాలయాదిపర్వతంబులై దానికర్ణిక మేరుశైలంబై దానిరసంబు ప్రవిమలమమృతోపమానంబైనజలంబై దివ్యసరిత్తులై తదగ్రభాగంబునఁ జేరుఁగు సలిలంబె చతుస్సముద్రములై దానికేసరంబులె యసంఖ్యాతధాతుమహీధరంబులై తదాస్యపత్రంబులె నుగ్రమశైలదిశలు లైన మ్లేచ్ఛదేశంబులై దానిక్రిందిరేకలె పాతాళనామంబులైన దైత్యభుజంగమనివాసదేశంబులై దానికంటెను గ్రింద నున్న భాగంబె మహాపాతకకర్మంబు లొనరించినవారి పాపానుభవంబునకుఁ దగినయునికిసంక్లేశంబైనఘోరనరకంబై యేర్పడె ననియు, నందు వేలుగ సూచించిన హిమ మేరు నీల నిషధ కైలాస ముంజవ గంధమాదన త్రిశిఖర కాంత మద నోద యాస్త కంపర వింధ్య నామకంబులు దేవగంధర్వయక్షకిన్నరామరక్రీడామందిరంబులై విలసిల్లెననియు, ఆహిమాలయవింధ్యాదిమహాపర్వతంబుల నానుకొని జనపదపట్టణకాననంబుల నలరారుచు వేదోక్తధర్మపరాయణులై నిజవర్ణాశ్రమాచారవిధుల

వర్తించుమానవుల కాకరం బయి భూభాగంబు జంబూద్వీపనామం బున యజ్ఞయాగాదియోగ్యం బైన కర్మభూమి నాఁ బ్రఖ్యాతం బయ్యె ననియు, సకలపురాణజ్ఞు లైనపురాణమునులు ప్రశంసింతురు. ఇదియ యవాఙ్మనసగోచరంబు నప్రతిమానం బమేయంబు నయిన పరమేశ్వరునిత్యసంకల్పప్రభావంబున నావిర్భవించినసకలజగన్మయం బగునాభీపుష్కరము నుదంత మని సనాతనదేవర్షిబ్రహ్మర్షిపరంపరా యత్తమై కర్ణాకర్ణికగా వచ్చుచున్నదని చెప్పి వెండియు వైశంపా యనుండు జనమేజయున కిట్లనియె. 173

పౌష్కరసర్గము

ఉ. ఆకమలాసనుండు పరమాత్ముని యాశయ ముం దలంచి మా
యాకరణంబు చేకొని యనంతరసృష్టిఁ దలంచునంత ము
న్నాకమలాక్షుకుక్షి నణఁగారుతమంబు రంజంబునున్ మహా
భీకరరాక్షసాకృతుల వెల్వడియెన్ మధుకైటభాకృతిన్. 174

ఉ. ఘోరశరీరముల్ నిమురకోఁటులు కానుగతుల్ చెలంగ నీ
లారుణవస్త్రధారు లగుచు నద్దముజుల్ నడగొండలట్ల సం
చారము చేయు చవ్విభునిచక్కి జలంబు గలంచి యాడుచున్
గేరుచు వచ్చి యాభువన నిర్మితి చేయువిధాత నల్కమై. 175

చ. కనుఁగొని నీ వెవండవు? మొగంబులు నాలుగు వచ్చె నెట్లు? నీ
జనకుఁ డెవండు? నీ విపుడు సల్పెడికర్జ మదేమి? మమ్ము మా
ఘనతరబాహుదర్పమును గాంచక యిట్టులు కూరుచుండు దే?
యని యొనరింపర మ్మని యహంకృతిఁ బైఁ బడఁబోవునంతటన్. 176

గీ. కమలసంభవుఁ డట్టులే కదలకుండి
యిట్టులనె, వీర నన్నుమీ రెఱుఁగ రొక్కొ?
యెవని నెవ్వ రెఱుంగక యెవ్వఁ డందు
రతఁడు పుట్టించె నను స్రష్ట నగుదు నేను. 177

చ. అనుటయు దానవుల్ కినిసి ♦యయారా!ప్రపంచమునందు మాకుఁ ద
క్క నెగడెనే యెవం డనఁగఁ!♦గప్పుడు మేము రజస్తమోరజం
బున జగముం ద్రికాలము న♦మోఘముగా నతిలోభమోహక
ల్పనమున నర్థకామసుఖ♦బద్ధముఁ జేయుదు మెల్లలోకముల్. 178

క. కావున నెల్లయుగంబుల
మావలననె విశ్వ మెల్ల ♦మసలుట గనుచున్
నీ వనినయెవ్వఁ డనువాఁ
డీవును నన్మన్మహత్త్వ ♦మెప్పుడెఱుఁగఁ దగున్. 179

చ. అనవుడు నాచతుర్ముఖుఁడు ♦నక్షరసత్యపరాత్మసత్త్వసం
జనితుఁడ నే నతం డఖిల♦సాత్త్వికరాజసతామసప్రపం
చనిలయుఁ డాత్మయోగమున♦సన్మయుఁడై పవళించె నిందె యా
తని బిలువుండు పోకిరి మ♦దం బణఁగించు నటంచుఁ బల్కెడున్.180

చ. సరి యని పోయి వారు జల♦శాయిని గన్గొను శాంతదర్పులై
కరములు మోడ్చి యోవరద!♦కాలమయా!భువనోదరా!దయా
భరణ!యమోఘదర్శన!య♦పారతపోమహిమా!మహేశ్వరా!
శరణు నమశ్కృతంబులు ప్ర♦సన్నత చెంది వరం బొసంగవే! 181

మ. అనియర్థించుడు నీశ్వరుండు నగి మీ♦యభ్యర్థనీయంబు జీ
వనమా? నాశనమా? వచింపుఁడనఁగా ♦వా"రెవ్వరు న్మన్ను చా
వనిచోట న్మరణంబు మాకు లభియిం♦పన్నీదుగర్భంబునన్
జనియింప న్నినుఁ గోరువార"మనుడు ♦న్నారాయణుం డత్తఱిన్.182

చ. అనయము మీదుకోర్కి ఫల♦మందును రాఁగలకల్పమందు నా
తనయులుగా జనింతు రది ♦తప్ప దటంచు వచించి యాత్మసం
జనితరజస్తమోమయు ల♦సాధ్యపరాక్రము లైనవారలన్
దనతొడలం దణంచె జల♦తల్పగతస్థిరసత్త్వమూర్తియై. 183

వ. అనంతరంబు బ్రహ్మయు నూర్ధ్వబాహుండై మధ్యందిన ప్రభాకరుం బోలి దివ్యతేజఃప్రభాభాసమానుండై పరమాత్ము నాత్మ నెలకొల్పి యుగ్రతపం బాచరింప నవ్వయుండు శివకేశవాత్ముండు నర్ణవశయనుండు నగునప్పరమహంసునియుత్తమాంశంబులై సాంఖ్యాచార యోగాచార్య ఖ్యాతి గపిలనారాయణు లనుమహర్షు లుద్భవిల్లి యప్పద్మసంభవుం జేరి తనతపోబలంబున నుదయించినతమ్ముం జూచి యానందించునతనితోం దొలుతం దమమతంబులం గలభేదంబులును బరస్పరవిరుద్ధవిషయంబులు నుగ్గడించి చర్చించి తుదకుం బరమార్థంబైన నుభయమతంబుల కైక్యంబు సిద్ధాంతీకరించి యతనియనుగ్రహంబునకుం బాత్రులై రంత నప్పరమేష్ఠియు వ్యాహృతిత్రయంబున లోకత్రయంబును మానసంబునం బుత్త్రత్రయంబును సృజింప నమ్మానసపుత్త్రు లతనికి నమస్కరించి తండ్రీ! మాకర్తవ్యం బాన తిమ్మని ప్రార్థించిరి. అపుడు బ్రహ్మ తనయంతికంబున నున్నకపిలనారాయణుల సాభిప్రాయంబుగ వీక్షించె నమ్మహామునులును వారిం గనుంగొని "పురుషా న్న పరం కిఞ్చి త్సా కాష్ఠా సా పరాగతిః" అనుశ్రుతిం బ్రతిపాదితంబై నసత్యజ్ఞానానంతమ్ము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమ్ము నగునిర్గుణపరబ్రహ్మంబును ధ్యానింపుం డని యుపదేశించి వారిం దోడ్కొని తమదారిం జని రంత నప్పితామహుండు వెండియు. 184

చ. అనఘతపం బొనర్చి తనకాయంగమునందు సగంబుం గాంతం గా
నొసరించి యన్నిటం దనకు'నుద్దియనం దగునాలతాంగిపొందునన్
సఖిలప్రజాపతులం గదోయధుల న్నదులన్ సృజించి యం
తన ధవళాంగియు న్నిగమకధాత్రియు నై నకుమారికం గనెన్. 185

వ. అట్లు లోకేశుండు గాంచినవిశ్వేశ ధర్మ దక్ష మరీ చ్యత్రి పులస్త్య పులహ క్రతు వసిష్ఠ నారద మాంగిరో భృగు మనువు లనుత్రయో

దశప్రజాపతులును దేవర్షి బ్రహ్మర్షి రాజర్షివంశంబులకుఁ గర్తలైరి.
వారిలో దక్షుని కుదయించిన యదితి దితి దను కా లానాయు
స్సింహికా ముని ప్రభోధా సురసా క్రోధా వినతా కద్రువు లను
పం(డెండుగురుపుత్త్రికలును మరీచిబ్రహ్మపుత్త్రుఁ డగుకశ్యపప్రజా
పతికిని రోహిణ్యాదిసంజ్ఞలు గలసప్తవింశతితనూజలు చంద్రునికిని
భార్యలైరి. అందు కశ్యపుని కదితిగర్భంబున నింద్ర విష్ణు భగ
త్వష్టృ వరుణాంశార్యమ రవిపూషమిత్ర మను పర్జన్యు లనుద్వాదశ
విధదివౌకసులు వరిష్ఠులై యాదిత్యు లన నుదయించిరి. దితియందు
దైత్యులును దనువునందు దానవులును కాలయందు కాలకేయా
సురరాక్షసులును అనాయువునం దాధివ్యాధులును సింహికయందు
గ్రహములును మునియందు గంధర్వులును ప్రబోధయం దప్సరసలును
సురసయందు సరీసృపములును క్రోధయందు భూతపిశాచయక్షగు
హ్యకులును గోవులు గాక తక్కినచతుష్పాదంబులును వినతయం
దరుణగరుడులును కద్రువునందు సర్పరాజంబులు మహీధరంబులు
నుదయించిరి. మఱియుఁ బరమేష్ఠిగాంచినలక్ష్మీ కీర్తి సాధ్యా విశ్వా
మరుత్వతీ నామకలైనపంచకన్యలును ధర్మునకు ధర్మపత్నులైరి.
అందు లక్ష్మికిఁ గాముఁడు కీర్తికిద్రుమనాదులు సాధ్యకుసాధ్యులువిశ్వకు
విశ్వేదేవులుమరుత్వతికి మరుత్వంతులును బుట్టిరి. బ్రహ్మతొలికూఁతు
రగుగాయత్రికినాలుగువేదంబులుజనియించె. మఱియు నయ్యబ్జయోని
కామరూపిణి యగుతనయర్ధాంగిని గోరూపధారిణి యగుసురభిని
గావించి దానిపొందున నిర్ఋతి సర్పైకపా త్పినాకి మృగవ్యాధ
దహ నేశ్వ రాహిర్బుధ్న్య కపాలి రుద్ర సేనానులను నేకాదశరుద్రు
లను గోవృషభంబును నానావిధధాన్యంబులను బహువిధలతా
తరుగుల్మంబుల నోషధీవనస్పతుల నుత్తమమైనయమృతంబు నరుంధ

త్యారుణీసురభీనామకం బైనపుత్రీత్రయంబును చ్యవనాదితనూజులను సృజయించె. అందుసురభి ధర్మునకు సహధర్మచారిణియై యష్టవసువులం గనియె. ఇట్లు లోకత్రయంబు పుష్కరమూలంబుగ నావిర్భవించి వర్ధిల్లె. ఈపౌష్కరసర్గవృత్తాంతంబు సకలదురితహరణంబు గోప్యంబు నగు నని వివరించినంత నాఱేఁడు సంతుష్టాంతరంగుఁడై మునీంద్రుని కిట్లనియె. 186

## బ్రహ్మయుగము

చ. పరమమునీంద్ర! నీకరుణఁ బంకజనాభమహత్త్వతత్త్వసం
భరితము నద్భుతంబు నగుపౌష్కరసర్గ మెఱింగితిన్ సవి
స్తరముగ, సాంఖ్యయోగములసత్యము తేటపడంగ వ్యాసవా
క్పరిచిత మైనబ్రహ్మయుగవర్ణన మింక ననుగ్రహింపుమీ! 187

చ. అనుటయు మౌని యిట్లనె ధరాధిప! సుస్థిరచిత్తవృత్తివై
వినుము త్రికాలసత్యము నవేద్య మచింత్య మనామరూపవ
ర్తనము నఖండ మైనపరతత్త్వ మొకండు సదాత్మకంబు దాఁ
దనకు నిమిత్తమై యవిదితస్వపదంబు ననాదియై తగున్. 188

చ. అదియె పరాత్పరుండు పరమాత్ముఁడు పూరుషుఁ డాద్యుఁ డంచుఁ బ్రాఁ
జదువులు వల్కు నవ్విభుఁడు సర్వజగంబు సృజింతు నేను నా
ముదమున బ్రహ్మభావమునుబొంది యహంపదవాచ్యుఁ డయ్యె న
ప్పదమునఁ బంచభూతములు భౌతికముల్ జనియించె నెల్లెడన్. 189

చ. అరయ నతం డహమ్మనుట యప్పద మందు సమస్త మీచరా
చరజగ ముప్పతిల్లుటయు సన్నుతి కెక్కె స్వభావ మంచు, న
ప్పురుషుఁడె నైజమాయ జగముల్ గలిగించియు నిండియుం దదం
తరచగుఁ డయ్యు ద్రష్ట యయితాఁ గన రాక వెలుంగుజ్యోతియై. 190

చ. మును వివరించినట్లు మునుమున్న తదీశ్వరమాయచే జనిం
చినవియదాదిభూతములఁ జేవయు లావును గల్గు పృథ్వి నీ
టను బడి మున్గిపోవుచుఁ "కటా! పయినుండఁగఁ గోరి క్రింది కిం
కను దిగజాఱుచుంటి గతి గల్గదొకో నను నుద్ధరింపఁగన్?" 191

చ. అని కడు మొఱ్ఱవెట్టఁ బరమాత్మ తదార్తరవంబు విన్నచొ
ప్పుననె వరాహరూపమును బూని తటాలున దూఁకి యర్ణవం
బున నడుగంట మున్గి తన పోటుకోఱలఁ బట్టి యెత్తి భూ
మిని బయి నిల్పి తా నధిగమించెను వెండియు బ్రహ్మభావమున్. 192

గీ. అట్టిబ్రహ్మమయంబు దివ్యంబు నైన
తేజ మాకాశ మనఁగ నుతింపఁబడియె
అందు జనియించి బ్రహ్మ విధాత యగుచు
సర్వభూతపితామహసంజ్ఞ వడసె. 193

గీ. నాఁటగోలెను బ్రహ్మమానసముబలిమి
నేఁటి దనుకను ధర యిట్లునిలిచియుండెఁ
దాదృశజ్ఞానయోగమే ధర ధరించు
శేషకూర్మాదు లని ప్రశంసింపఁబడును. 194

ఉ. ఇమ్మగ నట్లు నిల్చిన మహీసతిగర్భమునుండి వచ్చునీ
రమ్మనఁ గల్గినట్టివివరమ్మున మేరువు పొల్చె దానియ
గ్రమ్మున సూర్యమండలముగ్రాలెఁ బ్రభాకర మాచు దానిమ
ధ్యమ్మున నుండి వెల్వడె సుధామయకాంతులఁ జంద్రబింబమున్. 195

గీ. ఉమ యనఁగ బ్రహ్మవిద్య యాయమను గూడి
సోముఁ డనఁగ సనాతనధామభూతుఁ
డైనయాబ్రహ్మ తన్మండలాభిమాని
బ్రాహ్మణాధ్యక్షుఁ డగుచునుబరఁగె నట్లు. 196

క. ఆసోమునియాస్యంబున
శ్వాసం బక్షరమయంబు సర్వార్థసము
ద్భాసక మగు తేజంబున
భాసిల్లుచు వెడలె వేద వాఙ్మయ మగుచున్. 197

గీ. మఱియుఁ బరమాత్మమహిమసంభవము లైన
యాచతుర్వేదములయర్థమాత్మఁ దలఁచి
యాధిదైవికనిర్మాతయైనసృష్టి
కడఁగి యాధ్యాత్మికార్థసంఘటన కపుడు. 198

చ. సలిలము మాంసశోణితవసామదమజ్జలు,భూమి చర్మ మె
మ్ములు,గగనంబు కర్ణములు మున్న గుచిల్లులు,పావకంబు క
న్నులు,పవనంబు ప్రాణములునుం గలిగింపఁగ ముఖ్యకారణం
బులుగఁ దలంచె దివ్యుఁ డగుపూరుషు నొక్కని జీవసంజ్ఞునిన్.199

గీ. ఆసనాతనపురుషుఁడే యట్లు జీవ
పురుషుఁడై యింద్రియంబులఁ బొందుకతన
నాత్మతత్త్వంబు మఱచి మాయావశుఁ డయి
మసలుచుండు శరీరాభిమాని యగుచు. 200

గీ. ఆతఁ డెంతకు నిజతత్త్వ మరయలేఁడొ
యంతదనుకను సంసార మాశ్రయించి
పూర్వపూర్వానుగతకర్మభోక్త యగుచు
మరణజననప్రవాహనిర్మగ్నుఁ డగును. 201

గీ. ఇంద్రియంబుల నిర్జించి యెపుడు యోగ
శక్తిచేఁ దన్నుఁ దాఁ గనఁ జాలు నతఁడు
సర్వబంధంబు లప్పుడే సడలిపోవ
బ్రహ్మభావంబు గాంచి కైవల్య మొందు. 202

వ. ఇయ్యది యఖిలవేదాంతవిజ్ఞానసునిశ్చితం బైనపరమాద్వైతసిద్ధాంతం
బింక దీని నిటుంచి ప్రకృత ప్రసంగం బాకర్ణింపుము. 203

గీ. ఆది నవ్యక్తుఁడై యట్లువ్యక్తరూప
మలర నావిర్భవించిన యట్టిపంచ
భూతమయుఁ డైనయాదివ్యపూరుషుండె
బ్రహ్మ పరమాత్మ స్రష్టనాఁ బరగుఁ జుమ్మి. 204

ఉ. ఆతఁడు దివ్యపూరుషసమాఖ్యుఁడు నైజశరీరకాంతి వి
ద్యోతితమేరుపృష్ఠమున నుండి సనాతన మాత్మతేజమున్
జేతమునందు నిల్పి గురునిష్ఠఁ దపం బొనరించెఁ దా నసం
ఖ్యాతసమంబు లాత్మజని తాగమతత్త్వపరాయణాత్ముఁడై. 205

గీ. అతనితపమున కునికిపట్టయినయట్టి
యతివిశాలంబు రమణీయ మైనమేరు
శిఖరమే బ్రహ్మలోక మై చెన్నుమీఱె
నతఁడు నట్లుండి సృష్టి చేయందలంచి. 206

గీ. తాన యానందలీల ద్వంద్వంబు గాక
నలరి క్రీడించి యవ్యక్తమక్షరంబు
నైనతన తేజమున నభివ్యక్తపఱిచి
క్షరము నామరూపాత్మకసర్గ మతఁడు. 207

గీ. బ్రహ్మవిష్ణు మహేశ్వరాహ్వాయము లలర
సకలభౌతిక జగదధిష్ఠాన మఖిల
కారణంబును సర్వకార్యంబు నగుచు
విశ్వరూపంబు ధరియించి వెలసె నంత. 208

క. తొలి వెలసిన వేదంబుల
నలుమొగములఁ దాల్చినట్టి నలువముఖమునం
గలిగిరి బ్రహ్మోక్తవిధుల్
వెలయింపఁగఁ జాలునట్టివిప్రులు తొలుతన్. 209

గీ. బ్రహ్మముఖమున జనియించి బ్రహ్మ మెఱిఁగి
బ్రహ్మపారాయణ మొనర్చి బ్రహ్మవిధుల
నాచరించుట బ్రాహ్మణు లైరి వారు
వారె పురుషార్థముల కాలవాల మైరి. 210

గీ. బ్రహ్మములు లీనమైయుండు బ్రహ్మమందు
బ్రహ్మములయందు లీనమై బ్రహ్మ ముండు
ననెడిపరమార్థ మెఱుఁగుబ్రాహ్మణుఁడె బ్రహ్మ
వేత్త నావేదవేత్త నా వినుతి కెక్కు. 211

వ. మఱియు విజ్ఞానఘనుం డగునప్పరమపురుషుని నేత్రంబుల ఋగ్యజుస్సులును, జిహ్వాగ్రంబున సామంబును, మూర్ధంబున నథర్వవేదంబును బొడముటంజేసి పురుషోత్తమోత్తమాంగ సంభూతంబైన వేదచతుష్టయం బెల్లవిద్యలకు శీర్షంబై బ్రహ్మయజ్ఞాంగంబై పరిఢవిల్లె నిత్యబ్రహ్మయజ్ఞనిష్ఠుండై యింద్రియ నిగ్రహంబున నరివర్గంబు నిర్జించి సాధనచతుష్టయసంపన్నుండై సత్వగుణప్రధానుండై యమ నియమాద్యష్టాంగయోగాభ్యాసంబున నాత్మతత్వానుసంధానంబు గావించుబ్రాహ్మణుండు సర్వబంధవిముక్తుండు జీవన్ముక్తుండుపునరావృత్తిరహితుండునై శాశ్వతంబైనబ్రహ్మానందభావంబు నొందు నిట్లు సత్యప్రవృత్తిని సకలఫలత్యాగపూర్వకంబుగ నిఖిలవేదోక్తకర్మంబు లాచరించుచు నిర్వికల్పసమాధిని బ్రహ్మానంద మనుభవించుసమయంబె బ్రహ్మయుగము నాఁబడు నదియునుం గాక యిప్పట్టున నింకొక విశేషంబు వక్కాణించెద సావధానుండవై యాకర్ణింపుము. 212

### బ్రహ్మయజ్ఞము చేయుట.

చ. అనఘతపోగరిష్ఠులు జటాజినవల్కలధారు లాత్మన
ర్తనులు జితాంతరంగు లగు బ్రాహ్మణవర్యులు మేరుపర్వతం
బున నతిపావనం బగుతపోవనమం దొకనాఁడు పంకజా
సనుఁ గని భక్తిమైఁ గ్రతువు సల్పఁగఁ బ్రేరణచేసి రంతటన్. 213

ఉ. ఆపరమేష్ఠి వల్లె యని యాహవయోగ్యపదార్థ సంతతుల్
దాపున నవ్వనీస్థలిఁ జెలంగ సరస్వతిఁ గూడి యజ్ఞదీ
క్షాపరుఁడయ్యె మంత్రములఁ గర్తయుఁ భోక్తయుఁ దానుగాఁగ స
త్తాపసు లెల్ల ఋత్విజులు ద్రష్టలు వేత్తలు గాఁగ నయ్యెడన్. 214

గీ. అధ్వరాంగంబు నాగ్నేయ మైనజిహ్మ
చేవ నరణిఁగఁ జేసి త్రచ్చెను విధాత
దాన జనియించె నగ్నిహోత్రంబు దానిఁ
బ్రజ్వలింపఁగఁ జేసె నధ్వర్యుఁ డెలమి. 215

ఉ. అంతట యాగకల్పవిహితాఖిలహోమము లాచరించుచున్
శాంతమనస్కు లాగమవిశారదు లైనమహీసురోత్తముల్
సాంతముఁ జేసి రాసలిలజాసనుజన్నము సర్వభూతజా
తాంతరవర్తి యైనపరమాత్ముని కర్పణ మంచు నత్తఱిన్. 216

చ. సరసిజసంభవుండు తనజన్నముఁ గూరిమిఁ దీర్చినట్టియా
ధరణిసురాళికిం దగినదక్షిణ గాఁగ నొసంగె రమ్యకం
దరము సుగంధిపుష్పఫలనమ్రలతాతరుసుందరంబు భా
స్వరమణిహేమరంజితవిశాలతటం బగుమేరుశైలమున్. 217

ఉ. దానిఁ బ్రతిగ్రహించి వసుధామరు లెల్లరు మున్నులేనిదు
ర్మానము మానసంబు లలమం దమపాళులకై పెనంగి యె
వ్వానికి వాఁడె పెద్ద దగుభాగము గైకొనఁగా దురాశ న
ద్దానిఁ బగుల్పఁజేసి యమితం బగుయత్నము నెల్లభంగులన్. 218

గీ. గోరంతపసిఁడియే న
మ్మేరువునన్ గిల్లికొనెడి మెయి గానక వే
సారుచుఁ జదికిలఁబడి ని
ట్టూరుపు పుచ్చుచును లేవ నోపక యుండన్. 219

గీ. ఆపుడమివేల్పు లట్లు నిరర్థకముగఁ
బడుప్రయాసంబు గాంచి యోర్వంగ లేక
యాహిరణ్మయధరణీధ రాభిమాన
దేవత వచించె నిట్టు లదృశ్య యగుచు. 220

మ. వినుఁడీ బ్రాహ్మణులార! సుస్థిరము దుర్భేద్యం బహార్యంబు నీ
కనకక్ష్మాధర మేడ? నొండొరులపైఁ గ్రౌర్యంబు మాత్సర్యముం
గనలుం బూనినమీర లేడ? నిటు లాకల్పాంత మీపర్వతం
బును భేదింపఁ గడంగి తీయుదురొకో పూసంతబంగార మేన్? 221

క. మీ రెంత కీపరస్పర
వైరంబు వహింతు రంతవఱకు నిజం బీ
మేరువున నింతముక్కయుఁ
జేరఁగ మీతరము గాదు సిద్ధము సుండీ! 222

మ. అనునప్పర్వతదేవతోక్తులను దా మాలించి యవ్విప్రు లె
క్కినకోపంబును డించి శాంతి మదిలోఁ గీలించి యన్యోన్యమై
త్రిని బాటించి ధనార్జనంబుపయి నిర్వేదంబునం దొంటిభం
గిని విజ్ఞానధనార్జనంబునకు రక్తిం జూపి రొక్కుమ్మడిన్. 223

సీ. బ్రహ్మయజ్ఞమునఁ బావన మైనయమ్మేరు
భూధరం బానాఁడు మొదలుగాఁగ
బ్రహ్మలోకఖ్యాతిఁ బరఁగె నాబ్రాహ్మణు
లాపుణ్యభూమియం దధివసించి

సకలాశ్రమాచారసంపన్నులై యంత
రరివర్గ మల్లన నణఁగఁద్రొక్కి
ఘనతపస్స్వాధ్యాయకర్మతత్పరు లయి
బ్రహ్మవిద్యాగోష్ఠిఁ బరవశులయి
గీ. యఖిలజగదంతరాత్ముఁ డనాదిమధ్య
లయుఁడు సద్రూపుఁ డానందమయుఁడు నైన
పరమపూరుషు సేవించి భవ్య మైన
ముక్తిమార్గంబు గాంచిరి మోదమలర. 224

గీ. అట్టు లింద్రియనిగ్రహం బలరఁ నెవ్వ
రఖిలవేదోక్తకర్మంబు లాచరించి
బ్రహ్మవిద్యాగరిష్ఠులై పరగుచుందు
రమ్మహాత్ములు మోక్షంబు నందఁగలరు. 225

క. అని పలికినయమ్మునిఁ గని
జనమేజయుఁ డవ్వరాహచరితము నరసిం
హునిపుణ్యకథయు వామను
ననఘోదంతంబు తెల్పు మని యడుగుటయున్. 226

ఇది

ఆంధ్రభాషానుశాసన ప్రేమతత్త్వకలివిడంబన సంస్కృతవాఙ్మయ
చరిత్రాద్యనేకకృతికర్తయు, ఆంధ్రవిశ్వకలాపరిషత్కళా
శాలాసంస్కృతాంధ్ర భాషాధ్యాపకుఁడునైన
మల్లాది సూర్యనారాయణశాస్త్రిరచించిన
యాంధ్ర భవిష్య పర్వమునందు
ప్రథమాశ్వాసము

---

# ఆంధ్రభవిష్యపర్వము

## ద్వితీయాశ్వాసము

శ్లో. చరాచరజగత్సర్వం, యదిచ్ఛామాత్రనిర్మితమ్,
సచ్చిదానంద మవ్యక్తం తత్తేజస్సంస్మరామ్యహమ్

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయునకిట్లని చెప్పందొడంగె 1

బ్రహ్మ యింద్రాదులకాధిపత్యము లిచ్చుట.

క. కారణకారణుఁ డగు శ్రీ
నారాయణునాజ్ఞఁ బూని నలినాసనుఁ డీ
యీరేడుజగంబుల నొగిఁ
దీరిచి తన్నాయకుల విధింపఁ దలంపన్.

గీ. దివ్య మాదిత్యతేజంబు తేజరిల్ల
నదితిగర్భంబునం బుట్టె నఖిలలోక
పాలకుం డైనవిష్ణువు వజ్రకవచ
ధారియై సుమనోమనోహారి యగుచు. 3

క. జనియించినయబ్బాలుని
మునినాథులు సకుశహస్తములఁ గూరిమి నె
త్తినకారణమున గౌశికుఁ
డనుపేరం బరఁగె నాతఁ డాదిత్యులలో. 4

చ. జలజభవుండు నాక్షణమ సర్వకలాపరిపూర్ణు దేవతా
కులపతిలక్షణాంచితు నకుంఠితతేజు నుదారుఁ గౌశికున్
గొలువఁగ నెల్లనిర్జరులు, కోరి భజింపఁగ నెల్లతాపసుల్,
తొలి యభిషిక్తుఁ జేసి సురలోకముఁ బ్రోవఁగ నంత నేరిమిన్. 5

సీ. బ్రాహ్మణౌషధి తపోగ్రహ తారకా యజ్ఞ
ములవిభుత్వంబు సోమున కొసంగి,
యఖిలనదీసాగరాధిపత్యంబును
వరుణదేవున కిచ్చి, వాయువునకు
నాకాశశబ్దబలాధిపత్యంబును,
యమునకుఁ బితృలోకసమభిరక్ష,
వహ్నికి బహువిధప్రాణిసంరక్షణ,
మర్థవిభుత్వంబు యక్షపతికి,

గీ. నైరృతునకు నిశాచరనాయకత్వ
మాదరంబున నొసఁగి యత్యంతభక్తి
నఖిలలోకలయాధిపత్యంబుతోడ
సకలభూతేశ్వరత్వ మీశ్వరుని కిచ్చె. 6

వ. మఱియు నప్సరోగణంబులకుఁ గామదేవుని గంధర్వులకుఁ జిత్రరథుని సాధ్యుల కరుణని దైత్యరాజ్యయావరాజ్యంబులకు హిరణ్యాక్షహిరణ్యకశిపులను, అనాయుషాపుత్రులకు వృత్రుని గాలకేయులకు మహాకాలుని నిఖిలచతుష్పాదజాతులకు నందిని వివిధవిహంగకులంబులకు వినతానందనుని సకలసరీసృపంబులకు శేషవాసుకితక్షకులను బహుళోత్పాతంబులకు రాహువును దినపక్షమాసాయనంబులకు సంవత్సరుని బయోదంబులకుఁ బర్జన్యుఁ బర్వతంబులకు హిమవంతుని నాయకులఁ జేసి వారెల్లరు తమయాధిపత్యంబులు నిరంతరాయముగ నిర్వహించుచుండఁ దాను సర్వద్రష్టయై యానందించుచు బుష్కరంబున నుండె నంత నొక్కసమయంబున.

వరాహప్రాదుర్భావము.

క. పరమేశ్వరు మాయ ధరా
ధరములు పై కెగసి పక్షదర్పంబున ని
ర్జరమార్గంబునఁ బడమటి
కరిగి హిరణ్యాక్షుపురముఁ గనారసి లీలన్. 8

చ. ధరణికి డిగ్గి యెన్గులు ప్రాసాదంబును జొచ్చి కలంచుభంగిన
ప్పురముఁ గలంచి యాడె "సురపుంగవువీటికి సాటియౌనె యీ
సురరిపుప్రోలు? నేఁడె యిది చూర్ణముగాదె!" యటంచు నెల్లమం
దిరములు నేలమట్టముగ దిగ్గనఁ గూలఁగ దైత్యు లార్వఁగన్. 9

ఉ. తల్లికి బిడ్డ యన్నలకుఁ దమ్ములు చెల్లెలి కక్క తండ్రికిం
దల్లియుఁ బిల్ల లెక్కడఁ గనంబడకప్పుడు పౌరు లెల్లరున్
బె ల్లగునేడ్పు లార్పులును బిల్పు లదల్పులు బొబ్బ లొప్పఁగన్
గొల్లున గోలుగో లనుచుఁ గూయిడు చేగిరి తేనికోటకున్. 10

చ. అపుడు హిరణ్యనేత్రుఁడు సహోర్యదురాకృత మాలకించి సం
కుపితమనస్కుఁడై కొలువుకూటము చేరి యమాత్యమిత్ర యో
ధపతులఁ గాంచి నాబలముఁ దర్ప మెఱుంగక యింద్రుఁ డిట్టి నీ
చపుఁబనికిం గడంగె నిదిసత్యము లెం డిఁక దండయాత్రకున్. 11

చ. అని వచియించి పౌరతతి నాపదకుం దొలఁగించి వేఱుచో
నునిచి యమాత్యవర్గమును యోధపతుల్ చతురంగసైన్యమున్
గొని తనతోడ రాఁ గదలె ఘోరరణాచరణాభిలాష నం
దనసహితంబుగా నమర నాథపురంబును రూపుమాపఁగన్. 12

క. తనపురికి హిరణ్యాక్షుం
డని సల్పఁగ వచ్చుచుండె నని చారులచే
వినిన సహస్రాక్షుండును
ఘనవాహినితోడ నెదురుగాఁ జనుదెంచెన్. 13

క. ఇరువాఁగు నడుమ నొక్కట
నొరసికొనెం బ్రబలమకాలికోదధులగతిన్
గరితురగస్యందనభట
పరిజనరవకలితవివిధవాద్యధ్వనితోఁ. 14

ఉ. ఆరణరంగ మప్పుడు సురాసురవీరు లొనర్చునస్త్రశ
స్త్రారభటిం గృపాణనిశితాయుధకుంతగదాకుఠారదు
ర్వారశతఘ్నికాపరిఘపట్టిసతోమరభల్లచాపవి
స్ఫారకరప్రహారపరుషధ్వని భీకర మయ్యె నయ్యెడన్. 15

మ. ఘనబాహుండు విశాలవక్షుఁ పిశంగస్ఫీతకేశుండు నం
జనసీలాంబరుఁ డుగ్రరూపుఁడు హరిశ్మశ్రుండు కల్పాంతమృ
త్యునిభుం డైనహిరణ్యనేత్రుఁడు "చనుండొద్దుండు పోరుం" డటం
చును సేనం బురికొల్పి చే విసరుచుం జొత్తెంచినంతన్ సురల్. 16

ఉ. ఆనడఁగొండఁ బోలుసురాధిపతిం గని యీషదుచ్చల
న్మానసు లయ్యు సాజ మగుమానము పేరిమి నాయుధంబులం
బూనుచు వజ్రి ముందు చన బోరునఁ బోరికిఁ బోయి శస్త్రసం
తానములన్ నిశాచరగణంబులమూ పణఁగించు నత్తఱిన్. 17

చ. తలపడి రొక్కవేగమున దైత్యులు దేవబలంబు నంత న
ష్పాలికల నెల్ల భగ్నరథపుంజము మ్రొగ్గినదంతివాజిరా
సులు గిరు,లాయుధోత్కరము చోఱలు,గండలు గండుమీలు, భూ
షలు మణు, లస్ర మంబువుగ సాగర మయ్యె భయంకరంబుగన్. 18

చ. కరముఁ గరంబుఁ గంధరయుఁ గంధర జుట్టును జుట్టుఁ బట్టి ని
ర్జరులు నిశాచరుల్ బ్రతుకు చావు లెఱుంగక ఘోర మల్లసం
గర మొనరింప వారిపదఘట్టన గ్రక్కదలెన్ ధరిత్రి త
త్కరతలముష్టిజానుభుజఘాతములన్ మఱుమ్రోఁగె దిక్కులున్. 19

చ. దనుజులయమ్మహోద్ధతికిఁ దాళక వెన్కకు జంకి నిర్జరుల్
ఘనతరభీతి నల్గడఁ గకావికలై పఱవంగ వారలన్
బనుకుచు నింద్రుఁ డోడకుఁడు పాఱకుఁ డంచును మందలించి ని
ల్పినతఱి దైత్యు లెల్లరు నిలింపపతిన్ వడి ముట్టడించుచున్. 20

చ. పరిఘము లాయుధంబులును బాణములుం బరగింప నొచ్చియుం
బరవస మొప్ప వాసవుఁడు బాణకృపాణశతారధారలన్
జెరచెర వారలన్ జెలఁగి చీల్చుచు నంబుధిఁ ద్రచ్చినట్టిమం
దర మన దిర్దిరం దిరిగె దానవసేనఁ గలంచు చయ్యెడన్. 21

ఉ. పున్నమనాఁటిసాగరునిపోలికిఁ బొంగుచు భీమరోషసం
పన్నుఁడు దైత్యనాథుఁడు సుపర్వులపైఁ బడి వారలన్ గదా
భిన్నశిరస్కులం బరిఘపీడితబాహుల ఖడ్గసాయక
చ్ఛిన్నపదోరువక్షులను జేసి దిశల్ పగులంగ నార్చుచున్. 22

చ. ఉరవడిఁ బోయి నన్నెదిరి ♦యోర్చు మిదే చనుదెంచితిన్ సురే
శ్వర!నిలు మంచు వజ్రముఖ♦వహ్నిశిఖావలి నంపవానలం
గురిసి శమింపఁ జేసి యెద♦కున్ గుఱిపెట్టుచు స్తంభనాస్త్రముం
బరప నతండు మ్రాన్పడె సు♦పర్వులు చూడఁగ ఱిచ్చపాటునన్.23

ఉ. చేవ తొలంగి మ్రాన్పడి శ♦చీపతి యట్టులె వ్రాలియుండ నై
రావతకుంభపాళిని,బ♦రాజితులై సురవీరు లాత్మర
క్షావిధి లేక కట్టువడి ♦సంకట మొంద జగత్త్రయంబు త
న్నే వరియించినట్లు లసు♦రేశ్వరుఁడుద్ధతుఁ డయ్యె నయ్యెడన్. 24

చ. మును మధుకైటభాసురుల♦పోర మణంచినసత్వమూర్తివా
ర్ధిని దిగఁబడ్డభూమిఁ బయి♦దేల్చినయాదివరాహమూర్తి ద్రె
క్కొనినసమస్తలోకములఁ♦ గుక్షిని దాల్చినవిశ్వమూర్తియై
తనరినవిష్ణుమూర్తి విబు♦ధస్థితి నారసి యుగ్రమూర్తియై. 52

గీ. శంఖచక్రగదాఖడ్గ♦శార్ఙ్గహస్తుఁ
డగుచుఁ దొంటివరాహదే♦హంబు దాల్చి
యాహవస్థలిఁ బొడసూపి♦ యరులగుండె
లవియఁ బూరించెఁ బాంచజ♦న్యంబునంత. 26

క. ఆనినదము విని దనుజుల
మానసములు బెగ్గడిల్లె ♦ మరుదాననముల్
దీనత విడనాడెను జతు
రాననుఁడును వచ్చినిలిచె ♦ నాహరిపజ్జన్. 27

గీ. అట్లు మాయా వరాహమై ♦ యరుగుదెంచు
నరుణకమలాక్షుఁ బుండరీ ♦ కాక్షుఁ జూచి
యాహిరణ్యాక్షుఁ డపుడు ర ♦ క్తాక్షుఁ డగుచు
సేనఁ బురికొల్పి తా విల్లుఁ ♦ జేతఁ బట్టె. 28

ఉ. అత్తఱి దైత్యవీరులు శ♦తారసమానములైన యమ్ములుం
గత్తులుఁగోల లీ♦ఁటెలును గాటముగా విసరంగ నన్నిటిం
దుత్తునియల్ వొనర్చుచుఁ జ♦తుర్భుజుఁ డందఱి కన్నిరూపులై
మిత్తి మసంగినట్లు రణ♦మేదిని దైత్యులఁ గూలఁగొట్టెనన్. 29

చ. అనలునిమాడ్కి మండిపడి ♦యాదనుజేశ్వరుఁ డొక్కశక్తిఁ జే
కొని పరుగెత్తివచ్చి నినుఁ ♦ గూల్చుతి నంచు వరాహమూర్తిపై
మ్మును గుఱిచేసి వేయ నగు♦మోమున దానిని జేరనిచ్చి య
య్యనఘుఁడు హుమ్మనంగ నది♦ యంతన బెండయి కూలె నేలపై.

చ. అపుడు విరించి మేలు బళి♦యంచు నుతింపఁగఁ గిన్క హెచ్చి య
చ్చపలుఁడు విల్లు పట్టి విష♦సాయక మేయఁగఁ బోవఁ జక్రియా
రిపునిశిరంబు వ్రేల్మిడి ధ♦రిత్రిని గూల్చెను జక్రధారచే
నపహతశేష మైనదను♦జావళి దిక్కఱి దిక్కులంటఁగన్. 31

గీ. దానవాన్వయనాశనార్థము వరాహ
మైనయాచక్రపాణి య♦ట్లద్భుతముగ
రక్కసుల పీఁచ మణఁచి హి♦రణ్యనేత్రుఁ
గూల్చి యమరేంద్రు బంధవి♦ముక్తుఁ జేయ. 32

ఉ. పోయినప్రాణముల్ మరలఁ♦ బొందెలఁ జేరినయట్లు లేచి నా
రాయణుఁ జూచి మ్రొక్కి యమ♦రప్రభువు వాదిగ దేవతల్ మహా
పాయమునుండి మమ్ము నెడఁ♦బాపితి వోనిగమాంతవాస! నీ
సాయము గల్గకున్న మముఁ ♦జంపును దప్పక దైత్యుఁ డింతకున్.

గీ. నీదుకూరిమికలిమిని ♦నిశ్చయముగ
నంతకునినోటినుండి పై ♦కరుగుదెంచి
యమ్మకడుపునఁ బుట్టితి♦మయ్య మరల
నిన్ను నేమని పొగడంగ ♦నేర్తుమింక ? 34

క. పరమేశ్వర కరుణాకర!
పురుషోత్తమ దేవదేవ ♦బుధవత్సల! నీ
చరణంబులె శరణంబుగఁ
బరిచర్య లొనర్చి బ్రతుక ♦వర మి మ్మనుడున్. 35

వ. సకలలోకరక్షకుం డైనయప్పుండరీకాక్షుండు దుందుభిస్వనంబుం బురుడించుగంభీరకంఠస్వరంబున మధురాక్షరంబు లెసంగ బృందారకుల నెల్లనాశ్వాసించి. 36

చ. ఘనముల వంత మాని మును♦ మన్నన మీకు నొసంగినట్టినం
దనవనసుందరంబయిన♦నాకపురంబు సుఖంబు చేరి మీ
పని నెఱవేర్చుచున్ సవన♦భాగము లందుచు ధర్మపాలనం
బొనరుచుఁ డంచుఁ బల్కి పురు♦హూతుని గన్గొని కూర్మి నిట్లనెన్. 37

సీ. నిజకులోచితధర్మ♦నిష్ఠాగరిష్ఠులు
యాయజూకులు సన♦యాయమతులు
సత్యసంధులు ధర్మ♦సంగ్రామశూరులు
త్యాగులు యోగులు♦తాపసులును
నాకలోకసుఖంబు♦చేకొన నర్హులు,
మోహకామక్రోధ♦మూఢమతులు
బ్రహ్మవిద్వేషులు ♦పాపవర్తనులును
నాస్తికు లర్హులు, ♦నరకమునకు.
గీ. ననుచు నియమంబొనర్చితి♦ నమరనాథ !
దీని నడపుట నీకు వి♦ధేయకృత్య
మనుచు శాసించి బ్రహ్మదు ♦లరయుచుండ
నందె యంతర్హితుం డయ్యె ♦నద్భుతముగ. 38
క. తరువాత నలువ మున్నగు
సుర లెల్లరు నవ్విరాహ♦సురుచిరమూర్తిన్
బరమేశ్వరుఁ గొనియాడుచు
నరిగిరి నిజనిలయములకు ♦నంబరవీథిన్. 39
గీ. కూళ లైనట్టిదైత్యులు ♦కూలుకతన
స్వస్థురా లయ్యె భూదేవి♦చావు తప్పి
యమరు లాత్మాధికారంబు ♦లంది రిందు
నిఖిలలోకాధిపత్యంబు♦నిత్య మయ్యె. 40
వ. అంత. 41
క. గిరిబృందంబులు నలుఁగడఁ
దిరుగుటఁ జాటిల్లువెలుఁపు ♦దీటించి పుడమిం
దిరముగ నిలుప శచీపతి
పరివారముతోడ వెడలి ♦వచ్చె భువనికిన్. 42

క. ఇలకును జంతుగణంబుల
కలజడి లేకుండ నెగిరి ♦యల్లన మరలన్
మెలపున దిగి తమనెలవుల
నిలువఁగ ముద లిచ్చి శైల♦నిచయము నంతన్. 43

ఉ. పీఁక దలిర్పఁగా నిశిత♦విస్తృతకోటికఠోరవజ్రమున్
జేకొని జంతుజాలము ల♦శేషసురావళి మెచ్చ నొక్కమై
నాకుని దక్కఁ దక్కినఘు♦నస్థిరపక్షబలంబుఁ బర్వతా
నీకము నొక్కపూన్కిమెయి ♦నిర్గతపక్షముఁ జేసె నెల్లడన్. 44

క. పరమపవిత్రము శ్రేయ
స్కర మగునియ్యది వరాహ♦చరితం,బిఁక భూ
వర!సావధానమతివై
నరసింహునిపుణ్యకథ వి♦నందగు భక్తిన్. 45

నరసింహప్రాదుర్భావము

వ. తొల్లి కృతయుగాది నాదిపురుషుండు దైత్యరాజ్యంబునకు యువరాజుగ నియమించినహిరణ్యకశిపుఁడు తనయన్న యనంతరము సార్వభౌముఁడై సకలదైత్యరాజ్యం బేలుచుఁ దనయానతి యప్రతిహతంబు గావింప నూహించి యాధిపత్య మమాత్యునియం దుంచి తపం బాచరింప నుత్సాహంబునఁ బురంబు వెలువడి యొకపుణ్యానదిం జేరి. 46

చ. పదియు నొకండువే లయిదు♦వందలయేండ్లు నదీజలంబునం
గదలక యుండి యాకమల♦గర్భునిఁగూరిచి లోక మెల్లఁ బె
ల్లదరఁ దపంబుచేయఁగ మ♦హావ్రతనిష్ఠఁ బితామహుండు స
మ్మద మొదవంగ దేవముని♦మండలి పేరిమి వెంబడింపఁగన్. 47

చ. మదకలహంసఁ బూన్చివవిశ్రమానము నెక్కి విఠాన వచ్చియా
నదికడ డిగ్గి యోదనుజనాయక!నీదుతపంబు నాకు స
మ్మద మొనరించెఁ జాలు నిఁక మాను తపోవ్రతనిష్ఠఁ దెల్పు నీ
యెదఁ గలకోర్కి యీ క్షణమ యిచ్చెద నన్న నిశాచరేంద్రుఁడున్.

క. పరమానందముతో నది
దరికిం జనుదెంచి భక్తితాత్పర్యములం
గరములు శిరమున మోడ్చి
పరమేష్ఠికి మ్రొక్కి యిట్లుపలికె మృదూక్తిన్. 49

సీ. సురసిద్ధసాధ్యరక్షోనాగగంధర్వ
మానవాదులచేత మడియకుండ
బహువిధశస్త్రాస్త్రబాణకృపాణాద్రి
పాదపాదుల మృతిఁ బడయకుండ
నార్ద్రశాపంబుల నార్ద్రశుష్కపదార్థ
సర్వవిషాదులఁ జావకుండ
స్వర్గాంతరిక్షభూపాతాళములదిన
రాత్రిసంధ్యలఁ జావురాకయుండ

గీ. వర మొసంగుము దేవ! యెవ్వండు నన్ను
పట్టిచేతులతోఁ గొట్టి మట్టువెట్టు
నాతఁడే నాకు మృత్యువై యలరుఁ గాని
యొండుగతి నాకుఁ జావు లేకుండుఁగాక. 50

గీ. మఱియుఁ బంచమహాభూత మహితలోక
పాలరవి సోమ నక్షత్ర పాటవంబు
నాకు లభియింప రణభూమి నన్నుఁ జేరఁ
బరమదివ్యాస్త్రములు కూర్మి వరము లిమ్ము. 51

క. అని యర్థించిన నిచ్చితి
నని పల్కి విరించి యరిగె హంసవిమానం
బున నిజలోకంబునకో
య్యన దేవత లంత నజున కని రిబ్భంగిన్. 52

ఉ. అంబుజగర్భ! నీ వొసఁగినట్టివరంబుల వాఁడు ముమ్మలో
కంబుల నెల్ల నక్కఱచుఁ గావున నాతఁడు చావఁగా నుపా
యంబు దలంపు మన్నఁ జతురాస్యుఁడు నవ్వి విచారమేల? సి
ద్ధంబది వానిమాటలనె తద్వరముల్ తుదముట్టు దానితో. 53

క. సవరించిన తపముఫలం
బవసానము నొందుపిదప నాతని నెన్నం
డవసానము నొందింపఁగ
నవతారం బెత్తు వనఁగ నమరులు వేడ్కన్. 54

గీ. జలజగర్భుని బొగడుచుఁ జనిరి యిండ్ల
కంత నక్కడ వరలబ్ధి కాత్మ నలరి
కఠినశాసనుఁడు హిరణ్యకశిపుఁ డుగ్ర
బాహుదర్పంబు మెఱయంగ బయలుదేఱె. 55

సీ. పుడమిఁ గల్గినపురంబులఁ గొల్లగొట్టించి
పల్లియల్ నల్లిండ్లు పాడుచేసి,
ఆశ్రమంబుల నగ్ని కాహుతిగావించి
తాపసశ్రేష్ఠుల దఱుమఁగొట్టి
పాతాళముం జొచ్చి పాపతేని జయించి
యందలిసర్వస్వ మపహరించి
సురలోకమున కేగి సురరాజు నీడ్చించి
యతని భద్రాసనం బాక్రమించి

గీ. అమరగృహములు యాగభాగార్హతలును
దైత్యుల కొసంగి భటుల సుధర్మ నిలిపి
నిజపురంబున కరుదెంచె నిఖిలలోక
విజయభేరీనినాదంబు విన్నుముట్ట. 56

గీ. అప్పు డాదైత్యనాయకుఁ డమరులందు
బందెగొనిపోవ మిగిలిన వార లింద్ర
గురులు ముందఱ నడువ వైకుంఠమునకు
బోయి వైకుంఠు దర్శించి మొఱ్ఱ లిడుచు. 57

ఉ. దేవర! నీదుపాదములు దిక్కుగ నమ్మిన మాకు నాకమం
దేవెత కల్గఁ బో దనుచు నెంచితి మింతకుఁ గాని సర్వసౌ
ఖ్యావహమైన యాపురమునందు వసించెడి భాగ్యరేఖలన్
మావదనంబులం దుడిచె మత్తుఁడు దైత్యవిభుండు నేఁటితో. 58

ఉ. బోరన నాహిరణ్యకశిపుం డరుదెంచిన దాడి వేఁడియే
తీరున నోర్చి యెట్లు కడతేఱక యుంటిమొ! చెప్పఁజాల మ
మ్మారి మసంగిన ట్లుతఁడు మాపయి వచ్చుట లోఁ దలంచినన్
గారుణికోత్తమా! యిపుడు కంపము పుట్టెడు మామనంబులన్. 59

చ. సురభటు లాయుధాళిఁ గొని చుట్టును గావలియుండ దిక్పతుల్
గురుఁడును దేవనాయకుఁడు గొల్వున మంతన మున్నవేళఁ దాఁ
బరుగున వచ్చి యొక్కకరిఁ బాదతలంబునఁ దన్ని యీసురే
శ్వరుతల పట్టియూడ్చె దనుజప్రభుఁ డే మని చెప్ప మీశ్వరా! 60

ఉ. పాలన లేనిదీనులకుఁ బట్టినదుర్గతి పట్టె యష్టది
క్పాలకు లష్టకష్టములు పాల్పడి రన్యులకష్టపాటు లిం
కేల వచింప? నిర్జరులకెల్లశిరోమణి యాసురేంద్రుఁ డ
ప్పాలసుబారికిం బడినపాటులు నోట వచించునట్టివే? 61

ఉ. సురపురి కిట్టిచేటు మును చూడఁగ లే దిఁకఁ జూడఁబోము మ
త్సరమున వచ్చునయ్యసుర దాడికిఁ దాళఁగలేక వేల్పు లె
వ్వరికిని వారె యై యమర భావము నెంచక జీవితాశఁ గా
తరు లయి పాఱిపోయిరి యథాయథలై సుతదారదూరులై. 62

సీ. సురతాపసస్నానశుచు లైనమిన్నేటి
రేవు లన్నియుఁ జాకిరేవు లయ్యె
స్నాతానులిప్తసిద్ధాగరిష్ఠార్థసో
పానముల్ చేఁపలబండ లయ్యె
బ్రహ్మవేత్తలకు నావాసంబులగు తీర్థ
శాలలు గుఱ్ఱపుసాలలయ్యె
నగ్నికుండంబు లయ్యశ్వంబులకుఁ బెట్టు
గుగ్గిళ్లు నుడకించుగుంట లయ్యె,

గీ. కల్పతరుసుందరానందకందనంద
నంబు దైత్యులచేతుల నల్లియయ్యెఁ
జెప్పెడి దిఁ కేమి!సురపురి చెన్ను దొఱఁగి
పాడుపడియుయి నట్లుండెఁ బరమపురుష! 63

క. సురవరాంగన ఱాతని
వరపుడులై రమరభటులు బానిసలై రీ
శ్వర!యొక్కనమస్కారము
సురపురి,కిం దునిచి మమ్ముఁ జూడుము కరుణన్. 64

వ. అని పలుతెఱంగులఁ గుయ్యిడుచుఁ దమపడినపాట్లెల్ల విన్నవింప నప్పరమాత్ముఁడు నిజకృపాపాంగవీక్షాసుధారసధారలవారిహృదయాగ్నిఁ జల్లార్చి "మీ కభయ మిచ్చితి నే నిదె బయలువెడలి యామదోన్మత్తు నఖిలబలంబులతోఁ బరిమార్చి మీయభిమతంబు సమకూర్చెద మీరు నాకంబున కరిగి మీమీనివాసంబుల సుఖంబుండుఁడని వారిం బనిచి. 65

### హిరణ్యకశిపువధ.

చ. అరిగి హిమాలయంబునకుఁ దనప్పరమాత్ముఁడు వైరి గన్నయా
వరముల ధిక్కరించెడియుపాయ మొకండు తలంచి కోటిభా
స్కరశతకోటిపావకులఁ గన్నను మిన్నయి తేజరిల్లుసుం
దరనరసింహరూపముఁ దాలిచి దైత్యకులేంద్రుఁ బ్రోలికిన్. 66

మ. పరమోజ్జ్వాకారసహాయుఁడై చని పురోభాగంబునం గాంచె నం
బరవీథీవలమాన కేతుశిఖరప్రాసాద మేరుక్షమా
ధరపాదాయితదుర్గమావరణమధ్యప్రోన్నతాట్టాలకో
పరిసంచారిభటాళిరక్షితము గీర్వాణద్విషద్దుర్గమున్. 67

సీ. అం దిందుకాంతకుడ్యంబును మరకత
ద్వారకవాటవాతాయనంబు
వజ్రనీలాంచితస్వర్ణలిప్తతలంబు
సర్వరత్నాంచితాచ్ఛాదనంబు
కామచారము విశ్వకర్మనిర్మితము ను
మణిసాలభంజికామండితంబు
హైమరత్నాసందికాసీన దేవగం
ధర్వదానవదైత్యనరవరంబు

గీ. వివిధపుష్పలతాతరువేష్టితంబు
సకలలోకైకరామణీయకపదంబు,
అతివిశాలమహోన్నతాత్యాయతంబు
నైనయాస్థానమండపం బరసి యందు. 68

సీ. గంధర్వులు విపంచికాశ్రుతి మేళగిం
చినపాట వీనులఁ దనుపుచుండ
నూర్వశీరంభాతిలోత్తమాదులు నృత్య
కలఁ గన్నులకు హాయి గొలుపుచుండ

బందీకృతామరపంకజనేత్రిలు
వింజామరంబులు వీచుచుండ
సురయక్షకిన్నరాసురవందిమాగధుల్
దిగ్విజయంబు కీర్తించుచుండ,

గీ. దివ్యకుండలకవచప్రదీప్తుఁడగుచు
హైమసింహాసనాసీనుఁడైనయట్టి
రత్నమకుటాభిరాము హిరణ్యకశిపుఁ
గాంచి యాతనిమ్రోల సాక్షాత్కరించె. 69

ఉ. ముందఱ వచ్చి నిల్చినసమున్నతవక్షము శంఖచంద్రికా
కుందనిభాంగముం జలితకుంచితదీర్ఘసటంబునైనయా
సుందరనారసింహమును జూచి నిశాచరరాజు నిక్క మే
నెందును జూడ నిందనుక నిట్టిమృగం బని విస్మయంపడెన్. 70

చ. కనుఁగొన శాంతమై నివుఱుగప్పిననిప్పయి హాస్య మద్భుతం
బును బయిఁ దోఁచురౌద్ర మయి భూమికఁ దాల్చులయార్క తేజమై
దనుజులపాలిమృత్యు వనఁ దార్కొనునన్నరసింహుఁ జూచి కొ
ల్వునఁ గలవారు దానవవిభుం గని రెంతయు భీతచిత్తులై. 71

క. నరసింహాకృతి వచ్చిన
పరమేశ్వరుతత్త్వ మరసి భయసంభ్రమసం
భరితుండై ప్రహ్లాదుఁడు
పరమార్థము తండ్రి కెఱుకపడ నిట్లనియెన్. 72

చ. దనుజవరేణ్య! నీవు పెడదారిని బోయి విచిత్రజంతుభా
వనఁ గనుచున్న యీపరమపావనమూర్తి సమస్తదైత్యమ
ర్దనము తలంచి యిట్టు లవతారమునెత్తినవిష్ణుమూర్తి. నా
మనమున నిశ్చయింపు మనుమానము మాను మదుక్తి నమ్ముమీ! 73

ఉ. ఈమహనీయరూపమున♦ నెల్లనదీనదసింధుశైలభూ
వ్యోమరసాతలంబులు త♦పోధనమానవదానవామర
స్తోమము తారకాగ్నిశశి♦సూర్యసమీరదిశావితాననా
నామృగపక్షికీటక♦గణంబులు గానఁగవచ్చుఁ జూడుమీ! 74

గీ. ఎల్లదైత్యులతోఁ గూడి ♦యీవు నితని
నోటఁ గన్పట్టుచున్నావు ♦నోసటిమీఁద
వెలయుచున్నారు ♦శూలియు ♦నలువ యింక
సందియం బేల?సచ్చిదా♦నందుఁ డితఁడు. 75

చ. అనుటయు దానవేంద్రుఁ డవు♦రా! వెడమాట లటంచు భృత్యులం
గనుఁగొని దీనిఁ బట్టుకొని ♦కట్టుఁడు కొట్టమునందు పట్టనీ
యనియెడఁ జావఁగొట్టుఁ డని ♦యానతి చేయఁగ వారు పగ్గముల్
గొని హరిఁ బట్ట నల్గడలఁ ♦గూడి రదల్చుచు నంత విష్ణుఁడున్. 76

చ. నగములు మాఱుమ్రోఁగ మద♦నాగము లెల్లెడ భీతిఁ బర్విడం
బగతురు మూర్ఛిలం బ్రళయ♦వారిదమట్టులు గర్జచేసి పై
కెగిరి భుజాయుగంబు పయి♦కెత్తి విదిర్చిన యంతఁ దల్లక్రిం
దుగఁ బడెఁ గొల్వుకూట మతి♦దూరతలంబున ముక్కముక్కలై. 77

సీ. అపుడు దానవనాథుఁ ♦డల్కమై నసురయో
ధుల నెల్లఁ బురికొల్పి,♦తలఁచినంత
సన్నిధిఁ జేరిన♦శస్త్రసందోహంబు
కాలచక్రాదిచ♦క్రవ్రజంబు
బ్రహ్మశిరోముఖ్య♦బహువిధాస్త్రచయంబు
శూలముద్గరకుంత♦జాల మెల్ల
నరసింహమూర్తిపైఁ♦ బరగింప నవిసహ
స్రాంశునికరముల ♦నణఁగునట్టి

గీ. మంచుచినుకులకైవడి మాయమైన,
మఱియు నాతండు జాజ్వల్యమానవివిధ
ఖడ్గబాణశతఘ్నికాకాండ మతని
మీఁదఁ గురియించెఁ బ్రళయపయోదభంగి. 78

గీ. దైత్యవీరులు నట్టులే దారుణాస్త్ర
శస్త్రబాణకృపాణపాషాణవృష్టి
పాశశూలగదాశితప్రాసముసల
కోటిధారాపరంపర గురిసి రంత. 79

ఉ. ఆనిశితాయుధప్రకర మాహిమశైలముమీఁదివర్షధా
రానిచయంబుపోల్కి రుచిరస్థితిఁ గూర్చ నకంపితాత్ముఁడై
భానుసహస్రమూర్తి లయపావకతేజుఁడు నై నృసింహుఁడ
ద్దానవరాజసేనలకు దారుణరూపము చూపె నత్తఱిన్. 80

క. పెనుగాలివడికిఁ గదలెడి
వననిధిభంగంబులట్లు భయకంపితు ల
య్యును దనుజవీరు లొక్కట
మునుకొని హరి నంపవాన ముంచిరి కిన్కన్. 81

గీ. అగ్నిలోఁ బడుమిడుతలయట్టు లవియు
నానృసింహుని తేజంబునం దణంగ
వివిధచక్రాయుధావళి విసరి రదియు
నతనిముఖగహ్వరంబునం దణఁగిపోయె. 82

గీ. అప్పుడు హిరణ్యకశిపుఁడా హా యటంచు
నగ్నికణములు వెదచల్లునట్టిశక్తిఁ
బఱపఁగా నది నరసింహవదనజనిత
మైనహుంకారమున ముక్క లగుచుఁ బడియె. 83

వ. ఆసమయంబున దైత్యయోధు లత్యంతక్రుద్ధులై తమమాయంజేసి ఝంఝామారుతంబు గల్పించియు గాఢాంధకారంబు గలిగించియు రాళ్ళు రువ్వియు నీళ్ళు చిమ్మియు నిప్పులు కురిసియు నిసుమంతయేని ప్రయోజనంబు గానక తమచేత లెల్ల పొల్లగుటకు వగచి యప్పర మాత్మునిదివ్యాంగ తేజఃప్రతాపాగ్నికిఁ దాళఁజాలక భయసంభ్రమ పరీతచేతస్కులై విషణ్ణవదనంబులతో హిరణ్యకశిపు శరణుచొచ్చి రట్టియెడ. 84

ఉ. ఆరజనీచరేంద్రుఁడు భ♦యానకరౌద్రరసానురూపకో
పారుణనేత్రుఁడైన భువి ♦యల్లలనాడె సపర్వతంబుగా
నీరనిధుల్ కలంగె శశి♦నీరజమిత్రులు కాంతిఁ దప్పి ర
త్తారలు త్రుళ్ళె వాయువు య♦థాయథ లయ్యెను బర్వెఁ జీఁకటుల్ 85

ఉ. రక్కసు లెల్ల పో నవస♦రం బిది యంచును దెల్ప నొక్కచోఁ
జుక్కల తేనిఁ జుట్టుకొనెఁ జుక్కలు గాములు నేఁడు, వేఱుగా
నొక్కట నుండె రోహిణి భ♦యోన్నతిఁ దెల్పఁ జరాచరాళికిన్,
దిక్కులు మాసె లోకభయ♦దీక్షితదుర్గ్రిహముల్ బయల్పడెన్. 86

చ. దితిసుతనాశకాలమును♦ దెల్పెడితీఁగలు చెట్లు పూసె న
ద్భుతముగఁ బండ్లఁ బండులును♦బువ్వులఁ బువ్వులుఁ బుట్టె నూళులన్
బ్రతుకువిహంగముల్ పసు ల♦రణ్యముఁ జొచ్చెను రక్త బిందుసం
తతి గురిసెన్ మహోల్కలును ♦దారుణభంగిని భూమిపైఁబడెన్. 87

ఉ. ఆయమరారియింటి కెదు♦రై చదలం గనవచ్చె నీలదే
హాయతబాహుపాద మగు♦నట్టికబంధ మొకండు, వానియ
స్థాయుధగేహదుర్గశయ♦నాలయముల్ మధుమక్షికావిహా
రాయతనంబు లయ్యెను శి♦వాళి కూసెను వానినల్లడన్. 88

గీ. అట్టియుత్పాతములుచూచి ♦యాహిరణ్య
కశిపుఁ డాచార్యు శుక్రుని ♦గాంచి యిట్టి
యశుభసూచన లేలొకో ♦యవతరించె?
ననఁగ నాతండు పలికె ♦నయ్యసురపతికి. 89

ఉ. దైవము దుర్విలాసమునఁ ♦దార్కొనునిట్టియరిష్టసూచనల్
భూవలయంబుచేటునకు ♦మూలము లయ్యెను దైత్యరాజ్యదై
త్యావనిపాలనాశనమ♦యంబును సూచన చేయుచుండెడిన్
గావున నేర్పుమైఁ గనుము ♦కర్జము నీకు శుభంబు గల్గుతన్. 90

చ. అని వచియించి యాతఁడు గృ♦హంబున కేగిన,దైత్యనాథుఁడున్
మును విధి యిచ్చినట్టివర♦ముల్ దితివంశవినాశదైవసూ
చనలుఁ దలంచి కొంతవడి ♦సైనికులం బురికొల్పి నారసిం
హుని బరిమార్తు నంచుఁ గడు♦నుద్ధతిఁ బెన్గద పట్టి వెల్వడెన్. 91

వ. అట్టిబలదర్పసమగ్రుఁ డగువానివికటపదఘట్టనంబునకుఁ జతురుదధివేలావలయితం బైనయిలాతలంబు వణఁకఁజొచ్చె నట్టియెడ నాదిత్యవిశ్వవసురుద్రాదులు కామరూపంబుల నరుదెంచి యాకసంబున నిలిచి యఖిలభూతనిలయుం డైననరసింహుని సందర్శించి కరంబులు జోడించి మ్రొక్కి వేదసూక్తంబులఁ బ్రస్తుతించి దేవా!సకలలోకకంటకుం డైనయీపాపాత్ముఁ బరిమార్పకున్న ముల్లోకంబులకు ముప్పు వాటిల్లు. నీకుఁ దక్క నన్యున కీకార్యంబు సాధ్యంబుకాదు. నిఖిలజగత్కారణుండ వైననీవ మా కెల్లరకు శరణంబవై యుండ ని న్నే మని నుతింప నేర్తుము!మాసర్వంబునకు నీయనుగ్రహంబ పరమగతి యని విన్నవించినంత. 92

ఉ. వారలపల్కులన్ విని య♦వారణభంగి నృసింహుఁ డప్పుడి
గ్వారణకర్ణరంధ్రపుట♦పాటనపాటవ మైన ఘోరగ
ర్జారవ మాచరింప దితిజ♦ప్రకరం బతికంపితాంగమై
ధారుణి వ్రాలె దేవతలు ♦తాండవమాడిరి వేడ్క నత్తఱిన్.
ఉ. సింగము కావరించి రొద ♦చేయునె యంచు బుజంబు లల్క ను
ప్పొంగఁగ నాహిరణ్యకశి♦పుండు నృసింహుని దాఁకినంతఁ జే
రంగద మేన లేచు భయ♦దానలకీలలు నింగిఁ బర్వ సా
రంగము మీఁది కేగుమృగ♦రాజముకై వడి నాతఁ డుద్ధతిన్.
మ. దురితాత్ముండు మదాంధుఁ డాఖలునిపై ♦దోర్దండముల్ చాఁచి కం
ధరముం బట్టి యణంచి దాన నొకపా♦దం బాని వేఱొండుకా
లురుదేశంబున నొక్కిపెట్టి ఘనబా♦హుద్వంద్వముం గట్టి పే
రురమున్ గోళ్ళుల వ్రచ్చి చచ్చె నితఁ డో♦హో యంచు గర్జించినన్.
గీ. అఖిలలోకమనశ్శల్య♦ మగుహిరణ్య
కశిపుమరణంబునకు సిద్ధ♦గరుడయక్ష
నాగగంధర్వదేవమా♦నవగణంబు
నుల్లమానందవారిధి ♦నోలలాడె. 96
చ. కమలభవుండు వాసవుండు ♦కశ్యపుఁ డాదిగఁ గల్గువార లా
సమయమునం బరాత్పరుని♦సన్నిధిఁ జేరి ముకుంద! పూరుషో
త్తమ!జగదీశ!నీకరుణ ♦దానవనాథునిబాధ తప్పె లో
కములు సుఖించు నింక భవ♦కర్మవినాశన! పాపమోచనా! 97
క. మును లెల్లరు నీమహిమం
బును నీనరసింహరూప♦మును హృదయములం
గొనియాడుదు రనవరతము
నిను నర్చించెదరు భక్తి ♦నిర్జరులు నరుల్. 98

క. పరమేశ్వర!నీచరితమె
పరతత్త్వం బనుచుఁ బుణ్య♦వర్తనులు పరా
వరవేత్తలు ధర్మజ్ఞులు
పరమానందంబుతోడఁ ♦బఠియింతు రొగిన్. 99

గీ. ఆదిమధ్యాన్తరహితుండ ♦వవ్యయుండ
వఖిలలోకైకవాసుండ ♦వచ్యుతుండ
వక్షరుండ వచింత్యుండ ♦వఖిలవిదుఁడ
వద్వితీయుండ వీవ వే♦దాన్తవేద్య! 100

క. పదునాలుగులోకంబులు
నుదయించుట వృద్ధి గనుట ♦యుక్కడఁగుటయున్
సదసద్వివేకమునిజన
సదనా!నీచిద్విలాస♦సరణిని గాదె? 101

సీ. పరమాగమార్థంబు♦ పరమదైవంబును
బరమమంత్రంబును ♦బరమతపము
పరమధర్మంబును ♦బరమయశంబును
బరమాధ్వరంబును ♦బరమహోత
పరమహోమంబును♦ బరమధామంబును
బరమయోగంబును♦ బరమవాణి
పరమసత్యంబును♦ బరమశమంబును
బరమరహస్యంబు♦ పరమవిద్య

గీ. పరమగతి పరమగురుండు ♦పరమధాత
పరమకర్త పరమభర్త ♦పరమహర్త
నీ వనుచు విశ్వసింతురు♦ నిఖిలమునులు
దేవ!నారాయణా! హరీ! ♦దీనశరణ! 102

చ. అని వినుతింప శ్రీహరి భయంకర మైననృసింహదేహ మం
తన దిగనాడి యాత్మవిహితం బగుదివ్యపురాణరూపముం
గొని యమృతాబ్ధియుత్తరపుఁగూలము చేరెను బంచభూతవా
హనఘటితాష్టచక్రఘనయానమునన్ జగ మెల్ల మెచ్చఁగన్. 103

వ. అంతఁ బితామహపురస్సరులై బృందారకసురతాపసేంద్రులును గంధర్వాదులును బరమోత్సాహంబుతో నారాయణనామసంకీర్తనంబు గావించుచు నిజధామంబుల కరిగిరి. ఇంద్రుండు సురపురంబు సుఖావాసంబుగఁ ద్రైలోక్యపాలన మాచరించుచుండె. ఇయ్యది నరసింహావతారవృత్తాంత మింక వామనచరిత మభివర్ణించెద నాకర్ణింపు మనుచు జనమేజయునకు వైశంపాయనుం డిట్లు వక్కాణింపఁ దొడంగె. 104

### బలిచక్రవర్తి జైత్రయాత్ర

చ. అతులతపోగరిష్ఠుఁడు మహామహిమాంచితుఁ డబ్జయోనికిన్
సుతుఁ డగునమ్మరీచిమునిసూనుఁడు దేవతపోధనాళిసం
స్తుతచరితుండు నిర్మలయశోభరితుం డగుకశ్యపప్రజా
పతిని మహాపురాణములఁ బల్మఱు విందువు కౌరవోత్తమా! 105

గీ. అతఁడు దక్షప్రజాపతి యనుఁగుఁగూఁతు
లందు పన్నిద్దఱను బెండ్లియాడె ననుచు
మున్ను వినియుంటి వారిలో నన్నియెడల
నదితి దితియును నమ్మని కనఁగు లైరి. 106

సీ. అతని కయ్యదితియం దదధిక తేజోమూర్తు
లగువివస్వంతుండు నర్యముండు
త్వష్టయు మిత్రుండు ధాత పర్జన్యుండు
వరుణుండు పూషాంశువాసవులును

భగుఁడు విష్ణుండునాఁ బండ్రెండుగురు పుత్త్రు
లనఘాత్ము లుదయించి రాదియందు,
మఱియును దితియందు మదమత్తపావవ
ర్తనహిరణ్యాక్షహిరణ్యకశిపు

గీ. లనఁగ నిర్వురు జనియించి,రాహిరణ్య
కశిపునకుఁ బుట్టె సుతపంచకంబు,నందు
పరమభాగవతోత్తమప్రథితకీర్తి
యైనప్రహ్లాదుఁ డాద్యుఁ,డయ్యనఘమతికి. 107

క. జనియించె విరోచనుఁ డను
ఘనబలుఁ డొక్కఁడు,వానికడుపున నుదయిం
చెను బరిపూర్ణపరాక్రమ
ధనుఁ డగుబలిచక్రవర్తి దైత్యవిభుండై. 108

చ. దితిసుతవంశవర్ధనుఁడు ధీరుఁ డుదారుఁడు వేదశాస్త్రభూ
షితమతి ధర్మకర్మపరచిత్తుఁడు నీతివిశారదుండు సూ
నృతహితుఁ డస్త్రశస్త్రములనేర్పరి యైనయతండు యౌవనాం
చితుఁ డయి రాజ్యపాలనముఁ జేయ సమర్థత గాంచినంతటన్. 109

ఉ. ఈతఁడు నీతిమర్మముల ♦నెల్ల నెఱింగినబుద్ధిశాలి ము
త్తాతను బోలుశూరుఁడు వ♦దాన్యుఁడు పాలనధర్మసూక్ష్మవి
జ్ఞాత యటంచు వృద్ధగురు♦సాధుపురోహితమంత్రు లాతనిం
బ్రీతిని నిల్పి దైత్యవిభు♦పీఠమునన్ శుభలగ్నసిద్ధిగన్. 110

గీ. కనకకలశసమానీత♦గంధపుష్ప
కలితసింధునదీజలం♦బుల శిరమున
విధియుతంబుగ నభిషేక♦విధి యొనర్చి
పట్టముం గట్టి రధికవైభవము మీఱ. 111

వ. ఆసమయంబునందు 112

సీ. కరతాళములతోడి♦ఘనజయధ్వానంబు
కొలువునల్గడ మాఱు♦చెలఁగుచుండ
వేదార్థములతోడి♦విద్వదాశీర్వాద
నినద ముల్లంబును♦ దనుపుచుండ
స్తవపాఠములతోడి♦సంగీతనాదంబు
వీనులవిందు గా♦వించుచుండఁ
బుష్పాంజలులతోడి♦భూవరార్పితహేమ
మణిగణధ్వని చూడ్కి ♦మలపుచుండ,

గీ. పూర్వదేవత లెల్ల ను♦ప్పొంగుచుండ
హైమసింహాసనాసీనుఁ ♦డగుబలీంద్రుఁ
డమరరాజ్యాభిషిక్తుఁడై ♦యలరినట్టి
దేవనాథునివిభవంబు ♦ధిక్కరించె. 113

వ. అట్లతండు కులక్రమాగతరాజ్యలక్ష్మీసమాలింగితవక్షుండై యప్రతిహతంబుగఁ బరిపాలనంబు చేయుచు నొక్కనాఁడు సకలసామంతమంత్రిచమూనాయకబంధుమిత్రపురోహితసహితుండై పేరోలగం బున్నయంతఁ బ్రధానసచివులు కరంబులు జోడించి దేవా! నీ వింతకు మున్ను నీప్రపితామహునియుదంతము విన్నవాఁడ వైనను రాజ్యకార్యపరతంత్రుఁడవగుట మఱచియుందువు గావున నీ కావిషయ మిపుడు స్మృతికిఁ దెచ్చుట కనుజ్ఞ గోరుచు విన్నవించుచున్నారము సావధానుండవై యాకర్ణింపు మనుచు నిట్లు విన్నవించిరి. 114

శా. నీముత్తాత నరామరాహిపతులన్ లన్నిర్జించి లోకత్రయ
స్వామిఖ్యాతి గడించె, నాఘను ధనుస్స్వాధ్యాయపారీణు మా
యామార్గంబునఁ జంపెఁ న్కేశవుఁ డమర్త్యప్రార్థనన్ దానఁ దా
నీముల్లోకము లేలఁ గల్గె నిపుడాన్ఖుంద్రముండు దైత్యేశ్వరా! 115

శా. ఆతం జేలినలోకముల్ మరల నీ కవార్జించి ముత్త్రాతవి
ఖ్యాతిం దప్పక నిల్పఁబెట్టదని కొంకడంతానతో నున్నమా
చేతోవల్లరి పల్లవింపఁగ జగజ్జేగీయమానుండవై
పాతాళామరమర్త్యరాజ్యముల సంపాదింపు ముత్సాహివై. 116

క. నీ కున్న యంగబల మా
నాకేశున కున్నదో కొ! నరనాగేశుల్
నీ కరియప్పన మీరె! త్రి
లోకీజయలక్ష్మి నీకు లోనగు టరుదే? 117

క. కావునఁ జతురంగబల
ప్రావీణ్యము దోఁప ముందు స్వర్గంబుపయిం
గావింపు జైత్రయాత్రను
దేవేంద్రునిగుండె లవియ దితికులజేంద్రా! 118

చ. అనుటయుఁ జిన్నవవ్వు నగి యయ్యసురేంద్రుఁడు కొల్వునల్లలం
కును గలయం గనుంగొని ముకుందునిగర్వ మణంగ, ముజ్జగం
బును గడియించు టెంతపని? ముందుగ నాకముమీఁది కెత్తుఁడం
చనుమతి యిచ్చి లేవ నవు డందఱు జేయని లేచి రంతటన్. 119

క. అమితోత్సాహము మీఱఁగ
సమరప్రస్థానభేరిశబ్దము దిఙ్నా
గములకుఁ జెవు డొదవింపఁగ
నమరారిబలంబు వెడలె నద్భుతభంగిన్. 120

వ. అది యెట్లంటేని వినుము మహాపద్మ నికుంభ కుంభకర్ణ కాంచనాక్ష
కపిస్కంధ వజ్రనాభ విద్యుదక్ష గజోదర గజస్కంధ గజేక్షణ
పరిభృతు లగుముస్నా ఱుగురు మహారథికులు హిరణ్యకవచధారులై
పదివేలగజంబులతోఁ బురోభాగంబునను; అష్టదంష్ట్రిచతుర్వ్యక్త

చతుర్భుజ శతాంగ శతలోచన సహస్రపాద సహస్రబాహు రణో
త్కట ప్రముఖు లగునేనూర్వురు రథికవీరులు దివ్యాస్త్రధారులై
యిరువదివేలగుఱ్ఱంబులతో దక్షిణపార్శ్వంబునను, ధూమ్రాక్ష
శిఖనేత్ర శిఖధ్వజ సరభ శలభ మహాబల ముఖ్యు లగుముప్పదివేల
మహాశ్వికులు చండగదాకుంతకృపాణధారులై యెడమప్రక్కను,
బహువిధాస్త్రశస్త్రసంపన్నంబు లగునలువదివేలయరదంబులతో
నెనుబదివేలకాల్బంటులు వాలఖిల్యు లంశుమంతునిం బోలి త
న్ననుసరించి వెనుకప్రక్కనునడువ, మేరుశిఖరంబులందలిపుష్పితకింశు
కంబులం బోనియవ్వీరవరులకుఁ బ్రావృట్కాలజలదంబుమాడ్కి
ముఖవికాసకారియై వారినడుమ వజ్రకవచరత్నకిరీటధారి యగు
బాణాసురుం డనుబలినందనుండు సుబాహు మేఘనాద భీమగర్భ
కనకమూర్ధ కేతుమంతు లనువీరాతివీరులం గూడి రజతచక్రంబును
బతంగప్రతిమానంబును గాలాబ్దగర్జనఘోషంబు నగుకాంచనరథం
బెక్కియు నతనివెనుక శతసహస్రరథికవీరపరివృతుం డైనయనా
యుషాపుత్త్రుం డగుబలాసురుండు వేయిమెలుంగుల బూన్చినయుక్కు
రథం బెక్కియు నతనివెంటఁ బెక్కువేలయోధవరుల ఖరవాహంబు
లైనయఱువదివేలయరదంబు లెక్కిచుట్టుముట్టి యరుదేరఁ బ్రభా
తంబున క్షీరసాగరమధ్యవర్తి యగుసహస్రాంశునిం బోలి విరాజిల్లు
నప్రతిమానప్రతాపశాలి యైననముచి పెద్దపులులం బూన్చినకంచు
రథం బెక్కియువానిపిఱుంద నర్ధలక్షస్యందనంబులు వెంట నంట
మహాశూరకీర్తనీయుం డగుమయుండు సింహధ్వజం బెత్తినయచ్ఛ
భల్లరథం బెక్కియు దేవలోకజిగీషంజనిరయ్యెడ వెండియు— 121

చ. అనుపమసత్త్వసంయుతమహాంగసహస్రముఁ బూన్చినట్టివే
రినుపరథంబు నెక్కి కడునేర్పెల నేగఁ బసిండిరేకుగా
ప్పినపిడితోడివెండిగద చేకొని యర్వదివేలతేరులె
కిన్కవిలుకాండ్రు సంబరపుగేకల వెంటఁ బడం బులోముఁడున్. 122

ఉ. దేవపురంబుపై బయలుదేఱె మహానగధీరుఁ డాహయ
గ్రీవుఁడు నాక మెల్ల తలక్రిందుగఁ జేయఁగఁ జూచునుద్ధతిన్
గ్రావసమానలక్షరథరాజి వహించినపంచలక్షదం
తావళపంక్తిబృంహితనినాదము లింద్రునివీనులం బడన్. 123

ఉ. ఆదరణీయసత్యకరుణాభరణుండు శతాధ్వరుండు వి
ద్యాదయితుండు వీరుఁడు నుదారుఁడు సింధుగభీరుఁ డైనప్ర
హ్లాదుఁ డసంఖ్యవీరరథికావృతుఁడై సురసేవ్యమానవా
ణీదయితుండు నా వెడలె నేర్పునఁ దాడిసిడంపుఁదేరిపై. 124

గీ. అతనిసోదరుఁ డగుననుహ్లాదుఁడంతఁ
బంచలోహరథంబుపై బయలుదేఱెఁ
బరశుభల్లశతఘ్నికాపాశహస్తు
లైదులక్షలకాల్బంటు లనుగమింప. 125

ఉ. లక్షరథాధినాథుఁడు విలక్షణవేషుఁడు మాయలాఁడు క
ల్పక్షయకాలవాయుజవలక్షితకోటితురంగవాహినీ
రక్షకరక్షకుండు నవరత్నకిరీటుఁడు ఖాదిరాగ్నిర
క్తాక్షుఁడు నైనశంబరుఁ డహార్యముఁ బోలినతేరిపైఁ జనెన్. 126

ఉత్సా. బాహుదర్పవీరమల్లవార మెల్ల నాజికు
త్సాహ మొప్పఁ జేర నస్త్రశస్త్రపూర్ణుఁ డద్భుత
వ్యూహసంవిధానవేత్త యోగవేత్త మిత్రసం
దోహయుక్తుఁ డావిరోచనుండు పోరికిం జనెన్. 127

గీ. పోరు చేయంగ బుజము లుప్పొంగునతని
తమ్ముఁడు కుజంభుఁ డనువాఁడు తరలి వెడలె
దండశరచాపకలిత మహాదండుతోడ
వెండి తేరులు పదివేలు వెంబడింప. 128

తరల. అతనివెంబడి నద్రిపాదపహస్తఘోరనిశాచరా
యుతయుతుం డయి పర్వతాయుధుఁ డుగ్రబాహుఁడు నీరదా
సితశరీరుఁడు చక్రనేత్రుఁడు చిత్రరత్నకిరీటభూ
షితశిరుం డసిలోముఁ డాలము చేయఁగా వెడలెన్ వడిన్. 129

మానిని. వానిబడిన్ సురవైరిచమూపతి వల్లభుఁ డాహవఘోరుఁడు దు
ర్మానుఁ డహీనపరాక్రమశాలి కరాళశరీరుఁ డనాయుషయు
న్మానినిపుత్త్రుఁడు నాఁబడువృత్రుఁ డనంతబలంబుల వెల్వడెఁ గో
పానలకీలలు పర్వఁగ నెల్లెడ నాఁకలిగొన్నమృగేంద్ర మనన్. 130

సీ. అంతటఁ గాలచక్రాభీలబహుచక్ర
చక్రంబుతో నేకచక్రుఁ డేగె
నతనితోఁ గాలాంతకాకారిసాగర
గంభీరయోధచక్రంబు వెడలె
దానికి వెనుకను దాళకార్ముకుఁడు వృ
త్రునియన్న వీర్యవంతుండు నరిగె
వానివెంబడి ధనుర్బాణతూణీరముల్
దాల్చినజోదులు దండు తరలె

గీ. అంత శతమస్తకోదరుఁ డతివిచిత్ర
బర్హిబర్హోపమాయసవర్మకలితుఁ
డసురకోటికి సేనాని యగుఘనుండు
సింహికానందనుండు వేంచేసెఁ బిదప. 131

సీ. బ్రహ్మకు వర మిచ్చి వరము గైకొన్నమ
హాతాపసుఁడు కశ్యపాత్మజుండు
వేయిజన్మములు గావించిన కర్మముఁ
దణిమాదిసిద్ధుల నలరువాఁడు
కైలాసశిఖరసంకాశాష్టనల్పహి
మాద్రిసన్నిభరథం బమరువాఁడు
శరదభ్రములఁబోల్కి జడ లంటి వచ్చుమ
హాకాయభటకోటి కాశ్రయుండు
గీ. పాండురచ్ఛత్రచామరభర్మవర్మ
మకుటుఁ డగువిప్రచిత్తినామకుఁడు పుత్ర
పౌత్రు లెల్లరు తేరులపై వసించి
తోడ రా దేవనగరికి దాడివెడలె. 132

గీ. వేయికారెనుపోతులు మోయునట్టి
కోటిగంటల తేరిపై గూరుచుండి
నూఱుచేతులు వందకన్నులు చెలంగు
దైత్యవీరుఁడు కేశియుఁ దరలె ననికి. 133

వ. కార్చిచ్చుమంటలం గాలి మెఱుఁగువడినబంగరు కొండకొట్టకొనం బోని చారుచామీకరమయం బగు బొమిడికంబు దాల్చి వేల్పులపాలిటి యకాలకాలుండు నా హంసధ్వజం బెత్తినరాకేందుకుందసితశత పత్రాకంబు త్రిలోకవిజయనామకంబు నగు శతాంగం బెక్కి వెడలిన యావిప్రచిత్తిని బురస్కరించుకొని రజతాద్రి విరాజమానశరీరులు నవదాతమాల్యాంబరధరులు శ్వేతాతపత్రులు పాండురధ్వజదండమండి తహస్తులు నై యర్ధచంద్రాకారంబు లైనవాఁడికోఱలతోడి భీకరా ననంబులతో సార్ధలక్షదానవయోధులు మయాసురనిర్మితంబు లగు మాయామయస్యందనంబు లెక్కి యనుగమించి రంత వెండియు,

గీ. పూని తాలిచి కట్టియుఁ గబోలుప్పు మీఱ
దనుజవీరులు తండోపతండములుగ
వెంటరా వృషపర్వుఁడు వెల్లికేగి
నట్లు వాద్యధ్వనులతోడఁ గనరిగె నపుడు. 135

వ. ఇట్లు పేరు మోసినబిరుదులు పెక్కెండ్రు కయ్యంపు వేడుకఁ గట్టాయితంబై లెక్కకు మీఱినచతురంగబలంబులతోఁ దిక్కులు పిక్కటిల్ల దివంబునకుం దరలినంతఁ, దనకు విజయంబు గోరుచు వేదంబులు పఠియించి మంత్రంబులు జపించి తంత్రంబు లాచరించి హోమంబులు పచరించి యోషధు లిచ్చి పరమోత్సాహంబు చూపినబ్రాహ్మణోత్తము లొక్కొక్కరికి నిష్కసహస్రంబు నష్టోత్తరశతగోధనంబు వస్తుదానంబు లిచ్చి వీడుకొలిపి, శరచ్చంద్రచంద్రికాసుందరంబు లగుకౌశేయాంబరంబులు సంతప్తజాంబూనదభూషణంబులు నవరత్నకిరీటవజ్రకవచంబులు ధరియించి శక్తిచక్రశతఘ్నికాదిసంగరోపకరణంబులు కూర్చినపంచలోహమయంబగునమున్నతస్యందనంబు నధిరోహించి సంగ్రామసమయపరిసాధనంబులుధరించినమహాకాయులు మహామాయులు మహాబలులు నగుదైత్యవీరులు గుంపులు గుంపులై సంచరద్రత్నాకరంబులమాడ్కి నిరుకెలంకుల సంకులస్వనంబుతో బయలుదేఱఁ బురోభాగంబున వందిమాగధజయజయధ్వానంబులు నృత్తగీతవాద్యస్వనంబులు రణభేరీభాంకారంబులు సందడింప సయశ్శిరశ్శతాశ్వప్రభృతులు పదిమంది దానవభటులు రథాంగంబులు రక్షింపఁ బుష్పమాలాలంకృతు లగుపుణ్యాజనులు శ్వేతచ్ఛత్రచామరధారులై యిరువలంకుల నిల్వ నసురతాపసులు నలప్రక్కలఁ బరివేష్టింప సువర్ణరసవిచిత్రితవృకధ్వజప్రదీప్తంబు మేరుశైలదేశీయంబు వైడూర్యహేమోపచితషోడశనల్వంబు

విద్యుత్ప్రభంబు సహస్రహయరత్నయుక్తంబు నగుమణిమయరథం
బధిరోహించి సకలదైత్యదానవచక్రవర్తి యగుబలీంద్రుఁడు. 136

సీ. అభినవాంభోజదామాంగరాగంబులు
శృంగారరసము పోషించుచుండ,
తటిదాభశితచక్రదండచండాయుధం
బులు వీరరసము పైఁ జిలుకుచుండ,
బాలసూర్యప్రభాభాసమానకిరీట
కాంతిపుంజము మింటఁ గ్రమ్ముచుండ;
చండాంశుభానుభాస్వరవర్మవజ్రరో
చుల నాల్గుదిక్కులు వెలయుచుండ,
గీ. తనకు దక్షిణనాయకత్వంబు జగతి
వెలయఁగా నొక్కమాఱుగ విజయలక్ష్మి
నమరపురలక్ష్మిఁ బెండిలియాడఁ గోరి
వెడలెఁ గడువేడ్కతోఁ బెండ్లికొడుకువోలె. 137

ఇంద్రుని సమరోద్యోగము

ఉ. ఈగతి నెత్తివచ్చెడిబలీంద్రునికయ్యపుఁబూనికన్ మరు
ద్వేగులు వేగు లేగి వినిపింపఁగ బంగరుగద్దె వెన్కకున్
జాఁగిలి కూరుచున్నసురనాథుఁడు ముందుకు వంగి నివ్వెఱన్
వేగులవాండ్రమాటలను వింటిరె యంచు సుధర్మనల్గడన్. 138

మ. కలయంగన్గొని పేరువేర సుమనోగంధర్వవిద్యాధరా
దులఁ జేరెక్కినపెద్దలం బిలిచి యాదుష్టాత్ముఁ దైత్యేంద్రు నిం
దులఁ గాల్పెట్టకమున్న కూల్పవలయుం గదోద్యోగ మీమీబలం
బులతో సిద్ధము కం డటంచు నయనంబుల్ కెందఁగా లేచినన్. 139

క. సురలోకనాథునానతి
శిరమునఁ గొని లేచి వారు జేజే యనుచున్
బరిపరివిధములఁ దమతమ
పరివారంబులను సిద్ధపఱిచినయంతన్. 140

చ. హరితరుచిం జెలంగినసహస్రహయంబులఁ బూన్చినట్టిభా
స్కరశతభాస్వరం బగుసువర్ణరథంబున నెక్కి- దైత్యసం
హరణచణంపుఁజక్ర మసురాదిని ప్రోదిని కేలఁ బూని యా
హరిహయుఁ డేగె మాతలి మహాశరభసంబునఁ దేరు ద్రోలఁగన్. 141

చ. అమలినతారహీరమణిహారము వెన్నెలగాయ వక్త్రబిం
బము వడి నెండగాయ మదమత్తబలీంద్రవినాశకాలచి
హ్నముగఁ గ్రమంబు తప్పి గగనంబున నొక్కటఁ గూడినట్టిపు
న్నమ నెలలేవెలుంగు లన నాకవిభుం డని కేగునత్తఱిన్. 142

ఉ. పాలకుఁ డేగె నా సపరివారము♦నా నుడిమాడ్కిఁ దారకా
జాలముఁబోలె వేలుపుల♦సంఘము నేగెను రాజు వెంబడిన్,
వేలుపుటొజ్జ సప్తముని♦వీరులు నాహరివెన్క గాములం
బోలుచుఁ బోయి రేకమయి♦పూర్వసురేంద్రునికీడుమూఁడెనాన్. 143

చ. పరశుగదాసికుంతశర♦పాశశరాసనపాణులై నిశా
చరులు శతఘ్నికాభిదుర♦సాయకహస్తులు యక్షపిశులుం
బరుగులు వాఱుచుం కడలి♦పాయలునా నిరువంక సాగఁగా
హరిహయునెత్తికోలు చరి♦తార్థముగా ధనదుండు నెల్వెడెన్. 144

ఉ. తేజమెలర్ప భూతపితృ♦దేవగణంబు భజించి వెంటరాఁ
దేజులు నూఱు లాగునొక♦దివ్యరథంబునఁ గూరుచుండి వి
భ్రాజితదండచాపశర♦పాశధరుండు క్రుధారుణాక్షుఁ డ
వ్యాజపరాక్రముండు నగు♦నంతకుఁ డేగె ననంతసేనతో. 145

చ. పగతురపాలిమిత్తి యగు♦పాశము పట్టి శిరస్త్రయాఢ్యప
న్నగములఁ బూన్చినట్టిదశ♦నల్పరథంబున నెక్కి నింగి న
ల్మ్రోగము జయధ్వనుల్ చెలఁగ♦ బోరన నాగబలంబు తోడురా
నగవరధీరుఁ డైనజలనాథుఁడు ♦పోరికిఁ బోయెఁ బిమ్మటన్. 146

సీ. ద్వాదశాదిత్యు లే♦కాదశరుద్రులు
నమరభిషగ్వరు ♦లష్టవసువు
లఖిలగంధర్వగు♦హ్యకసిద్ధసాధ్యులు
కిన్నరచారణ♦కింపురుషులు
ధాత పర్జన్యుండు ♦త్వష్ట చంద్రుండును
విశ్వదేవతలును ♦విశ్వకర్మ
యాత్మీయదివ్యవా♦హనసమారూఢులై
కవచశిరస్త్రాణ♦కలితు లగుచు

గీ. బహువిధాయుధకలితులై ♦భండనమున
నమరవిభురాజ్యలక్ష్మి క♦య్యసురనాథు
బలిని బలియిచ్చి వత్తు మ♦ప్రతిన పూని
బయలువెడలిరి బాహుద♦ర్పంబు మెఱయ. 147

మ. మనుజేంద్రా! యిఁక వీరు వా రని గణిం♦పన్ శక్యమే దైత్యమ
ర్దనదీక్షం గొని చన్నయాదివిజబృం♦దంబందుఁ ము న్నాబలీం
ద్రునిదాడిం జవిగొన్నలోకముల నా♦దుర్మార్గుపై రన్నఁ జీ
యనువా రందఱు నేగి రొక్కవడిఁ దా♦ మాబాలగోపాలమున్. 148

వ. అట్లుసంభ్రమోత్సాహభరితంబు లైనదైత్యాదిత్యబలబులు రెండును
బ్రళయకాలజలధులం బోలి యొక్కటఁగలసినంత. 149

క. శరపాతము తోమరము
ద్గరఘాతము కుంతభల్ల♦ఖడ్గచ్ఛురికా
క్షురికోద్ఘాతము సరిపడ
నిరువాఁగులు కలియఁబడిరి ♦నేడ్తెఱ నంతన్. 150

క. ఒక్కొని కొక్కఁడు నెదురుగఁ
ద్రొక్కి నిలిచి పోరు చేయఁ ♦దొడఁగుట మొన న
ల్లక్కల నెక్కటికయ్యము
లక్కజముగ జరిగె నట్టి♦యాలము వినుమీ! 151

## దేవాసురయుద్ధారంభము

వ. సావిత్రుండు నాఁబడుపంచమమరుత్తునకు బాణుండును,ధ్రువనామకుఁ డగువసువునకు బలాసురుండును,అధ్వరునికి నముచియు,వాయువునకుఁ బులోముండును,పూషనామకాదిత్యునకు హయగ్రీవుండును, భగదేవునకు శంబరుండును,విష్వక్సేనునకు విరోచనుండును, అంశునకుఁ గుజంభుండు నుద్దితద్దయుం దగ నొక్కెడ నెదురై నిలిచి పోరుటయు;మఱొక్కెడ దేవాసురవిశ్వకర్మలకు దేవదానవశీతకరులగుసోమశరభులకు సురాసురదివాకరు లగుభాస్కరశలభులకును, అసిలోమమారుతులకు వృత్రాశ్వి దేవతలకు రుద్రవృషపర్వులకుఁ గేశిధనేశ్వరులకు నుగ్రసంగ్రామంబయ్యె. అంత సైంహికేయహిరణ్యగర్భులు ప్రహ్లాదదండధరులు వరుణవిప్రచిత్తులు ననుహ్లాదచిత్రరథులు నింకొకచక్కి నసహాయసంగరం బాచరించుచుండి రయ్యెడ వారివారిమెక్కటికయ్యం బాలోకింప సంజాతకుతూహలభరితాంతఃకరణుం డగుబలీంద్రుండు దైత్యరాజ్యనిర్మూలనబద్ధదీక్షుఁ డగుసహస్రాక్షుని బోరికిం జీరె.అట్లు దేవదానవచక్రవర్తు లిర్వురు తలపడుటయుఁ దక్కినయమరాసురవీరు లెల్లరు నొండొరులపైఁ గవిసి

కత్తిఁ వేటు వీఁటెలనాటులు పిడికిటిపోటులు వింటిఁవ్రేటుల లోర్వు
లదల్పులు పెడబొబ్బలు నెసఁగ ఘోరరణంబు సలిపి రట్టియెడ. 152

క. కలఁగంబాఱెను జలధులు
కులగిరులును వీఁగె రేఁగె ఘోరానిలముల్
తలచూపెఁ బుచ్చలాదిక
జలదంబులు భాస్కరుండు చండిమఁ జూపెన్ 153

వ. అట్లు మహోత్పాతంబు లుప్పతిల్లుతఱి. 154

చ. సనకసనందనాదిమునిచంద్రులు సన్నుతిసేయ నాత్మనం
దనులు పులస్త్యముఖ్యులు యథామతి గొల్వఁగ సాంగవేదముల్
మనవు లొనర్పఁ గా మణివిమానము నెక్కి చరించుచున్ సనా
తనుఁడు పితామహుండు రణధామము చూచుచునుండె
నయ్యెడన్. 155

ఉ. సైనికసింహనాదములు సజ్యశరాసనశింజినీస్వనం
బానకగోముఖార్భకమహాపటహాదినినాదముం గదా
ధ్వానము దిక్కు లెల్లఁ గలపన్ దమములాహవయజ్ఞదీక్షఁ గా
సేనలు రెండు పాల్పడె సశేషజగంబును దల్లడిల్లఁగన్. 156

వ. అమ్మహాయోధనయాగంబునకుఁ బ్రహ్లాదుం డున్నేతయు విరోచనుం
డధ్వర్యుండును నముచి హోతయు వృత్రుండు స్తోతయు మయుం
డుద్గాతయు ననుహ్లాదుండు ప్రస్తోతయు బలుండు పోతయు వృషపర్వుండు
ప్రతి ప్రస్థాతయు హయగ్రీవుండు ప్రతిహర్తయు బాణుండు బ్రహ్మయు
నసిలోమాదులు తక్కినఋత్విక్కులుంగా బలీంద్రుండు యజమా
నుండై, రథపంక్తులు యూపంబులు, సురలు యజ్ఞపశువులు, కృపా
ణంబు లిధ్మంబులు, పరిఘంబులు పరిధులు, తోమరంబులు స్రోమకల
శంబులు, శిరంబులు పురోడాశంబులు, రుధిరం బాజ్యంబు, బాణంబులు

స్రుక్స్రువంబులుగా, వైరేంధనసమీరితం బగురణాగ్నిహోత్రింబుఁ
బ్రజ్వలింపఁజేసి జంభకుజంభాదులు సదస్యులై యభినందింప విప్రచిత్తి
యుపద్రష్టయై యుత్సాహంబు గొలుప శంబరుండు శామిత్రంబు
నడప నమరుల నందు వేల్చుచుండెనంత. 157

బాణుఁడు సావిత్రి నోడించుట

చ. సురభటులుం బరాజయముచేఁ జనఁ గోర్వనిభంగిఁ దన్నిశా
చరపరిబర్హయోగమును జాగఁగ నీయక యంపవానలం
గురిసి మహోగ్రదీప్తముఖకాండము ముంపఁగఁ జొచ్చి రంత ము
క్కరుఁడగు బాణుఁ డయ్యమరసైనికకోటికి నడ్డువాఱుచున్. 158

మ. విమతానీకము నూఁతగా నిలుచుసావిత్రుండు పైరాఁగఁ జా
పమునం దొమ్మిదియమ్ములం దొడిగి తద్వక్షంబునం దేసి య
ర్యమకల్పం బగుబాణకోటి సురసైన్యాంభోధి నింకింప న
య్యమరశ్రేష్ఠుఁడు బాణునేపడఁచె రౌద్రాగ్నేయశస్త్రంబులన్. 159

ఉ. దానికి నోర్చి బాణుఁ డొకదారుణబాణము వింటఁ గూర్చి నీ
మే నిదె ముక్కలయ్యెఁ గనుమీ యని యేయ నతండు రెండుగా
దానిని ద్రుంచి రక్కసునెదం గుఱిచేసి శతఘ్నిశక్తిస
మ్మానిత మైనశక్తి ననమానబలంబున నేసె వేసినన్. 160

చ. బలితనయుండు నవ్విఁ యొకబాణమున న్నడుదారి దాని ము
క్కలుగ నొనర్చి నయ్యమరనాయకుఁ డల్గి నిశాతధారల
న్నలు వగుదానవార్దనముచేఁ జనుఖడ్గము నేసి వానిచే
విలు దెగఁగొట్టె నంత నరిభీకరబాహుఁడు బాణుఁ డుద్ధతిన్. 161

ఉ. ఒండొకవిల్లు చేతఁగొని యోరిసురాధమ! నీవు బాణుదో
శ్చండిమ కోర్తువే? యని కృశానుశిఖాభశిలీముఖోత్కరం
బొండొకటిం దగుల్కొనఁగ నోహరిసాహరి నేయ వానియు
ద్దండశరాళి తాఁకునకుఁ దాళఁగఁజాలక భీతిఁ దూలుచున్. 162

క. సురవరుఁ డగుసావిత్రుం
డరదంబు మరల్చికొంచు ననవ్వాలి కరిగెన్
సురవైరియోధవర్గము
పరమానందంబు నొందె బాణుఁడు పిదపన్. 163

చ. అనితల నోహటించి చనునాతనివెంబడిఁ బోక పాడి గా
దని తలపోసి వేల్పొకట నాహవదర్పము చూపుపాకశా
సనునరదంబువంకకు నిజంబగుతేరు మరల్చికొంచుఁ జ
య్యనఁ జని నంతలోపల బలాసురుఁడున్ ధ్రువుఁ దాఁకి యేత్తెను.

బలాసురుఁడు ధ్రువుని గెలుచుట

క. బలితపుఁబెనుగద నాతని
తలపై విసరంగ దానితాఁకున ధ్రువునా
దల బొప్పికట్టె బుజములు
నలఁగెను గవచంబు పగిలి నలినలి యయ్యెన్. 165

క. అయ్యెడఁ దక్కినవసువులు
చయ్యన నరుదెంచి బలునిసారధి హయముల్
డయ్యఁగ నబ్బలునరదము
వ్రయ్యఁగ శరవృష్టి గురియ వాఁడును గిన్కన్. 166

ఆ. తేరు డిగ్గనుఱికి దీర్ఘగదాదండ
మొండు త్రిప్పుకొనుచు నురవడించి
వారిపైఁ బడంగ వజ్రాయుధముఁ బోలు
దానివేగమునకుఁ దాళలేక. 167

క. అరదంబులతో నలుదెస
నరిగిరి భయ మంది యప్పు డాదిత్యభటుల్
శరకుంతభల్లతోమర
పరిఘంబులు బలునిమేనఁ బరపినఁ గినుకన్. 168

చ. అమితబలంబుకల్మిని మహాబలుఁడో యన నబ్బలాసురుం
డమరులదండుపైఁ బడి గదాహతి వారలబాహుపాణిపా
దములను నుగ్గుచేసి భువిఁ దల్లడ మందఁగ నార్చుచో నరిం
దముఁ డగునాథుఁ డప్పుడు శరధారల నాతనిఁ గప్పె నంతటన్. 169

ఉ. త్రొక్కినత్రొక్కుచుమాడ్కిఁ గడుఁ రోఁజుచు నాబలుఁ డోరిపంద! నీ
వెక్కడి కేగి తింత కిపుడేమని సిగ్గఱి వచ్చి తంచుఁ దే
ఱెక్కి శరాసనంబు వడిఁ నెక్కిడి యెక్కటికయ్యమందు నీ
యుక్కణఁగింపనే యనుచుఁ నొక్కఁడనమ్ములు కుమ్మరింపఁగన్. 170

చ. ఉరుభుజగర్వు లయ్యిరువుఁ రొక్కని నొక్కఁడు తీసిపోక సం
గర మొనరించి రస్త్రములఁ గాండములన్ శితచక్రసంతతిన్
బరశుకృపాణకుంతముల భండనరంగము గానరాక యం
బరమున బ్రహ్మదేవుఁడు విమానము నట్టిటు త్రిప్పి చూడఁగన్. 171

క. ఇరువురు నట్లాయుధములు
పరిపడునందాఁకఁ బోరి సంరంభమునం
బరుసంపునియుద్ధంబున
నరదంబులు డిగ్గి నుఱికి రయద్భుతలీలన్. 172

ఉ. కారెనుపోతులట్లు కడుఁ గావర మెక్కినకొమ్ముటేన్గుల
ట్లీరస మెత్తుమత్తవృషభేంద్రములట్టులు పోతరించుకుం
భీరములట్లు మైమఱచుఁ బెబ్బులులట్టులు పోరునట్టియ
వ్వీరులబాహుయుద్ధమునఁ విహ్వలభావము గాంచి రెల్లరున్. 173

గీ. పెద్దయుం బ్రొద్దు వా రట్లుఁ హద్దు లేక
దండదెబ్బలు మెడపట్లుఁ దండపట్లు
గుంజులాటలు ద్రోపాటఁ గ్రుద్దులాట
లాడనాడంగఁ దుదకు బలాసురుండు. 174

గీ. ధ్రువునిమెడ గట్టిగాఁ బట్టి దూరమందు
తల్లక్రిందై పడంగఁ బంతానఁ ద్రోసి
దివిజవీరులగుండెలు దిగ్గురనఁగ
నార్చెఁ దననామ మన్వర్థ మగుచు వెలయ. 175

క. ఆదెబ్బ దానిమించిన
యాదీనత యంగ మంతరంగము నొంపన్
ఖేదంబున ధ్రువుఁడును బ్రా
చీదిఙ్ముఖుఁ డగుచువీడు చేరఁగ జనియెన్. 176

నముచి యధ్వరు నేపణఁచుట

ఉ. అత్తఱి వేఱుచో నముచి యధ్వరు మార్కొనె, వారు శౌర్యసం
పత్తిని వాసి లేక తమబాణపరంపర నంబరంబు ను
వ్వెత్తుగఁ గప్పి యొక్కమెయి విశ్వభయంకరలీలఁ బోరుచో
నుత్తలపాటు నుత్సవము నొలిఁ గనంబడె వారివాఁగులన్. 177

చ. నముచి పదాఱుముల్కు లెదనాటిన నధ్వరుఁ డల్కఁ రుక్మపుం
ఖములును వాఁడివాతు లగుకాండము లిర్వది మేని గ్రుచ్చియు
య్యమరవిరోధి కేతు వొకయమ్మునఁ గూలిచె వాఁడు యూథనా
థము బరిగోలలంబలె శితప్రదరంబులఁ గొట్టె నధ్వరున్. 178

ఉ. అంతట నధ్వరుండును మహారభసంబున నద్దురాత్ము తే
రింతలు నంతలై పగుల నేసిన,నాతఁడు బెగ్గడిల్ల ది
గ్దంతులు శంఖమూఁది శితధారము సూర్యనిభంబు కీలవి
క్రాంతము నైనచక్రము నరాతిరథంబున నేసె యేసినన్. 179

క. అరనిముసంబున నధ్వరు
నరదము మసియయ్యె సూతుఁ డంతము నొందెన్
దురగంబులు పారిపోయెను
బరివారం బెల్ల పిక్కబలముం జూపెన్. 180

ఆ. దాన నధ్వరుంపు కతల ఖంచుకొనిపోయె
వచ్చినట్టిదారి కపట్టి యట్టె
నముచి విజయభేరికనాదంబు మిన్నంట
నమరసేనం జక్రకమంటితటిమె. 181

మయుండు త్వష్ట నోర్చుట

ఉ. వెండియుం ద్వష్టయు న్మయుండు కవిశ్రుతసర్వవిఘాస్త్రప్రసిద్ధియున్
భండనరంగచండతరకబాహుబలంబును బెచ్చు మీఱ నా
ఖండలుండున్ బలీంద్రుండు సుకఖంబున ముజ్జగ మేలుకోర్కిం దా
మొండొరు లాహవంబున జయోత్సుకతం దలపడ్డ నొడ్డునన్. 182

క. అన్నిర్జర సేనాగ్రణి
మున్నాఱుశరంబు లొక్కొక మొగిం జాపమునం
బన్ని ప్రయోగించిన మయుం
డన్నారాచముల నడుమ కనడంగించి వడిన్. 183

గీ. మేటితొలకరిమొగులు డకబ్బాటువాన
కురియునట్టులు శరపరంకపరలు పరపి
యతనిరథసూతతురగచకయంబుతోడం
గలంచె ముమ్మాటు లూపిరి కసలుపకుండ. 184

ఉ. అందు కమర్త్యవీరుం డరుకణానన్ముండై కనుదోయి నిప్పుకల్
చిందంగం దేరిపైం గినుకం కజిందులు త్రొక్కుచు, గాలరుద్రమూ
ర్తిం దలపెట్టునాకృతి నుకదీర్ణ మరిందమ ముష్టరశ్మిరమో
జం దు లకించుదాని నొకకశక్తిని జేతికొలంది వేసినన్. 185

క. అది రథశిఖరము దాంకెడి
యదనున మయుం డేడుముల్కుక లపరించి వడిన్
జిదురలుగాం గొట్టి శిత
ప్రదరంబులు విడిచె నమరకవల్లభు మేనన్. 186

గీ. ఆతఁ డన్నింటిఁ దెగఁగొట్టెౝ యగ్నిశిఖలఁ
గ్రక్కునుక్కుమ్ము లైదునూౝ లొక్కమాఱు
రక్కసునిమీఁదఁ బరప నౝమ్మొక్కలీఁడు
వాఁడిగద ద్రిప్పి వానిఁ జెంౝడాడి మఱియు. 187

క. ఏనుశరంబుల సూతుఁ బ
దేనింటఁ దురంగరాజిౝ నీల్గింప,ధను
ర్జ్యానాదముతో నిర్జర
సేనాని రథంబు డిగ్గెౝ శితబాణములన్. 188

ఆ. మయునిచేతివిల్లుౝ మధ్యకు నఱకిన
నాతఁ డొండుచాపౝ మందుకొనుచు
నమరవరునికార్ముౝకము త్రుంచి వెండియు
వాఁడితూపు లేదుౝ నేడు గాఁగ. 189

చ. తొడిగి తదంగరక్షకులఁౝ దూలఁగ నేయుడు దేవవిశ్వక
ర్ముఁడు పదునాల్గుసూదిమొనౝముల్కులు తో నడరించి నీమదం
బడఁగెనుగాదె యంచు వడిౝ నార్చిన నమ్మయుచేతివింటితోఁ
గుడిబుజముం బతాకరథౝ కూబరమున్ విదళించి వెండియున్. 190

ఆ. అస్తమించునట్టిౝ యాదిత్యమండలం
బందు చొచ్చువెలుఁగుౝ లట్లుపుట్ట
కలుఁగులందు చొచ్చుౝ కాలసర్పములట్లు
పుడమిలోనఁ జొచ్చెఁౝ బాడమ వింత. 191

గీ. ఆశరాహతి కోర్చి మౝ యాసురుండు
త్వష్టజొమ్మొక్కయమ్మునౝ వ్రక్కలింప
నతఁడు కంఠగతప్రాణుఁౝ డగుచు వెడలె
మయుఁడు తత్సేనపైఁ బడెౝ మఱియునంత. 192

వాయుదేవుఁడు పులోమాదుల నిర్జించుట

మ. తనవారట్టులు పాఱిపోవఁ గని సంతాపంబుతోఁ దన్ను మిం
చినవేగంబునఁ బోవు తేరిపయిఁ దానాసీనుఁడై వాయువ
య్యనిరంగంబున కేగుదెంచు తఱిఁ బేరల్కం బులోముండు త
ద్ఘనుమార్గంబున కడ్డువచ్చి ధను వత్యంతంబు మ్రోఁగించినన్. 193

శా. ఆవిస్ఫారము విన్నమారుతుఁ డసూయారోషసంరంభుఁడై
దేవారాతిబలంబు బెగ్గిలఁగ నుద్రేకించి ఝుంఝూధ్వనిన్
ద్యావాభూములు నించి తీవ్ర మగువాయవ్యాస్త్ర మొండేయఁగా
నావేగంబున దిర్దిరం దిరిగె బెండై వాని తేరంతటన్. 194

క. అరుణాక్షుఁడై పులోముం
డరిఁబోసి సహస్రబాణ మడరింపఁగ నా
శరములు కిరణంబులుగా
నరుణుం డుదయించినట్టు లతఁ డలరారెన్. 195

క. తనకఱకుటమ్ము లమ్మెయి
ననిలుని మెయిఁ గాఁడకునికి యారసి వాఁ డ
గ్గిని బోలునంపగమి నే
సినఁ బూచినమోదుగట్లు చెలఁగె నతండున్. 196

క. సురవైరి యంతఁ దనయిరు
తరకసములు వట్టిపోవ ధను రాగమచా
తురి యంతయుఁ జూపఁగ నా
శరములు పెనుమంటఁ జొచ్చు శలభము లయ్యెన్. 197

చ. అనుపమశక్తి నయ్యసురయమ్ములు వమ్మొనరించి యట్టు ల
య్యనిలుఁడు వానిఱొమ్మిరువదమ్ముల నాటఁగ నేయ వాఁడు తే
రున నొఱఁగెన్ బలంబఱి మరుద్గణముల్ దివి నార్చె నారవం
బును విని వచ్చి యద్దనుజపుత్రులు సప్తమహారథుల్ వడిన్. 198

ఉ. వారిదముల్ మహీధరముపై జలధారలు నించుమాడ్కి న
మ్మారుతుమీఁద నుద్దవిడి మార్గణముల్ పరగింప నాతఁడున్
వారణహస్తతుల్యనిజ వామకరంబును బెంచి వానినే
వారిశిరంబులందు పడ వైచెను గూలిరి వార లుర్విపై. 199

క. పిదపఁ బులోముఁడు తాఁకిన
మద మణఁగఁగ వానిఁ గొట్టి మఱి తద్బలముం
బ్రదరంబుల విదళింపఁగ
మొద లూడినచెట్లునాఁగ మ్రొగ్గిరి వారల్. 200

ఉ. నాఁటిరణంబుతీరు జన నాయక! యేమని యుగ్గడింతు? బ
ల్మేటిమగండు మారుతుఁ డమేయపరాక్రమశాలి యాతఁడు
స్రాటగణంబు లేటికదు పట్టులు వేఁటయొనర్చి గైరికా
పాటలశైలజాల మను భ్రాంతిని గూర్చెను జూచువారికిన్. 201

ఉ. రాసులు రాసులై సముదరంగమునల్లడఁ గూలినట్టియ
య్యాసురసంఘహస్తివిసరాశ్వగణంబులనెత్తు రస్రప
త్రాసకరంబు భూతసుఖదాయకమై చదలంటఁ బొంగి స్వ
ర్గాసరిదుద్ధతిన్ జవభరంబున నల్లడ వెల్లువై చనెన్. 202

క. శరచాపముసలముద్గర
కరు లగుచుఁ బులోముఁ డేలు కాల్బంటుల్ వే
వురు వచ్చి చుట్టుకొని పరి
పరివిధములఁ బోరుసల్పుఁ బవనుం డంతన్. 203

చ. తనజవసత్త్వముల్ సువిదితంబులుగా భుజయుగ్మ ముబ్బఁగాఁ
గనుఁగవ జేవురింపఁ బటుకాండపరంపర లేసి వారిలోఁ
నెనిమిదినూర్లమంది వధియించి మహాపథ మేర్పరించి యా
ర్చెను, ఇవి నేఁటి కాతెరువు చేసినచొప్పున నొప్పు భూవరా! 204

గీ. అమరరాక్షససంగ్రామమందు వాయు
దేవుఁ డొనరించినట్టియా దివ్యపథము
వాయురథు లనఁబడుసిద్ధవర్యు లెపుడు
నేమఱక కాచుచుందు రహీనభక్తి. 205

వ. అట్లు సమీరణుండు పులోము నుక్కణంచి నిశాచరమర్దనంబునఁ
దనివి తీఱక తనయరదంబు వేఱొండుచోటికిఁ దరలించుకొనిపోయి
నయనంతరంబ. 206

హయగ్రీవుఁడు పూషుని విరథుని జేయుట.

ఉ. దేవవిరోధిసేనలకు దేసువ చేకుఱునట్లు మత్తదం
తావళపంక్తిఁ బూన్చినరథంబున నెక్కి బిఱాన నాహయ
గ్రీవుఁడు సింహనాద మొనరించుచు నచ్చటు చొచ్చి, దైత్యయో
ధావళి నొంచుపూషుఁ డెదురై చనుదెంచినఁ గిన్క పేరిమిన్. 207

చ. గుడుసువడంగ హేమమయకోటిశరాసన మారనంగు పె
ల్లడరఁగ నల్లియుం దివిచి యద్భుతనైపుణి నంబకంబులం
దొడుగుట యేయు టేరికిని దోఁచకయుండెడుభంగి మంచుకై
వడిఁ గురియించె శత్రుభటవారము తల్లడ మంద నెవ్వడిన్. 208

ఉ. గొప్పదియై మహాశిఖరికూటముఁ బోలినవానివింటియం
దప్పటి కప్పు డుప్పతిలు నట్టు లనంతములై తనర్చి వే
యుప్పరవీది బారులయి ♦యోలిఁ జరించెడుడేగపిండుల
ట్లొప్పినయాశరవ్రజము ♦లొక్కటఁ బూషుని తేరు గప్పినన్. 209

క. గణనకు మీఱినయాశర
గణములు పూషునివిశేష ♦కాంతికిఁ దొలుతన్
మిణుఁగుఱులై సాగరజల
కణములునై పిదప నతని ♦కరముల నణఁగెన్. 210

గీ. దాని కద్భుతపడుచు నశ్వద్ధానవుండు
వాఁడిసాయకముల జడి♦వాన గురియ
నది యతనివేఁడివెలుఁగున ♦నంతరించె
వాఁడు నిది పని కా దని ♦వరుసపెట్టె. 211

చ. పొగడికఁగన్న యట్టిపాలి♦పోవనికోలల నేసి కేతువుం
బగిలిచి రశ్మియోక్త్రములు ♦ వ్రయ్యలుచేసినఁ బూషుఁడల్కన
ప్పగతునివిల్లు ముష్టి కెడఁ♦బాపి సిడంబును గూల్చి సూతుకే
లఁగలిచె నంత వేఱొకశ♦రాసన మాతఁడు పట్టి యుద్ధతిన్. 212

క. సారధి రెండిట వ్రాల్చియు
వారువముల మూఁటఁ గూల్చి♦పలుపఱియలుగాఁ
దేరిని నాల్గిటఁ జీల్చియు
బీరము చెడి యడలఁ బూషు♦విరథుని జేసెన్. 213

గీ. అపుడు పూషుఁడు లజ్జించి♦యమరనాథు
తేరివంకకుఁ బఱచె నశ్వధీరుఁ డగుచు
నచట నప్పుడె పొసఁగె మ♦హారణంబు
భగున కగధీరుఁడై న♦శంబరున కందు. 214

శంబరుఁడు భగునిదఱుముట.

గీ. పొడుగు పండ్రెండుమూరలు♦వెడలు పేడు
జేనలై లావు బిగి జిగి♦యైనయట్టి
భర్మకార్ముక మొండు చే♦పట్టి నారిఁ
బిడుగు మ్రోఁగినకరణి నె♦వ్వడిని లాగి. 215

ఆ. కడలితరఁగలట్లు ♦కంపించి కంపించి
కలఁగఁ బాఱ వేల్పు♦బలఁగ మెల్ల
నిసుము చల్లుమాడ్కి నిషు♦కోటిఁ బరఁగించి
మొగ్గరంబు నొక్క♦మొగిని జీల్చె. 216

గీ. అంతకాలనిరూపాక్షుఁ♦డనఁగ శంబ
రుండు భగుఁ డున్నయెడఁ జొచ్చి♦చుండ నతఁడు
నధర మదరంగఁ గ్రోధర♦క్తాక్షుఁ డగుచు
విల్లు మోపెట్టి పెడబొబ్బ♦పెట్టినపుడు. 217

చ. పరిసరవర్తు లచ్చెరువు♦పాటున మాఱ్పడి చూచుచుండ నం
బరచర[illegible]న్నిజాని[illegible]♦భావము జంకున దూఱుచుండ ని
ష్ఠురశరపాతభీతి రణ♦శూరులుఁ ద్రొక్కుఁడు లాడుచుండ న
య్యిరువురు నంపవానగురి♦యించి రనంతము తూఁటువోయె నాన్.

చ. నురుగులు గ్రక్క వాహములు,♦నొవ్విన కొర్వక చక్రరక్షకుల్
పరుగులు వాఱ, సారథులు ♦బాణపుదెబ్బలఁ జాలసోలి కూ
బరముల వ్రాల, నొండొరుల♦వర్మము లొక్కటఁ జీలఁ బోరుచే
సిరి రుధిరంబు పై కెగయఁ♦జిమ్మనగ్రోవులఁ జిమ్మునట్లుగన్. 219

మ. అపు డాశంబరుఁ డాత్మమాయ గగనం♦బత్యంతగాఢాంతకా
రపరీతంబుగఁ జేసి తాను ధనురా♦రావైక విజ్ఞేయుఁడై
కపటాయోధనబుద్ధియై పటుశరా♦ఘాతంబునం జేసి సూ
తుపదంబుల్ హయకంఠముల్ నఱికి తో♦డ్తోఁ గూల్చి తేరంతటన్.

ఆ. భగునిమేను తూఁటు♦పఱచి జల్లెడచేయ
నతఁడు వింటిమ్రోఁత♦నాకళించి
దాని తెన్నువట్టి దశసా♦యకము వేసె
వాని శంబరుండు ♦వమ్ముచేసి. 221

ఉ. ఆతనిచేతివిల్లు దును♦మాడియు నచ్చట నంతరించి మా
యాతిమిరంబు వాపి సమ♦రాంగణమం దిఁకనొక్కచక్కి వి
ద్యోతితమూర్తియై యమర♦యోధుల నుక్కడఁగించి తాను ని
శ్చైతనునట్లు కూలి కడు♦ జిత్రముగా మఱియొక్కపట్టునన్. 222

ఉ. పర్వతతుల్యగాత్రుఁ డయి♦భవ్యదిశాగజ మెక్కి తోఁచి సౌ
పర్వగణంబు నొంచి బహు♦పర్వతరూపము దాల్చి వెండియున్
సర్వరణాంగణంబునఁ బ్ర♦చారము సల్పి నిమేషమాత్ర న
గ్గర్వగరిష్ఠుఁ డాకసము♦గ్రమ్మె జగత్ప్రలయాంబుదాకృతిన్. 223

మ. అతఁ డారీతి ననేకభీషణతర♦ప్రాకారముల్ చూపి య
ద్భుతవర్షం బొకతూరి యొక్కపరి వి♦ద్యున్మాల లింకొక్కమా
ఱతితీవ్రాగ్నికణంబులం గురియ దే♦వానీక మల్లాడి కుం
ఠితవీర్యం బయి సింగముం గను మృగా♦నీకంబునా నల్గెసన్. 224

గీ. పఱవ నాతఁడు వెండియుఁ♦బ్రాంశుదేహ
మలర శతమస్తకోదరుఁ♦డగుచుఁ దోఁచి
సిద్ధసాధ్యులు శస్త్రముల్♦చిమ్మ వాని
నెల్ల దిగమ్రింగి భగునిపై♦కెగిరె మఱియు. 225

సీ. ఆతాఁకునకు నోర్వ♦కాతఁడు భీతిల్లి
పరువెత్తి యింద్రుని♦శరణుచొచ్చెఁ
బరభయంకరుఁడు శం♦బరుఁ డంతఁ బరుసంపుఁ
బలుకులఁ బావకుఁ♦బిలిచి యతఁడు
పోరుచున్నెడ కేగి ♦యోరి! నాచేత నీ
యంత మంచంతనె ♦యంతరించె
నంతలో రోహిణీ♦కాంతుండు సమరధీ
రులు తోడరా నని♦తలకుఁ జేరి

గీ. శిశిరశస్త్రాస్త్రనిష్ఠుర♦ విశిఖకోటిం
బరరథికరాజిఁ బరిమార్చి ♦యరదములను
నుగ్గుగావించి గజముల ♦ గ్రొమ్ముఁగొట్టి
తురగములఁ గూల్చెఁ బటుకోప♦భరితుఁ డగుచు. 226

గీ. శివునిచేతిపినాకంబు నవలఁ ద్రోయు
వతనియస్త్రంబు మహిమ మేమనఁగ వచ్చు?
చండమారుతుఁ డడవి వృక్షములఁ గూల్చు
నట్లు భటవర్గమును గూలఁగొట్టె నపుడు. 227

ఉ. దానవచంద్రభాస్కరులు తాలసమానశరాసనంబులం
బూని శశాంకు నంపజడి ముంపఁగ, నయ్యిరువాఁగుశింజినీ
ధ్వానము భేరిభాంకృతులు వారణఘీంకృతు లశ్వహేష లా
నానన మాఱుమ్రోఁగఁ దుములాహవసంకులమయ్యె నత్తఱిన్. 228

గీ. విండ్లు మబ్బులు, ములుకులపిండు మెఱుము,
లరదములచప్పు డుఱుములు, నిరుబలంబు
కాలిబంట్లతలల్ వడగండ్లుగాఁగ
వఱదలై పాఱె నెత్తుటివాన గురిసె. 229

చ. తలలకు మొండెముల్ మిగులదవ్వఁగఁ గూలెడుకాలుబంట్లు, రౌ
తులు తలక్రిందులై పడఁగఁ దున్కలుగాఁ బడుగుఱ్ఱముల్, కరం
బులు మునికాళ్లు తెవ్వ గజముల్ వడిఁ గూలినఁ గూలుతేరు, ల
ప్పొలికల నెల్ల నిండెఁ దరు మూలమహీధరరాసులో యనన్. 230

క. కను మూసి తెఱచులోపల
ననలంబునఁ గూలుమిడుతలట్లు తమబలం
బణఁగారఁగ హతశేషులు
దనుజులు కడుసాహసంబు ధైర్యము మిగులన్. 231

ఉ. చావఁగఁ దక్కనట్టిసురజాలముబీర మణంప వారిపైఁ
బోవ శరక్షతాంగు లయి మూలల డాఁగినవేల్పుబంట్లుసీ!
చావున కిన్ని చావులొకొ! సంగరరంగము చొచ్చి చత్తమం
చావిబుధాళి కండయయి యాహవదర్పము చూపి రయ్యెడన్. 232

ఆ. అమరపూజ్యుఁ డైనశ్రీయట్టివిష్వక్సేను
వీఁచ మణఁచుమతి విరోచనుండు
బాణ మొండు నొసలికపై నాట నాతండు
నమ్ము లేను వానికట్టొమ్ము గ్రుచ్చె. 233

ఉ. అంతట వాఁడు తోత్రమున ♦నర్దితమైనగజంబుమాడ్కి దు
ర్దాంతరుషారుణాక్షుఁ డయి ♦రౌద్రిము గ్రక్కుచు నౌరసాధ్య!నీ
వింతటినేర్పు కాఁడ వని ♦యేఁ గలనైన దలంపఁ గాని నీ
వింతకు మున్నె యంతకుని♦యింటికి విందవు గాకయుందువే? 234

చ. అనుచును వాఁడివాయి గల♦యంబకసప్తకముం దగిల్చి త
త్తనువు పవిల్చి యార్చిన,న♦తండును డెక్కొపుఁగంబ మూఁతగాఁ
గొని కడుసొమ్మసిల్లె,నరి♦ గూలె నటంచు విరోచనుండు త
క్కినసురరాజి నాజి శర♦కీలితగాత్రులఁ జేయునంతలో. 235

క. విష్వక్సేనుఁడు దెప్పిఱి
యిష్వాసముఁ బూని మరల♦ నేడ్తెఱ నెదురా
నిష్వాసు లైనదనుజుల
విష్వక్ప్రాచతతుల♦ విదలించుతఱిన్. 236

వ. విరోచనుండు బహుచిత్రగతులం దన తేరు నడపించుచుఁ గమలాకరంబు చొచ్చినమత్తదంతావళంబు భంగి నిర్జరవాహినీమధ్యంబునం బ్రవేశించి కలగుండువెట్టుచు గదాశుండాభిఘాతంబులఁ బదాతిబాహానలినీవలయంబు చిక్కుపఱచి శరాసారంబుల నాశ్వికశిరఃపంకజంబుల రూపుమాపి శక్తిదంతప్రహారంబుల రథకూబరతటతరుమూలంబులు పడఁగొట్టి ప్రలయకాలజీమూతంబుమాడ్కి గర్జించి యెక్కడఁ జూచినఁ దానయై కనుపట్టుచు భ్రాంత ముద్భ్రాంత మావిద్ధ మాప్లుతము విప్లుతము యుగము సంపాతము సముదీర్ణము నానని

మిదినంయుగప్రకారంబులు చూపుచుఁ బ్రలయపావకునిమాడ్కి
విజృంభించినంత నిహతశేషంబై నబృందారకబృందంబు చెల్లాచెదరై
నలుఁగడలం బఱచె నంతవిష్వక్సేనుండు సపరివారుఁడై పలాయితుఁ
డగుటయు,నతనికి బాసటయై నిలిచినయంశనామకాదిత్యుఁడు పదివేల
యేనుఁగులతో రాక్షససైన్య మెదుర్కొనె నట్టియెడ. 237

క. దనుజవరుండు కుజంభుఁడు
ఘనతర మగునినుపగుదియ గైకొని లయవా
యునిమాడ్కిఁ దద్గజావళి
ఘనముల విరియంగఁ గొట్టెఁ గరభసమునన్. 238

చ. సమధికబాహుదర్పుఁడు కుజంభునిపెన్గదవ్రేటులన్ విశీ
ర్ణము లగుగండతుండచరణంబుల నెత్తురు గాఱ ఘీనినా
దము దివి మాఱుమ్రోయఁగ వితాకున నల్గడఁ బాఱుదంతిబృం
దము గనుపట్టె దైత్యవిభునాశనసూచకవారిదాళినాన్. 239

ఉ. అప్పుడు దేవరాజు సకలామరసేనకుఁ జేయి వీవఁగా
నుప్పెనపోల్కి నమ్మొనయు నుద్ధతి వచ్చి కుజంభు ముట్టినం
జెప్పెడి దేమి!యయ్యసుర సింహనినాదము చేసి పెన్గదం
ద్రిప్పుచుఁ జెట్టు దుల్పినగతిం రథకుంజరవాజిఁ గూలిచెన్. 240

చ. సురభటు లప్పుడచ్చెరువు శూరత సిగ్గును దోఁప నన్నిశా
చరు గుఱిచేసి క్రూరశరజాలము లేయ నదెల్ల వోతుపైఁ
గురిసినవాన యయ్యె నిటు ఘోరరణం బగువేళ దానవే
శ్వరుఁ డసిలోముఁ డయ్యమరసైన్యముపాలిటిధూమకేతువై. 241

క. చనుదెంచి హారిణమధ్యం
బున సింగము గగనమధ్యమున లేవెలుఁగో
యన ననితల దేవగణం
బునకు భయభ్రాంతు లొదవఁ బోరొనరించెన్ 242

గీ. అతనిదారుణపరిఘగ♦దాస్త్రశస్త్ర
సాయకాఘాతములఁ బ్రతి♦క్షణము నాత్మ
దేహములు తూటువడుచున్న♦దేవవీరు
లపజయాశంకఁ బోరి ర♦య్యసురతోడ. 243

క. ఆరోమహర్షణం బగు
పోరున నిరువాఁగు మోహ♦మూఢాత్మంబై
ఘోరాస్త్రవ్రణశోణిత
ధారాకర్దమముఁ జేసి♦ధరణీతలంబున్. 244

క. పదపడి తుములంబునకును
మొదలిడి చేపడినయంగ♦ములఁ దుంపఁగ న
క్కదనక్షోణి యనంగా
స్పద మద్భుతహాస్యరౌద్ర♦పదమును నయ్యెన్. 245

చ. హరి యను దేవవీరుఁ డప్పు♦డయ్యసిలోముని దాఁకి బల్లెముం
బరపి తదీయకార్ముకము♦బద్దలుచేసి సువర్ణపుంఖభా
స్వరనతపర్వనిష్ఠురపృ♦షత్కచతం బరఁబోసి యేయ నె
త్తురు వడిఁ జిమ్మువానిమెయి♦తోఁచె సధాతుకమేరువో యనన్.

చ. అప్పు డసిలోముఁ డొండొకశ♦రాసన మూని విషానలంబు గ్ర
క్కుపరుషశాతబాణమునఁ ♦గోపభరంబున బొమ్మ గ్రుచ్చ మూ
ర్ఛపడె విచేష్టుఁడై నురుఁగు ♦గ్రక్కుచు నాహరి, దేవకోటి స
త్రపమయి దుఃఖనాదమును ♦దైత్యులు హర్షరవంబు చేయఁగన్.

గీ. అంత నసిలోముఁ డాహరి ♦ననుసరించి
నట్టిముప్పదియొకవేయి♦యమరభటుల
నేలఁ గూలిచి జయలక్ష్మి ♦నెమ్మిఁ గొలువ
శక్రరథ మున్నదెస కేగె ♦సంభ్రమమున. 248

ఉ. ఆసమయంబువందు ధను♦ర్వాగమకోవిదుఁ డుద్ధతుండు వృ
త్రాసురుఁ డొక్క-చో నమరు♦ లాకులతం బడ శంఖముఖాదిబా
ణాసన మెక్కు-పెట్టి సమ♦రాంగణ మల్లలనాడ నిస్వనం
బేసర నల్లె లాగి పగ♦ యేర్తెఱ నశ్వియుగంబుఁ దాఁకినన్. 249

ఉ. వారును వారినారును జ♦వంబున మార్కొ-ని శస్త్రసాయకా
సారమున న్నిశాటభట♦సంఘము ముంచి తదీయరక్తకా
సారముఁ జేసి రొక్క-నిమి♦షంబున సంగరభూమి హస్తపా
దోరుశిరోభుజానివహ♦మూర్మ్ముల మీఁ లయి తేలి యాడఁగన్. 250

ఉ. దానికి వృత్రుఁ డోర్వ కొక♦ దాఁటునఁ బైఁబడి మొందుఁ జూచినం
దానయి యాశ్వినేయులప♦దాతిదళంబుల నూఁచముట్టుగాఁ
బీనుఁగుపెంట చేసి గజ♦బృందము గూలిచి తేజగుంపు ను
త్తానముఁ జేసి యాశ్వికవి♦తానము వ్రేయుచునుండ నశ్వులున్. 251

చ. సునిశితసాయకాళివఱ♦సోనల వృత్రుని ముంచి వానివిం
టిని దెగఁగొట్టి ఱొమ్మునఁ బ♦టిష్ఠవిషాంబకపంచకంబు గ్రు
చ్చిన నతఁడల్లి సొమ్మసిలి♦చెచ్చెర లేచి గదాద్వయంబు గొ
బ్బునఁ గొని యాశ్వినేయశిర♦ముల్ గుఱిగా సరిచూఁచి కొట్టినన్. 252

క. కఱకుశరంబుల వారును
జెఱియొకగద నఱుక నసుర♦చిఱచిఱ వడిచి
చ్చుఱవాఁడి వాతిములుకులఁ
దఱతఱఁ దద్భటులతలలు♦తఱుగఁగఁ జొచ్చెన్. 253

ఉ. దానికిఁ దాళఁజాలక య♦థాయథలై పరుగెత్తె వేల్పుల
ద్దానవవీరు నశ్వు లతి♦దారుణశస్త్రవిదీర్ణకార్ముకుం
గా నొనరించి రాతఁ డిది♦గా దని వేఱొకవిల్లు పూని దీ
ప్తానలసాయకంబులఁ ద♦దంగముల న్విదళింప నశ్వులున్. 254

వ. శక్తిశూలగదాద్యాయుధంబులు గొని వానిరథంబు బగిలించి సూతు నటికి ఖుదచ్చిత్తి వంచు సునిశితశూలంబుల వానిపొమ్ము నొవ్వ గ్రుచ్చిన వాఁడాపోటులు తృణప్రాయంబులుగా ధీరుండై నిలిచి యొకమహాశూలంబు నొకయశ్వివీఁపునం గ్రుచ్చి వైన తేయుండు బన్నగంబుం బోలి లేవనెత్తి యుప్పరం బెగసి క్రిందికిఁ బడవైచిన నతం డాదెబ్బతోఁ బోరు విడిచి సోదరుంగూడి వాసవుం డున్న దిక్కునకుఁ బరువెత్తె. అంత నచ్చోటనే దేవసత్తముండగు రణాజియు దైత్యవీరుండగునేకచక్రుండును, మృగవ్యాధనాముండగు రుద్రుండును బలదృప్తుండగుమహాసురుండును, ఏకపాదుండగునజుండును శతముఖుండగు రాహువును, త్రిలోకవిశ్రుతుండగు రుద్రుండును దానవశేఖరుండగు కేశియు, మహాసంరంభుండగు నిష్కుంభుండును శౌర్యగర్వుండగు వృషపర్వుండును; బెండొండ సస్సైన్యంబుగాఁ జండభండనంబునకుఁ గడంగి రోమహర్షణంబు లోకభీషణంబు నగు ఘోరరణంబు సలిపినంత నుభయపక్షంబుల ఖండితగండంబులగు వేదండంబులును నికృత్తగ్రీవంబు లగు సైంధవంబులును విచ్ఛిన్నకరపాదంబు లగుపదాతివర్గంబులును రాసులు రాసులై యభ్రంకషం బుగఁ బొలికలనం బ్రవహించు నెత్తురు కేటఁ దేలియాడ వియత్తలంబున నున్న చూపఱకుఁ బ్రలయంబు ప్రత్యక్ష మైనట్లుండె; నట్టి తఱి రణాంగణంబునలుఁగడల హతశేషం బగునిరువాఁగున హాహారవంబులు విషాదనాదంబులు సింహగర్జనంబులు కరతాళంబులు భేరీభాంకారంబులు చెలంగి మిన్నుముట్టె; నంత నుభయసైన్యంబుల జయాపజయంబులు సమంబు లగుట యెఱిఁగి బలీంద్రుం డత్యాగ్రహావ్యగ్రుండై ప్రహ్లాదుని డాయంజని. 255

శా. తాతా! యేమిది? దేవసైన్యము మదాంధంబై రణక్రీడకున్
దైతేయోత్తమశూరరాజి కెనయై తా వచ్చునే? యధ్వర
ప్రీతుల్ యుద్ధము చేయనేర్తురె? యిసీ! బృందారకశ్రేణి నీ
రీతిం బోవఁగనిచ్చినన్ మనము కీర్తింబాయమే యన్నిటన్? 256

ఉ. కాలునిబీరమున్ వరుణు కావరమున్ ధననాథునుద్ధతిన్
శూలిబలంబునుం దన కనూనజయం బొనగూర్చునంచు బిం
కాలను బోవువాసవుని గర్వ మణంగఁగ మున్ను వారలన్
గూలిచినన్ జయంబు మనకుం బ్రమటిలో లభియింపకుండునే? 257

క. నినుబోటి మేటివీరులు
తనుఁగాచుచునుండ నిట్లు దానవసైన్యం
బనిమిషహతకులచే నె
గ్గునఁ బోయినఁ బెద్దపులిని గొఱ్ఱె కఱవదే? 258

మ. అనఁ బ్రహ్లాదుఁడు పిన్ననవ్వు నగి వత్సా! శత్రులైనంతఁ జు
ల్కన చూడందగువారలే సుర? లమోఘంబైన శౌర్యంబునన్
దనుజాధీశులఁ దొల్లి గెల్వరొకో? యైనన్ వీరి నీపారికిన్
మనమే గెల్చెద మంచుఁ దోఁచు ననుమానం బేల నీకియ్యెడన్?

ఉ. అంతకుపీటి కంతకుని నంపఁగఁ జాలుదు నేను, బాశమిత్రు
తింతలుచేసి యావరుణునే పణఁగించును విప్రచిత్తి; య
భ్యంతర మేమి లేకయ ధనాధిపు నోర్చును నాసహోదరుం
డింతకు మున్న కేశి శివునేడ్తెఱ మాన్పఁ బ్రతిజ్ఞ పూనఁడే? 260

క. కావున నీపరివారము
చేవ చెడిన దంచు నీవు చింతింపకుమీ
దేవగణంబుల నోర్చుట
నీ విప్పుడ చూడఁ గలవు నిక్కము పౌత్రా! 261

క. అని వారిం బురికొల్పుచు
ననికాయితపడుచునుండుఁ నాసమయమునన్
దనుజగురుం డగుభార్గవుఁ
డనితరసాధ్యంపువిజయక్షమతనికిఁ గలుగన్. 262

వ. సత్వరంబుగ హుతాశను నారాధించి జపహోమతర్పణంబు లాచరించి తనపదివేలశిష్యులు దానవచక్రవర్తికి జయము కలుగ శాంతిక్రియ లొనరించుచుండ సురభిగంధం బగునాకపూలమాల తెచ్చి ప్రహ్లాదుని శిరంబునకుం జుట్టె; నంతఁ గార్ముకహస్తులు కవచనిషంగధారులు నగుదైత్యవీరు లసంఖ్యాకులు బలికి నమస్కరించి యతని దీవనలు వడసి తనవెంటరాఁ బ్రహ్లాదుఁడు మణికాంచనమయమై బాణాసనాస్త్ర శస్త్రసంతానంబులంగూడి మేరుశిఖరోపమంబై భాసిల్లుదివ్యరథం బధిరోహించి, తనకు మున్న యఱువదివేలరథికుల మోహరించి వారినడుమ నిలచి వీరాతివీరుం డగుకాలనేమి ధనుష్టంకారంబులతో సింహనాదంబు లొనరించుచుండ, భేరీకాహళనిస్వనపూర్వకంబుగాఁ బాలికలని కేతెంచి యుద్ధదుర్మదుండై యెల్లరు విన నట్టహాసంబుగావించె. 263

సీ. గీర్వాణవీరదోర్గర్వతూలాగ్ని నా
చేతులబలిమి నీక్షింతు నిపుడు
పాలిపోవకుండ వేపుర నైనఁ గూల్చునా
కార్ముకశక్తినిఁ గాంతు నిపుడు
కఱకుటమ్ముల కింతఁ గొఱఁత రానీనినా
దానలమహత్త్వంబుఁ గనుదు నిపుడు
రణభూమి రేఁగుపరాగంబు శాత్రవ
శోణితం బణఁగింపఁ జూతు నిపుడు

గీ. ఈయుగంబున నీఁక దానవేశ్వరుండు
కత్తి పట్టంగ నక్కజ మగలుగకుండ
నందనసుఖంబుగాంచి యానంద మొందఁ
జేయఁగా ముందు కాలుని జెల్తు నిపుడు. 264

గీ. అనుచుఁ జేవీవ దైత్యసైన్యంబు లొక్క
పూన్కి నంతకుసేనల ముట్టె నంత
నుభయసేనలఁ బుట్టినయులివు సగిరి
కాననావని విఱిగినకరణి నయ్యె. 265

ఉ. ఆయిరువాఁగువార లపుడద్భుతలీల యెలర్ప నస్త్రశ
స్త్రాయుధశూలముద్గరగదాంకుశనిర్దళితాఖిలాంగులై
గాయములైనకాయములఁ గాఱెడినెత్తుటఁ దోఁగి తేఁకువం
బాయక పోరి రాత్మజయభావన మేను లెఱుంగకయ్యెడన్. 266

ఉ. ఆదనుజాళి బాసటగ నాహవరంగము చొచ్చినట్టిప్ర
హ్లాదుని జూచి యంతకుఁడు వ్యాధిగణంబుల మున్ను పంపి క్ర
వ్యాదులమీఁదఁ, దానును మహారభసంబున దేవసేవ కా
హ్లాదము గాఁగ నాతనిఁ బదాఱుశరంబులఁ గొట్టె నత్తఱిన్. 267

క. వ్యాధిగణంబులు దనుజుల
బాధలఁ బెట్టంగఁ గినిసి ప్రహ్లాదుఁడు నా
వ్యాధుల వాఁడిశరంబుల
వేధించియు దేవసేన భేదించి యొగిన్. 268

క. వైవస్వతు నెదిరించుచుఁ
బ్రావృడ్జలధరములట్లు వారిగువు క్రో
ధావేశంబున శరధా
రావిల మొనరించి యాహవాంగణ మెల్లన్. 269

క. పోరఁగ నాప్రహ్లాదుని
దారుణబాణములవడికిఁ ౯దాళక కాలుం
డారణరంగము విడి చనె
దూరంబుగఁ దనదు సేన౯తో నట్టియెడన్. 270

ఉ. ఆదివిజారి తేరి కెదు౯రై ధనదుం డరుదేరఁ గా నను
హ్లాదుఁడు వాని కడ్డపడి ౯యంతకుఁ డేగినదారి కీవునుం
బోదువు గాక యంచు నరిఁ౯బోసి శితప్రదరంబు వేయ ని
స్సీ! దితిజాధముండు విలు ౯చేకొను నే యని యాకుబేరుఁడున్. 271

చ. దరహసితాననుం డగుచు ౯దానవమారణదారుణంబు నాఁ
బరిఘ మొకండు వైవ నది ౯బాణములం దిగఁద్రోసి వచ్చి యా
సురరిపుకాలిబంట్లగమి ౯శోణితధారల ముంప వా రెసం
గిరి మధుమాసపుష్పితపుఁ౯గింశుకపాదపజాతమో యనన్. 272

వ. అంత ననుహ్లాదుఁడు. 273

చ. కనుఁగవఁ గెంపు లొల్క ధ౯నగర్విత! వడ్డికి నిచ్చి జీవనం
బొనరుచువాఁడ వీవును రణోద్ధతిఁ జూపుదె యంచు నంపవా
వను గురియింప గుహ్యకగణంబు విదీర్ణనిజాంగరక్తవా
హినిఁ బడి మున్గి తేలు టది యెంతయుఁ జోద్యమ యయ్యె నత్తఱిన్.

గీ. కినిసి ధనదుండు బాణాగ్ని౯కీల లొక్క
మొగిని బఱపి నిశాటుల౯మూఁకలందు
నార్తనాదంబు చెలఁగఁ దశ౯దాస్యబాహు
కవచతూణీరములఁ గాల్చెఁ ౯గాల్చినంత. 275

చ. ఇరువురు పోరి రాత్మవిజ౯యేచ్ఛ మెలర్ప నిశాటకోటిని
ర్జరతతు లద్భుతంపడఁగ ౯శస్త్రగదాపరిఘాయుధంబులం
బరమును గప్ప, నప్పు డొక౯పాదపముం బెకలించి వైచె నా
శరవిభుఁ డాధనాధిపతి౯సైంధవముల్ పడ దైత్యు లార్వఁగన్. 276

వ. ఇట్లిరువురు పెద్దయుం బ్రొద్దు పోరి విరథులై నేలకు డిగ్గి యొక్కింత తడవు శిలాసాలజాలంబులను, గొంతసేపు బాహుజానుముష్టిఘాతంబులను, జటపోరు సలిపి వెండియు గదాప్రహారంబులఁ జీర్ణితాంగులై నంత ననుహ్లాదుండు ప్రయోగించినగిరిశృంగంబు కండ్లు వ్యాదితాస్యుం డైనయంతకుఁడునా నరుదెంచుట గని కుబేరుండు దానిం దప్పించుకొనునుపాయంబుతోఁచక భయంపడి పాఱిపోయి దివస్పతి మఱుఁగు చొచ్చె నాసమయంబున. 277

క. వరుణుఁడు రణరంగంబున
కరుదేరఁగ విప్రచిత్తి యడ్డంబై దు
ర్భరసాయకపావకశిఖ
లెరియించిన, నార్చి వాని నెల్ల వరుణుఁడున్. 278

క. ఆశరయోధుల గ్రుంగఁగ
నాశీవిషవీరకోటి నానతి యిడి తాఁ
బాశము చేకొని దనుజవి
నాశన మొనరింపఁ గడఁగ నారకసుఁడున్. 279

గీ. గారుడాస్త్రంబునం బన్నగవ్రజంబు
నంత మొందింపఁ బాశి వ్యాయవ్య మేసె
నాతఁ డాగ్నేయ మేయంగ నబ్ధిపతియు
విసరెఁ బర్జన్య మంత నవ్వీరవరులు. 280

మ. పరమాస్త్రంబులఁ గొంత పోర సమరవ్యాపారదీక్షాధురం
ధరుఁడై శస్త్రగదాకృపాణశరసంతానంబు గుప్పించి క
ర్బురనాథుండు తురంగసూతరథముల్ పో కార్ప, నబ్ధీశ్వరుం
డరిగెన్ వాసవుచెంతకున్ భయము దైన్యం బొప్పఁగా నంతటన్.

చ. అమరపరాజయంబు గని యాత్మ నలందురి హవ్యవాహనుం
డమలసహస్రకాంతు లెరియంగ వెలుంగుచు దివ్యపావకా
స్త్రము విడువంగ దానిఘనతాపశిఖావళి కగ్గమై సహ
స్రము నయుతంబు నర్బుద మసంఖ్యము నై పడె దైత్యసంఘముల్.

వ. అట్టు లనివార్యప్రతాపం బైనయయ్యాగ్నేయాస్త్రంబు బారికిం జిక్కినదానవులలో మృతశేషు లగువారు నలుదెసల మంట లలముటం జేసి యెట్లును దప్పించుకొని పోవ నలవి గాక ప్రాణరక్షణోపాయంబు గానక యిటునటు మతిచెడి పరువు లెత్తుచుఁ జిందులు ద్రొక్కుచు నరడంబులమఱుఁగు చొచ్చుచు సేనుఁగులకాళ్లసందుల దూఱుచు మొఱ్ఱ లిడుచు విలపించుచున్న నతిమహాసంక్షోభపరీతం బైనయారణరంగంబునుండి. 283

చ. ప్రలయమహాశనుండు మనపాలిటిమిత్తిగ వచ్చెఁ గాని యే
బలియుఁడు దానవాళి నిటు భస్మముచేయఁగలాఁడు! చూడ వే
ల్పులమొనఁ గానరాఁడు సెగలుం బొగలుం జెలరేఁగునట్టియీ
జ్వలనపరంపరం బుప్పువాఁడని వెల్వడె నార్తనాదముల్. 284

చ. మయుఁడును శంబరుం డనెడిమాయలమారులు కిన్క నప్పుడ
మ్మయ మగుమాయఁ గొల్పి పెనుమంటన నాఱిచి దైత్యసేనకున్
భయ మెడలంగఁ జేసిన, సుపర్వగురుండు తదగ్నిశాంతి వి
స్మయ మొనరింపఁ దొట్రువడి పావకుఁ గన్గొని పేర్మి నిట్లనెన్. 285

చ. జలమున కీవు కారణము సర్వజగంబున కీవు ప్రాణమై
వెలయుదు వెల్లలోకములు విశ్వలయంబున నిన్నుఁ జొచ్చు నీ
బల మనిలుండు, జన్నములభాగము ముందుగఁ గొందు వీవు; ని
ర్మల మగునీమహత్త్వ మఱిమాయ నణంగుట సైఁపవచ్చునే? 286

చ. అని నిగమార్థయుక్తి గురుఁ డాడినమాట హవిస్సు గాఁగ న
య్యనలుఁడు ప్రజ్వలించి ప్రళయాగ్ని యనన్ దివిజారిమాయతో
దనుజగణంబులన్ మరల దగ్ధముచేయుచునుండఁ జావు ద
ప్పినతొలివేల్పుమూఁక దురపిల్లుచుఁ బోయె బలీంద్రుచెంతకున్.

ఉ. ఆదనుజేశ్వరుం డపజయంబున కించుక కొంకుచుండఁ బ్ర
హ్లాదుఁడు వానిఁ గన్గొని స్వయంభువు నీకు నొసంగలేదె యిం
ద్రాదుల కందరానివర మట్టిది కల్ల విచారమేటికిన్
నీది జయంబు నాపలుకు నిక్క మనంగ నతండు నుద్ధతిన్. 288

చ. హితులు పురోహితుల్ సచివు లెల్ల జయంబును గోర మాగధుల్
నుతులొనరింప సేనలఁ గనుంగొని మీకు భయంబు లేదు పో
రిత మొనరింప రం డనుచుఁ బేర్చి మహాహవదివ్యసాధనాం
చితరథ మెక్కివచ్చి వడిన్ సింహనినాదము చేసి కిన్కమై. 289

ఉ. పౌరుషవిక్రమేంధనుఁ డపారశరోత్కరధూముఁ డుర్వరా
భారవహోరుచండతరబాహుసమీరుఁడు ఘోరవీక్షణాం
గారకణుండునై ప్రళయకాలధనంజయుఁడో యనంగ దు
ర్దారుణమూర్తియై యమరరాజబలంబులు భీతి నొందఁగన్. 290

క. ఒక్కొక్కసాయకంబునఁ
బెక్కుర ప్రాణమ్ములు నూడఁ బెట్టుకుచుఁ గన నే
దిక్కునఁ దానై చూపఱ
కక్కజముగ నర్బుదమ్ము లమ్ములు విడిచెన్. 291

గీ. వానిశరవేగమునకు దేవతలు వెఱచి
యవుడుగఱచుచుఁ దొట్రిల్లి చెదరిపడుచు.
బొబ్బవెట్టుచు నేడ్చుచు మొఱ్ఱ లిడుచుఁ
పఱచి రింద్రునికడకుఁ గాపాడు మనుచు. 292

## బలిచక్రవర్తి విజయము.

సీ. ఇంద్రుఁ డయ్యమరుల నీక్షించి చేయెత్తి
యదలించి భయము లేదనుచుఁ బలికి
వేయికన్నులు వేయి వేఁడివెల్గులు గాఁగ
సంవర్తపావకప్రభలఁ జిలికి
సర్వతోముఖ మైనశతకోటి చేపట్టి
యుద్ధసన్నాహసంసిద్ధ మైన
రథము మాతలి తోల రయ మారఁగా వచ్చి
బలి తేరు గావంగ బాసటైన
గీ. దనుజవీరులఁ జెండాడి దారిచేసె
బలిరథంబును గుఱిచేసి బాణ మేసెఁ
బ్రభువు లిరువురిపోరు ప్రారంభమయ్యె
నుభయసైన్యంబు మరల నుద్యుక్తమయ్యె. 293
సీ. ఇంద్రుడి డింద్రాస్త్రంబు నేయ నద్దానిని
బలిచక్రవర్తి ముక్కలుగఁ జేసె,
అమరరా జాగ్నేయ మస్త్ర మేయఁగ బలి
వారుణంబున దాని జోరణంచె
అసురారి పర్జన్య మడరింప నమరారి
యనిలాస్త్రమున దాని నణఁగఁగొట్టె
వజ్రి వాయవ్యంబు పరగింప సురవైరి
సౌరాస్త్రమున దానిఁ జక్కఁబెట్టె,
గీ. అంతఁ బురుహూతుఁ డమితకోపావిలాత్ము
డగుచు బలి నొక్కదెబ్బకు నణఁతు ననుచు
శైలశృంగాభ మైనవజ్రంబు నెత్తె
నంత నశరీరవాణి యిట్లనుచు వెడలె. 294

ఉ. వాసవ! వద్దువద్దుసురవైరిని గెల్వఁగలేవు నీవు ప
ద్మాసనుఁ డిచ్చినట్టివర మట్టిదియీయతనంబునన్ వృథా
యాసముగాని లాభ మిసుమంతయుఁ గల్గదు సర్వవేదవి
ద్యాసదనుం డశేషజగదంతరవర్తి జయించు నీబలిన్. 295

గీ. అని వినఁగ వచ్చుపల్కుల నాలకించి
కినుక నెద డించి వజ్రంబు క్రింద దించి
యమరసైన్యంబు లెల్ల దన్ననుసరించి
నడువ నింద్రుండు రణభూమి విడిచె నంత. 296

చ. దనుజులు వేడ్కతోడ కరతాళరవంబులు హర్షహాసని
స్వనములు మంత్రగానములు వాద్యరవంబులు మిన్నుముట్ట నీ
ఘనతకు నడ్డులేదిఁక జగత్త్రయరాజ్యరమాధురంధరా!
యనుచును దైత్యనాథునికి నప్పుడు పట్టము గట్టి రత్తఱిన్. 297

గీ. జయము జయ మంచు జయలక్ష్మి సన్నుతించి
దానవేంద్రుని వరియించె దానిఁజూచి
శాంతి కీర్తి ప్రభాదు లచ్చరలు నతనిఁ
గూర్మితో నాశ్రయించిరి కురువరేణ్య! 298

క. అని వైశంపాయనముని
వినిచిన జనమేజయుండు విస్మితుఁ డగుచున్.
దనుజేశ్వరు నేగతి లో
కనివాసుఁడు గెల్చెఁ జెల్పు కరుణ ననుటయున్. 299

ఇది

శ్రీ వేంకటగిరి సంస్థానాధీశ్వర జి. సి. ఐ. ఇ. మహారాజేత్యాది
బిరుదాంకిత సంస్కృతాంధ్ర సాహిత్య నిష్ణాత శ్రీరాజ
గోపాలకృష్ణయాచేంద్ర మహీంద్రాస్థాన కవియు,
తత్సమాదరణప్రణీత సంస్కృత కవిజీవితాంధ్ర
దశరూపకాది కృతియునైన మల్లాది సూర్య
నారాయణశాస్త్రి నిర్మించిన యాంధ్ర
భవిష్య పర్వమునందు
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

---

# ఆంధ్ర భవిష్య పర్వము

## తృతీయాశ్వాసము.

శ్లో॥ అఖండమవ్యయంపూర్ణ మనాదినిధనంమహః
జ్ఞాతృజ్ఞేయజ్ఞానరూప మద్వితీయ ము పాస్మహే.

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయునకిట్లని చెప్పందొడంగె. 1

ఇంద్రాదులు కశ్యపునివెంట బ్రహ్మపాలికిఁజనుట.

చ. బలరిపుఁడట్లు సంగరముఁ ♦బాసి సుపర్వులఁగూడి తిన్నగాఁ
దొలిదెసదారి పట్టి వడి♦తోఁజని నాకముఁజేరి యంతయున్
దెలియఁగఁ జెప్పెఁ దల్లి నది♦తిం గని,యామెయు దివ్యవాణిప
ల్కులు పొలివోవునే? సురల♦కున్ బలిఁ గెల్వఁగ రాదు దీనికిన్. 2

ఉ. స్రుక్కఁగనేల? దివ్యవర♦శోభితుఁడైన బలీంద్రు గెల్వఁగా
నొక్కసహస్రశీర్షున కె♦యొప్పుఁ జరాచరసాక్షి యాతఁడే
దిక్కన నెట్లు వానిఁ గడ♦తేర్చునొ? మీజనకుండు కశ్యపుం
డక్కటికంబునం దెలుప ♦నర్హుఁడు కొల్వుఁడు మీర లాతనిన్. 3

క. అని పల్కునదితి మున్నిడు
కొని వాసవుఁ డఖిలదేవ♦గుహ్యకయక్షుల్
తనవెంబడి రాఁ గశ్యప
మునియాశ్రమమునకు నేగి ♦ముద మలరారన్. 4

సీ. సురదీర్ఘికాస్నాన♦శుచిభూత దేహుండు
భస్మరేఖాంచిత♦ఫాలతలుఁడు
నికటవిన్యస్తదం♦డకమండలుండు ని
ర్మలమంజువల్కలాం♦బరధరుండు

కృష్ణాజినపరీధా♦రితకుశాస్తరణుండు
పద్మాసనాష్టాంగ♦పరవశుండు
బాలసూర్యశతప్ర♦భాభాసమానుండు
బ్రహ్మతేజోమూర్తి♦భాస్వరుండు
గీ. బ్రహ్మనిష్ఠాగరిష్ఠతా♦పసఘనుండు
దేవహితుఁ డాదితేయదై♦తేయగురుఁడు
నైనకశ్యపపరమేష్ఠి♦ సరసి భక్తి
నంజలి ఘటించి మ్రొక్కి యి♦ట్లనుచుఁ బలికె. 5

ఉ. ఓబుధలోకసన్నుతమ♦హోదయ! లోకవిధాత! నీదుగా
రాబపుబిడ్డ లెల్లరు దు♦రాత్ముఁడు దైత్యున కోడి ఘోరచిం
తాబడబానలంబునకుఁ♦దాళఁగఁ జాలక వచ్చి రిట్లు తం
డ్రీ! బలిచక్రవర్తిని జ♦యించు పరాత్పరుఁ జూపవే కృపన్. 6

చ. అన విని కశ్యపుండు తన♦యా! వినియుంటివి దివ్యవాణిప
ల్కను, మును బ్రహ్మఁగూర్చి బలి♦ ఘోరతపం బొనరించి యిట్టిగ
ల్పును గనె వాని గెల్వఁ దగు♦పోటరి నెవ్వని బ్రహ్మ తెల్పునో
వినెదము గాక రం డిపుడె ♦వేగమె పోదము బ్రహ్మపాలికిన్. 7

ఆ. అనుచు లేచి యదితి ♦నాదితేయులఁగూడి
కామయానములను♦ గడియలోనఁ
బోయి బ్రహ్మలోక♦మును జేరి ముందఱఁ
జూపె బ్రహ్మసభను♦ సుతుల కపుడు. 8

సీ. నాల్గువేదములు వి♦న్నాణంబుగా స్వర
యుక్తిఁబఠించువా ♦రొక్కచోట
నఖిలశాస్త్రంబుల ♦నన్వయవ్యతిరేక
యుక్తిఁ జర్చించువా♦ రొక్కచోట

నర్చనోపాసనా♦ప్రార్థనాదులకు ది
క్కొక్కటే యనెడివా♦రొక్కచోటఁ
ముక్తిభేదంబుల♦ముఖ్యతాత్పర్యంబు
లుగ్గడించెడివార♦ లొక్కచోటఁ

గీ. దనదుపీఠంబునలువలం♦కున వసింప
నత్రిదక్షాదు లిరువంక♦ నధివసింప
గరిమఁ జేరోలగంబున్న♦కమలభవుని
గొలువుకూటంబు గని వారు ♦కుతుకమలర. 9

చ. అవుర! సుధర్మకే గరువ ♦మందుచు నుందును గాదె? యీసభా
భవనముకాలిగోటి కెన♦వచ్చునె యీసభ? యంచు వేడ్కఁ గ
న్గవ విరియంగ నల్గడలు ♦గాంచుచు నద్భుతశిల్పచాతురిం
దవిలినచిత్తవృత్తిమెయిఁ ♦దండ్రిపిఱుందన పోవుచుండఁగన్. 10

సీ. ఆబాలగోపాల ♦మమరలోకం బిందు
వచ్చెనేమో యని ♦వగచువారు
కశ్యపబ్రహ్మను ♦గాంచి తత్తఱపడి
లేచి దోసిలి యొగ్గి ♦ చూచువారు
చిఱునవ్వుతో శచీ♦పతిముఖంబును జూచి
చే యూఁచి కూర్మి ♦సూచించువారు
నేఁడు పుణ్యదినంబు♦నిఖిలనిర్జరమాత
యదితిదర్శన మయ్యె ♦ ననెడువారు

గీ. గాఁగ నతిహర్షవిస్మయా♦క్రాంత మైన
యీసభాభ్యంతరంబున ♦నల్ల నడచి
కశ్యపుఁడు తాను ముందుగాఁ ♦గాంతఁ గూడి
పద్మభవుపాదపీఠంబు♦ప్రక్కఁ జేరి. 11

గీ. వినయవినమితగాత్రుఁడై ఽవిశ్వపతికి
యంజలి ఘటించి యభివాదఽనార్థమంత్ర
పూర్వకంబుగఁ జాఁగిలిఽ మ్రొక్కి నిలిచె
నంత నింద్రాదిగీర్వాణు ఽలధికభక్తి. 12

బ్రహ్మస్తవము

ఉ. కారణకారణా! భువనఽకారణ! తావకభక్తలోకసం
తారణ! వేదకారణ! నిఽతాంతసదాత్మకధారణా! నమ
స్కారము లంచు భక్తిభయఽసంభ్రమయుక్తిఁ దదీయపాదపం
కేరుహపీఠిపైఁ దలలు ఽకేలును మోపుచు మ్రొక్కి నిల్చినన్. 13

చ. దరహసితాననుం డయి పిఽతామహుఁ డప్పుడు కశ్యపామరే
శ్వరులను జూచి మీ రిపుడు ఽవచ్చినకార్య మెఱుంగనయ్యె, ని
ర్జరులక కాదు మాకును నఽజయ్యుఁడు దానవచక్రవర్తి, కా
వరుఁ డగువాఁడు దుష్కరతఽపంబునఁ గోరిఽకోర్కి పండుటన్. 14

ఉ. ఆపరమేశ్వరుం డొకఁడె ఽయాదనుజేశ్వరుబాహుగర్వసం
తాపము నార్చువాఁ డనుట ఽతథ్యము, వాని నెదిర్చి గెల్వఁగా
నోపెడివాఁడు వేఱొకరుఁ ఽడుండఁడు నిక్క మింఁకేమి చెప్పుదున్?
బాపమువంతు వచ్చె భువఽనంబుల నేలఁగ నోర్చియుండుఁడీ! 15

చ. అనవుడు నింద్రుఁ డుల్కిపడిఽ యక్కట! నాజననంబ దెట్టిదో!
దనుజులదాడి కొక్కపుడు ఽదక్కి సుఖించినవాఁడనొక్కొ! నా
మనమున నిండియున్న యవఽమానము చెప్పినఁ దీఱునొక్కొ! యీ
దినదినగండమై తనరుఽ దేవవిభుత్వము చాలు దేవరా! 16

చ. అనినఁ బితామహుండు దిగుఽలంచినలాభము లేదు ధైర్యముం
గను మని చెప్పి కశ్యపునిఽ గాంచి కుమార! యచింత్యఘోసనా
తనునిమహత్త్వ మేరికి, నఽఘాత్మను హెచ్చినయప్పు డాతఁడే
తనువునఁ బుట్టి యేకరణిఽ ధర్మము నిల్పునొ చెప్ప నేర్తుమే. 17

గీ. వినఁ బరమేశ్వరానుగ్రహంబుకలిమి
దీని కొక్కయుపాయంబు గానవచ్చె
దానిఁ దెల్పెద మీర లాదారి నడచి
కనుఁడు ఫల మంచుఁ గూర్మి నిక్కరణిఁ బలికె. 18

సీ. క్షీరాబ్ధియుత్తర తీరంబునం దున్న
యమృతనామక మైనయాశ్రమంబు
యోగీంద్రసేవ్యమై యొప్పు నందుల కేగి
పరమాత్ముఁ, గూర్చి తపంబుచేయ
నుఱుమునా గంభీర ముచ్చైస్స్వనంబు వి
స్పష్టాక్షరము నైనసత్యవాణి
యెవ రేమి కోరెద రే నిత్తు ద నటంచు
వీనులవిందుగా వినఁగవచ్చు

గీ. దాని విని నీవు నదితియుఁ దత్పరమతి
"నీవు మాగర్భమునఁ బుట్టు మనేమి"ననుచు
వేఁడుకొనుఁ డప్పుడే మీకు వినఁగవచ్చు
నట్టు లగుఁగాక యనునట్టియమృతవాణి. 19

గీ. అవరంబునఁ గృతకృత్యు లయ్యెద రని
వత్సలతఁ బల్కఁ గశ్యపబ్రహ్మ దార
పుత్త్రిలం గూడి విధిపాదములకు మ్రొక్కి
యప్పుడే పాలకడలికి నరుగఁ దలఁచి. 20

ఉ. అంచలమీఁదఁగో ల్వడసి యంచలదీవనలున్ గ్రహించి త
మ్మెంచలు కొంతద వ్వనుప నాసభ వెల్వడి వచ్చి కోరినం
తం దమచెంతఁ జేరినసనాతనయానము నెక్కి సచ్చిదా
నందమయా!పరాత్పర!సనాతన! జే యన నవ్విమానమున్. 21

కశ్యపాదుల తపస్సు - శ్రీమన్నారాయణస్తవము.

చ. కదలి నదీదానంబునిధి కాననపర్వతపంక్తు లద్భుతం
బొదవఁగ దాఁటి యుద్ధవడి నుత్తరదిక్కునఁ బోయి కేశవా
స్పద మగుదుగ్ధసాగరము పారముఁజేరి తదంతికంబునం
బదిలముగాఁగఁ గొంత దిగి భానుఁడు చూడనియట్టి తావునన్.

గీ. చొచ్చి పెంజీఁకటులు క్రమ్మి శూన్య మైన
యతివిశాలంబు నైనయయ్యమృతపదము
నందు నిలిచిన, వారందఱు అవతరించి
తపము చేయంగఁబూని రత్యంతనిష్ఠ. 23

గీ. పెక్కువే లేండ్లు తపముగావించి యట్లు
కాంక్షితార్థాభిసిద్ధికై కశ్యపుండు
పలికె నిట్టులు వేదాంతభవ్యఫణితి
నిస్తులం బగునారాయణ స్తవంబు. 24

వ. "నమోఽస్తు దేవదేవేశ! ఏకశృంగవరాహ వృషాసింధో వృషాకపే విష్వక్సేన త్రేతావర్త భద్రకపిల ధర్మరాజ వైకుంఠ అనాదిమధ్యనిధన సనాతన త్రికామ త్రిధామ త్రిగుణధామ పరంధామ మహానాభ లోకనాభ పద్మనాభ ధర్మనాభ గభస్తినాభ ధర్మరూప విరూప విశ్వరూప సత్యరూప సర్వలోకప్రతిష్ఠ శిపివిష్ట సుతపస్తపోఽగ్రజ ఖండపరశో హృషీకేశ సూక్ష్మ పరసూక్ష్మ విశ్వమూర్తే సహస్రశీర్ష సహస్రపాద సహస్రనేత్ర సహస్రబాహో బ్రహ్మేశయ బ్రహ్మమయ బ్రహ్మదేహ ద్యావాపృథివీపూర్వరూప భూతమయ భూతాధార యజ్ఞాంగ యజ్ఞస్వరూప! యజ్ఞఫల హిరణ్మయ విశ్వతోముఖ విశ్వసంభవ త్రిభువనవిక్రమ ప్రభాకర శంభో స్వయంభు విశ్వంభర సురాసుర గురో హిరణ్యాగ్రకేశ పద్మేశయ విశ్వపాలక

సర్వజ్ఞ వరార్థినో న స్త్రాయస్వ త్రాయస్వ నమ స్తే నమః" అనుచు శ్రద్ధాభ క్తిపూర్వకంబుగ నామపారాయణంబు గావించినంత నింద్రాదిబృందారకబృందం బాకశ్యపునితోఁ గలసి యుచ్చైస్స్వనంబున నిట్లని స్తుతియించె. 25

శా॥ శ్రీకల్యాణగుణాభిరామ మని కీర్తిం గాంచుచిత్త్వంబునన్
లోకం బెల్లను నీవయై తనరి నీలో నీవయుప్పొంగు నా
నాకారాత్మక చిత్రదివ్యమహిమవ్యాపారపారీణ! నీ
యేకత్వంబు తలంప మాకుఁ దరమా నీ సర్వలోకేశ్వరా! 26

మ॥ ఒకయాకాశమె పెక్కుకుంభములయం దొక్కొక్కటై తోఁచున
ట్లొకయాదిత్యుఁడె యూర్మిమాలికలఁదా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నీ వొక్కఁడవే చరాచరము లోలిం జొచ్చి నానావిధా
త్మకభావంబునఁ గానవచ్చెదు మహాత్మా సర్వలోకేశ్వరా! 27

మ॥ సగుణం బంచును నిర్గుణం బనుచు నీతత్త్వంబుఁ జర్చించునా
నిగమాంతంబులగూఢభావమును వాణీనాథుఁడే విప్పి చె
ప్పఁగఁ జాలం డన మాకు శక్యమె మహావాక్యార్థగాంభీర్య! మో
జగతీనాటకసూత్రధార! సకలజ్ఞా! సర్వలోకేశ్వరా! * 28

శా॥ వేదోక్తం బగునెల్లధర్మములకుం బవిత్రీ ప్రాప్తించె మా
భూదేవోత్తమయాగభాగములకుం బూర్వామరుల్ సిద్ధమె
రో దేవా పరమేశ్వరా! దివికి దైత్యుల్ నాథులై యుండ మే
మీదీనత్వము నెంత కోర్చెదము తండ్రీ! సర్వలోకేశ్వరా! 29

---

* ఇంతవరకును గలగ్రంథము 1919 సంవత్సరము పరభాగమందును, దీని తరువాత గ్రంథ మంతయు 1939 సంవత్సరము కడపటి భాగమందును రచియింపఁబడినది.

శా. లోకంబెల్ల నధర్మతప్తమగు టాలోకించి దుఃఖించి మా
స్వాకంబున్ బలియిచ్చి యాబలికి మాసనం బెల్ల పోకార్చె యా
పీకాశంబున విశ్వపాలనవిధిన్ వేంచేయునీరక్షకై
నీకాళ్లం బడవచ్చినాము కరుణన్ వీక్షింపు సర్వేశ్వరా! 30

క. అని బహుభంగుల వారలు
వినుతు లొనర్పంగ నాది♦విష్ణువు గగనం
బుననుండి యదృశ్యుండై
స్తనితోక్తుల నిట్లనెం బ్ర♦సన్నుం డగుచున్. 31

గీ. విమలవిజ్ఞానకశ్యపా!♦విబుధులార!
మీతపోయోగనిష్ఠకు ♦మీస్తుతులకు
సంతసించితి,మీశ్రమ ♦సార్థకముగఁ
గోరుకొనుఁడు వరంబు మీ♦కోర్కె తీర్తు. 32

సీ. ఆమాట వీనుల♦కమృతోపమానమై
తనరంగ సమరుల♦తల్లిదండ్రు
లదితికశ్యపులు బ్ర♦హ్మానందపడి నమ
స్కారం బొనర్చి యం♦జలిఘటించి
యవ్యయానందద♦యామయా!సురలక
ష్టంబు గ ట్టెక్కింప ♦జగముఁ బ్రోవ
సమశేంద్రుతమ్ముఁడ♦ వగుచు మాగర్భంబు
నం బుట్టు మంచు వ♦రంబు వేఁడి

గీ. రంత నిర్జరు లైకకం♦ఠ్యంబు గాఁగ
నిఖిలలోకేశ!మాజన♦నీజనకుల
కోర్కె నెఱవేర్చి మామది♦కుంది వాపు
మనుచుఁ బ్రార్థించి మఱియు ని♦ట్లనిరి భక్తి. 33

గీ. అదితిగర్భంబునందు నీ ♦ వవతరించి
తేని విలసిల్లు మాయాది♦ తేయసంజ్ఞ
దివ్య తేజంబు తోడయి ♦ తేజరిలుట
మాదు దేవపదంబు స♦మ్మాన్య మగును. 34

చ. అనఁగ ననాదిమధ్యలయుఁ♦ డాభగవానుఁడు వారిచిత్తముల్
తనియఁగ మీదుకోర్కి సఫ♦లం బగు మీ కగు భద్ర మిండ్లకుం
జనుఁడొనరించి శత్రుకుల♦నాశము మీ దగుయాగభాగభా
జనతయు మీమహత్త్వమును♦ జక్కఁగ నిల్పెద నంచుఁ బల్కెనన్.

చ. అమరులు సిద్ధసాధ్యమరు♦దాదులు ధన్యుల మంచు హర్షనా
దము లెసఁగంగ వందనశ♦తంబు లొనర్చుచు నప్పుడే బలి
ప్రముఖు లడంగినట్లు సుర♦రాజ్యము చేకుఱినట్లు పొంగుచున్
దమమునుపడ్డపాట్లు పరి♦తాపము తీఱె నటంచుఁ గుల్కుచున్. 36

గీ. ఆత్మసంకల్పసిద్ధికి ♦నలరుదితి
కశ్యపర్షుల వెంబడి ♦గగనగతిని
తూర్పుగా వచ్చి మునిగణ♦స్తుత్య మైన
కశ్యపాశ్రమమునకు ను♦త్కంఠఁ జనిరి. 37

వ. అట్లు వా రందఱు బ్రహ్మర్షిగణసేవితం బైనయాతపోవనంబునం దాపుణ్యదంపతుల నారాధించుచు బ్రహ్మపారాయణపరాయణు లై నారాయణావతారమున కెదురుచూచుచున్నంత. 38

## వామనావతారము

చ. త్రిదశులతల్లి భవ్యగుణ♦దివ్యసుమాంచితకల్పవల్లి య
య్యదితిసతీమతల్లి యుద♦యాస్తమయంబులు లేక వెల్గుచున్
గదలక కానరాక భువ♦నంబుల నిండినయాదితేజమున్
ముదమునఁ దాల్చి గర్భమున ♦ మోసెను దివ్యసహస్రవర్షముల్. 39

వ. అంత. 40

చ. కలఁడని విశ్వసింపఁ దగు♦కార్యముచూపినసన్మయుండు నీ
కలిగిన దెల్ల కల్ల యని ♦గట్టిగఁ దెల్పిన యైంద్రజాలికుం
డిల మును నాల్గుమాఱు లుద♦యించినచిన్మయుఁ డాదితేయవీ
రులు ముదమంద దైత్యు లసు♦రుల్ భయ మందఁగఁ బుట్టె బొట్టియై.

ఉ. అప్పుడు కశ్యపాదికమ♦హర్షులు దక్షముఖప్రజాపతుల్
ముప్పులు దప్పినార మని♦మ్రొక్కుచు నుండఁగ నేమిచెప్ప!మా
తిప్పలు తప్పె నంచు నహి♦దేవనరాదులు భక్తిభావముల్
చిప్పిల శ్రీహరిం దలఁచి♦ చిందులు త్రొక్కిరి ముజ్జగంబులన్. 42

గీ. అంత లోకేశుఁ డచ్చటి ♦కరుగుదెంచి
యదితిసుతునకు సాష్టాంగ ♦మాచరించి
యీకుమారుండు ప్రభవిష్ణు ♦వీశ్వరుండు
విష్ణు వని పల్కి చయ్యన ♦వెడలె నపుడు. 43

సీ. కాలాంబుదశ్యామ♦కమనీయవిగ్రహా!
వామనాకార! శ్రీవత్సవక్ష!
ఉత్ఫుల్లరక్తాంబు♦జోల్లసల్లోచనా!
ధీరప్రసన్నగం♦భీరవీక్ష!
శతకోటిసూర్యతే♦జఃపుంజభాస్వరా!
సాక్షాత్కృతాఖిల♦సాధురక్ష!
ధర్మసంస్థాపనా♦ర్థప్రాప్తసంభవా!
స్పష్టీకృతాఖిల♦దుష్టశిక్ష!

గీ. యోగ మష్టగుణైశ్వర్య ♦మాగమములు
నిగమములు నీవ యజ్ఞప్ర♦ణేత నీవ
క్రతుఫలంబును నీవ యా♦గంబు నీవ
సర్వమును నీవ యీశ్వరా! ♦శరణు శరణు. 44

గీ. అనుచు బ్రహ్మర్షి దేవర్షు ♦లమరవరులు
బహువిధంబులఁ బొగడ నా♦పరమపురుషుఁ
డెఱిఁగి యుండియు నెఱుఁగని♦ తెఱఁగు దోఁప
ముద్దుపల్కుల నిట్లని ♦మూదలించె. 45

క. ఎందుకు వచ్చితి రిందుల
కుం దెల్పుఁడు వేల్పులార! కోరిక పారం
బొందఁగఁ జేతును నావుడు
నందఱు నంజలి ఘటించి ♦యని రేకముగన్. 46

చ. బలి యనుదైత్యనాయకుని♦బారికిఁ దాళఁగ లేక లోకముల్
నలఁగిన నెల్లధర్మములు ♦నాశనమైనవి, యేమి చెప్ప? మా
ఖలుఁడు విరించి దత్తవర♦గర్వమదాంధుఁడు పెట్టినట్టితి
ప్పలు తలపోసినంత మది♦ భగ్గున మండుచునుండె నీశ్వరా! 47

గీ. హరిహరీ! యాతఁడాడిన ♦ మాట గాఁగఁ
బాడినది పాట గాఁగ ని♦ప్పటికిఁ జెల్లు
ముజ్జగంబుల వానికి ♦ నుజ్జి లేఁడు
నీవుదక్కంగ, మాకింక ♦నీవ దిక్కు 48

క. మునిదేవపితౄణము దీ
ర్చనుపాయము లేక భూమి♦సురులేడ్వఁగఁ ద
ర్పణహవ్యకవ్యములు చెం
దనుపాయము లేక మేము ♦దుఃఖింతు మిటన్. 49

గీ. నాకవాసంబు తొలఁగిన♦మాకు నింక
నాకలోకంబుగతి చెప్ప ♦నాల్కరాదు,
దేవరా! నీకుఁ దెలియని♦ దేమి కలదు!
మనసు నిల్వక చేసిన♦మనవి గాక. 50

చ. శరణు పరాత్పరా! శరణు ♦ సర్వజగన్నిలయా దయామయా!
శరణు, భవత్పదాబ్జముల ♦ సన్నిధి పెన్నిధిగాఁ దలంచి నీ
కరుణకుఁ దోసి లొగ్గితిమి ♦ కావుమి దే సమయంబు మాకు నె
ల్లరకును దొంటిధర్మవిధు ♦ లన్ విలసిల్లెడుత్రోవ చూపవే? 51

చ. కడపటిజైత్రయాత్రగ జ ♦ గం బఖిలంబును జుట్టివచ్చి యి
ప్పుడు హయమేధయాగమును ♦ బూనికతో నొనరించుచుండె, నే
వడుపున నాబలిం గదియ ♦ వచ్చునొ యేగతిఁ ద్రొక్కవచ్చునో
యెడఁదఁ దలంచి లోకముల ♦ కెల్లశుభం బొడఁగూర్పు మీశ్వరా!

చ. అనవుడు వామనుండు దర ♦ హాసముతో ననె నిట్లు, లంగిర
స్తనయుఁడు వేదవేత్త ముని ♦ సత్తముఁ డైనగురుండు నన్ను దై
త్యునిహయమేధవాటికిని ♦ దోడ్కొనిపోయినఁ జాలు నంత నే
నను వగురీతితో మెలఁగి ♦ యచ్చట నన్నియుఁ జక్కఁబెట్టెదన్.

గీ. ఆసుధామయవాక్కుల ♦ నాలకించి
సురల సోత్సాహముగఁ బురం ♦ దరుని గాంచి
రాతఁ డానందమునఁ గాంచె ♦ నమరగురువు
నతఁడు ధన్యుండ దేవరా! ♦ యనియె నంత 54

### వామనమూర్తి బలియాగశాల కేగుట.

సీ. బ్రహ్మచర్యం బుట్టిపడునట్లు కౌపీన
మజినోపవీతమౌం ♦ జ్యాదు లలర,
వేదవేదాంతవి ♦ వేకంబు కనుపట్టు
నట్టులు మేధావి ♦ బొట్టు తనర,
జ్ఞాననేత్రము వికా ♦ సము నొందినట్టులు
బ్రహ్మతేజంబు వ ♦ క్త్రమున వెలయ,
ధర్మసంస్థాపనార్థము పుట్టినట్టులు
దండంబు నాతప ♦ త్రంబు మెఱయ,

గీ. పొత్తులం దున్నయాచిన్ని♦పొట్టిపాప
క్రొత్తవడు గైనబాలుని♦కొమరుమిగుల
నఖిలమునులును దేవత♦లరయుచుండ
నాబృహస్పతియెదుటఁ♦ బ్రత్యక్షమయ్యె. 55

క. గురుఁ డామాయావటుకుని
కరముంగొనె, నంత వారు♦ గగనగతి నిశా
చరయజ్ఞవాటిదరి జే
రిరి, కరమును వదలి గురుఁ డ♦దృశ్యుం డగుచున్. 56

గీ. వెనుక నేతెంచు నింద్రాది♦విబుధవరులఁ
గలసి యాకాశమందుండి♦కాంచుచుండె
వామనుఁడు క్రిందికిం దిగి♦వచ్చియల్ల
నల్లనన్ యాగశాలలో♦నడుగుపెట్టె. 57

సీ. దైతేయవీరు లం♦దఱు మెచ్చి తల లూఁప
బలిచక్రవర్తివై♦భవము పొగడి
పండితు లెల్ల సె♦బాసని యాలింప
హయమేధయాగంబు ♦నభినుతించి
మును లెల్ల తత్త్వంబు ♦గని కన్ను తెఱవంగ
హోమమంత్రార్థంబు ♦లుగ్గడించి
సభ్యులచిత్తకం♦జాతముల్ వికసింప
బహుయజ్ఞఫలము ♦లుపన్యసించి

గీ. ఇతఁడు హరిహరధాతలం♦దేవుఁడో యనుచు
వింతగా నెల్లరుం జూడ♦వేదశాస్త్ర
మూర్తియో యన వామన♦మూర్తి ముందు
క్రమముగాఁ జని దానవ♦ప్రభుని గాంచి. 58

ఉ. దానవవంశవర్ధన!వదాన్యయశోధన!లోకపాలసం
మానితలోకపాలన!విమర్దితవీరవితాన!ధీరతా
స్థాన!బలీంద్ర!నీవు కడుఁ ధన్యుఁడ వీహయమేధమందు నీ
పూనిక చూడ నెంతయు నపూర్వము దీన శుభంబు నీ కగున్. 59

గీ. అనుచు దీవించి,యానందమాదరంబు
కదుర బలి లేచి తనవంకఁ గాంచుచుండ
హరియు బ్రహ్మాదిఋత్విగంతరముఁ జొచ్చి
మంత్రతంత్రపరిజ్ఞానమహిమ తెలుప. 60

సీ. ఒకచోట వేదపాఠకులు కవళ్లలోఁ
దడఁబడ ముందుపదంబు తెల్పి,
ఒకచోట యజ్ఞాంగ మొకదాని కొక్కటి
గోచరింపఁగ దానిగుర్తు చెప్పి,
ఒకచోట యాగోపయుక్తవస్తువులలో
గట్టితప్పులు వేలు పెట్టి చూపి,
ఒకచోట మంత్రంబు లుచ్చరించుటలోని
స్వరదోషములు చెప్పి సంతరించి,

గీ. తనదుమాటకు నడ్డంబు దగిలినట్టి
దైత్యగురుఁ డగుశుక్రుని దక్కినట్టి
ధర్మనజ్ఞుల యుక్తిశాస్త్రప్రమాణ
సరణి నిశ్శంకముగ నిరుత్తరులఁ జేసె. 61

క. అంత బలీంద్రుం డద్భుత
సంతోషము లెసఁగ మ్రొక్కి సాత్వికవృత్తిన్
జెంతఁ గలపైఁడిపీటఁ ద
నంతన వామనుని నిలిపి యభిముఖుఁ డగుచున్. 62

ఉ. ఎక్కడివాఁడ? వెక్కడికి నేగెద? వెవ్వరివాఁడ? వేలనీ
విక్కడి కేగుదెంచితి? మునీంద్రకుమార! భవాదృశుండు నా
కెక్కడఁ గానరాఁడు గన నీడునఁ జిన్నవు తెల్విఁ బెద్ద వీ
వక్కజ మయ్యెఁ జిన్నవడుగా! తెలుపందగు నీదువృత్తమున్. 65

చ. అన విని వామనుండు దరహాసముతో నసురేంద్రపాకశా
సనవరుణాంబుజాసనులు సల్పినకైవడి నశ్వమేధ మీ
వొనరుచువార్త వించుఁ గన నుత్సుకతం జనుదెంచినాఁడ నా
కనుఁగవ ధన్య మయ్యె నధికం బగుపుణ్యము నీకుఁ గల్గెడున్. 64

గీ. వర్ణములయందు బ్రాహ్మణవర్ణ మాఢ్య
మాశ్రమములందు గార్హస్థ్య మర్హతమము
క్రతువులం దశ్వమేధయాగంబు ఘనము
దానవులయందు సత్యవర్తనుఁడ వీవు. 65

వ. సువర్ణశృంగుండు లోహాక్షురుండు వాయుజవుండు స్వర్గేక్షణుండు కాంచనగర్భగౌరుండు విశ్వయోనియు నగుపరమపురుషుని కభీష్టం బగునశ్వమేధము సర్వకామప్రదంబై సకలపాపనాశకంబై స్వర్గాది సకలసౌఖ్యంబు లొసంగు నని శ్రుతి చెప్పుచున్నది. అచింత్యవైభవంబున దాని నాచరించునీ కందరానిఫలంబు గలదె? దైత్యనాయకా! నీజన్మము తరించినది. అని పలుక బలీంద్రుఁ డానందపరవశుండు భక్తియుక్తుండునై యంజలి చేసి. 66

చ. అనఘ! మహానుభావ! సకలాగమకోవిద! విప్రబాల! నా
జననము ధన్య మయ్యెను నిజంబుగఁ దావకదర్శనంబునన్
ననుఁ గరుణించి తెల్పుము వినం దగునీచరితంబు, నీవు కో
రినవర మిచ్చెదం గొని తరింపఁగఁజేయుము నన్నుఁ గూరిమిన్. 67

వ. అనిన విని వామనుం డిట్లనియె. 68

క. తల్లియుఁ దండ్రియుఁ గూఁతురు
నల్లుండును గొడుకు కోడ లన్నయుఁ దమ్ముం
డిల్లును వాకిలి యనునది
యెల్లయుఁ దెల్లంబు కల్ల యయే మనువాఁడన్? 69

ఉ. కోరిక లేదు రాజ్యమున, గుఱ్ఱము లేన్గులు పల్లకీలు సం
బారము వెండి బగరువు భామినుల లక్కఱలేదు నాకు నీఁ
గోరుదువేని ధర్మమునఁ గూరిమి యేని త్రిపాదమాత్రమా
ధారుణి నగ్ని దాఁచుకొన దానముచేయుము దానవోత్తమా!

వ. అనవుడు మాయానటువున కసురపాలకుం డిట్లనియె. 71

చ. వడుగవు చిన్నపిల్లఁడవు వాంఛ లెఱుంగవు పెద్దవారినే
నడుగవు తోడివారిసుఖమైనను జూడవు గాక, నన్నుమూఁ
డడుగులనేల కోరుదె? యిదా భవదీయవరంబు? లక్షకో
టడుగులమేరకోరుకొనుమా మునిబాలక! నీకొసంగెదన్. 72

వ. అన విని శుక్రాచార్యుండు. 73

ఉ. ఈవల దీవరంబు దనుజేశ్వర! యీవర మివ్వవద్దు మా
యావటు వీతఁ డాహరి, సురావళికోరిక దీర్పఁబుట్టె ని
ద్రావరజుండుగా, నిది యథార్థము నమ్మము, నేల గీల లే
దావల కొంప మున్గు నిపు డావలి కీతని సాగనంపుమీ! 74

చ. అన విని దైత్యరాజు నిజమా యిది యంచు నొకింతసేపు నె
మ్మనమునఁ జింతచేసి హరి మాణవకుం డయి యేమిచేయు న
న్నని తనలోన నవ్వుకొని యబ్బినపాత్రము వీడవచ్చునే
యనుకొని లేచి చేతఁగొని యర్ఘ్యజలాంచితహైమపాత్రమున్. 75

వ. వామనుం జూచి ససంభ్రమంబుగ. 76

చ. తిరుగుము తూర్పుగాఁ, దిరిగితిన్, గొను, మీఁదగు, నేమి
కావలెన్?
ధరణి కియత్ప్రమాణము? పదత్రయమాత్ర, మొసంగినాఁడ, నా
కరమున ధారపోయు,మనఁగా గురునానతి దాఁటుచుంటి నా
స్థిరమతి లేనియట్లు గురుదిక్కు కనుంగొనె,శుక్రుఁ డిట్లనెన్. 77

చ. కరమున ధారవోయకుము,కారణ మేమి?వటుండు కాఁడు నే
నెఱుఁగుదు,నెవ్వఁ డీతనుఁ,డుపేంద్రుఁడు,సత్య,మసత్య,మైనచోఁ
బరమముదంబు,వంచనము,వంచనమా?హరి తానుగా మద
ధ్వరమును జూడ వచ్చి ననుదానము కోరెను ధారవోసెదన్

ఉ. ఎందు లభించు శ్రీహరికి నీ డగునుత్తమదానపాత్ర?మే
నిందుకు జంక నంచుఁ గవి కేర్పడఁ బల్కి,బలీంద్రుఁ డార్య!చా
పందగు నీకరం బనఁగ వామనుఁ డింకను వానిపాప మే
పొందఁగ దూర్పుగాఁ దిరిగియుండియె చాపెను సవ్యహస్తమున్. 79

వ. అంత దానవాన్వయవినాశసూచకంబుగా దక్షిణహస్తంబు చాచిన
యావటువునభూతపూర్వం బశ్రుతచరం బాసుర శ్రీజిహీర్షాసముత్సు
కం బచింత్యవైభవం బమేయమహిమంబు నైనదివ్యరూపం బవలో
కించి పరేంగితజ్ఞుండును బరమపావనుండును బద్మనాభభక్తుండు నగు
ప్రహ్లాదుఁ డాసన్నం బగుపౌత్రునియధఃపతనంబున కంతరంగంబునఁ
దలంకియో వామనావతారతత్త్వం బుపదేశింప నూహించియో
సత్వరంబుగ మనుమని సమీపించి. 80

ఉ. ఆఁగుము ధారవోయ కసురాధిప!నీప్రపితామహున్ మహా
భాగుని గూల్చినట్టిహరి వామనుఁడై నిను మట్టువెట్టఁ దా
నీగతి వచ్చె నన్నబలి యిట్లనె నా కిఁక నేమి కావలెన్?
యాగఫలప్రదాత తనయంతన వచ్చుట భాగ్యమే కదా! 81

చ. అడిగెడువాఁడు విశ్వమున కంతకుఁగారణ మైనయీశ్వరుం,
డిడియెడువాఁడు లోకముల నెల్ల జయించినదానవేశ్వరుం,
డడిగినభూమి మూఁడడుగు లంచు మనంబునఁ గొంకుచుండ,ని
వ్వడువున నడ్డుపెట్టఁ దగవా! పరమేశ్వరభక్తబాంధవా! 82

గీ. 'దేహి' యని వచ్చు నెవ్వాఁడు, ♦'దేహి' యన్న
వానిఁ బొమ్మను నెవ్వాఁడు, వారిరువురి
నాశ్రయించును బెద్దమ్మ ♦యంచుఁ బెద్ద
లన్నమాటలు వినవె? నీ♦వదియుఁ గాక. 83

గీ. బ్రాహ్మణుని కిచ్చెద నటంచుఁ ♦బ్రతినచేసి
యివ్వ కుండినపాపాత్ముఁ ♦డీధరిత్రి
బ్రతికి నింద కలక్ష్మికిఁ ♦బాత్రుఁ డగును
జచ్చి నరకముఁ గాంచు నిశ్చయము గాఁగ. 84

గీ. అన్యవిప్రుండు యాచకుఁ♦డైనయపుడె
యాడి తప్పినచో నిట్టి♦కీడు గలుగ
దాదివిష్ణువె యర్థి యై ♦నప్పు డాడి
తప్పితే వచ్చుదోషంబు ♦చెప్ప నగునె? 85

క. కావున నీకు నమస్కృతి
గావించెద నీదుమాట ♦గావింపమి కే
నీవడుగున కిచ్చెద నితఁ
డీవేఁడిన దంచుఁ బలికి ♦యీక్షించి హరిన్. 86

చ. మరల నిఁకొక్కమాఱు బ్రతి♦మాలెద వామన! యల్పమాత్రభూ
తర మిది యేల? యిచ్చెదను ♦బట్టుము వార్ధిపరీత మీవసుం
ధర సకలంబు నా,వటువు ♦దానవనాథ! త్రిపాదభూమి యా
దరమున నిమ్ము చాలు-నది♦ దాన జగత్త్రియ మిచ్చినట్లగున్. 87

గీ. అనఁగ బలిచక్రవర్తి వామనుకరమున
"విప్రరూపాయ విష్ణవే విశ్వరూప
ధారిణే త్రిపదాని దదామి తుభ్య"
మనివచించుచు ధారవోసెను ముదమున. 88

వామనుని విశ్వరూపము

వ. అంతవామనుండవామనుండై భూవలయంబు పాదద్వయంబు,పిశాచంబులుపాదాంగుళులుమరుత్తులుపాద సంధులు,సాధ్యులు జంఘలు, విశ్వేదేవులు జానువులు,రుద్రలూరువులు,లక్ష్మీ మేధాధృతికాంత్యాది విద్యాగణంబు కటిప్రదేశంబు,ప్రజాపతిగుహ్యంబు,వసువులుపృష్ఠంబు గంధర్వభుజంగు లూర్ధ్వాధరోదరభాగంబులు,స్వర్గద్వారంబు నాభి, వేదం బురంబు,బ్రహ్మ హృదయంబు,ధర్మంబు మానసంబు,విదిశలు బాహువులు, గుహ్యకులు హస్తాంగుళులు, యక్షులు నఖంబు, లదితి మహాదేవి కంఠంబు,వైశ్వానరుండు ముఖంబు,వాయుదేవుండు నాసిక,సర్వయజ్ఞంబు లోష్ఠంబులు,సర్వచ్ఛందస్సులు దంతంబులు, సరస్వతి జిహ్వ,మిత్రత్వష్టలు భ్రూయుగంబు,రవిచంద్రులు నేత్రంబులు, దిగధి దేవతలు కర్ణంబులు,వైకుంఠంబు లలాటంబు,ద్యులోకంబుత్తమాంగంబు,మేఘమండలంబు శరీరకాంతి,సూర్యకిరణంబులు శిరోజంబులు,తారకలు రోమకూపంబులు,దివ్యాప్సరసలు దేహరేఖలు,శక్రాదిదేవతలు సర్వాంగతేజంబు,దేవర్షులు పౌరుషంబు నుంగా,వివిధదేవమయం బగువిశ్వరూపంబును గ్రమక్రమముగా దశదిశలకు విస్తరింపఁజేయ నచింత్యమైనయావిజృంభణంబున కత్యాశ్చర్యపులకితాంగులై మహర్షులు. 89

చ. మొదల నురంబుతోడ సరిపోయినకశ్యపసూర్యమండలం
బదె కనుచుండఁగా నుదరమందు కనంబడి యంతలోనె నా
భిదరిఁ గనంగ వచ్చి యటుపిమ్మట నూరుయుగంబుచెంతఁ దాఁ
బొదలుచు నంత జానువులపొత్తున నొప్పె మహాద్భుతంబుగన్. 90

వ. అనుచుఁ బ్రశంసించి యానందపరవశులై యావిశ్వరూపం బవలో
కించుచున్నంత. 91

గీ. దానవేంద్రునిమాట సత్యంబు గాఁగ
విశ్వరూపంబు దాల్చిన విష్ణు వపుడు
ధారవోసినయాత్రిపదంబు లనఁగఁ
ద్రిభువనంబులు గైకొనిత్ తృప్తి గాంచె. 92

వ. ఆసమయంబున. 93

శా. లోకాతీతము లోకపూర్ణము దురాత్లోకంబునై పొల్చువి
శ్వాకారప్రథిమంబు దానవవిభుంత్డాశ్చర్య మేపార నా
లోకింపం గని దైత్యవీరులు ఖలుల్ క్రతుల్లింత నాచక్రిపై
నేకంబై పడి రాపతంగములు వహ్నిం జొచ్చులా గేర్పడన్.

వ. మఱియు వివిధాయుధహస్తులైన విప్రచిత్తిమొదలగు మహాయోధు
లుగ్రక్రోధమూర్తులై హృషీకేశుం జుట్టుముట్టి రట్టియెడ నాదుష్ట
శిక్షకుండు. 95

చ. కరపదతాడనంబు లసిత్ఘూతగదాహతి వజ్రపాతము
ద్గరపరిఘాప్రహారములుత్గా బలి యట్టులె చూచుచుండ ను
ర్వరపయిఁ గూల్చి యద్దనుజత్వర్గము నంతట విశ్వరూపసం
హరణ మొనర్చి నిల్చె దనుత్జాధిపుముందట వామనాకృతిన్. 96

వ. అప్పుడు బలీంద్రుండు చేతులు జోడించి మ్రొక్కి. 97

బలి వామనుని స్తుతించుట.

శా. ఏయోగంబున నేతపోమహిమ నిత్న్నీక్షింపఁగా వచ్చు? నో
మాయామానుషవిగ్రహా! విదితసత్మ్యజ్నిగ్రహానుగ్రహా!
నాయర్ధత్వము నిన్ను నీకరణిఁ గంత్టం బెట్టె లేకున్న నా
కీయోగం బెటు లబ్బుఁ?గాన నదిమేత్లే చేసె నం చెంచెదన్. 98

ఉ. ధన్యుఁడ నైతి నీచరణదాసుఁడ నైతిని, ముజ్జగంబులన్
గణ్యుఁడ నైతి నీదుభువనంబులు నీకు వశంబుచేసి, నే
మాన్యుఁడ నైతి నీదుపరమంబగు తత్త్వము గాంచువారిలో,
నన్యునిగాఁ దలంపకు మిఁకనైన ననుం గృపఁ జూడు మీశ్వరా!

వ. అనుచు ముకుళితనయనుండై యొకింతసేపు మహామహిమసంపన్నం బగు శ్రీమన్నారాయణునిదివ్యరూపంబు మనసార ధ్యానించి యావటురూపపరమేశ్వరునకు మరల నమస్కరించి దేవదేవా! ఇఁక నా గతి యేమి? నే నేమి చేయఁదగు నాన తిమ్మని సవినయంబుగ నర్థించిన నప్పరమాత్ముండు. 100

చ. మనుజుల బాధపెట్టకు మమర్త్యులతోఁ గలహింపఁబోకు మిం
ద్రునికి మదగ్రజన్మునికి దోసముచేయకు మెన్నఁడుం దదు
క్తిని శిరసా వహించి పరిదీర్పము దాఁటకుమీ మదాజ్ఞ యీ
విని ననుఁ దన్పినాఁడ వని వేల్పులుఁ జూతురు నిన్నుఁ గూరిమిన్.

మ. ధరణీచక్రము నాకలోకమును బాతాళంబు దేవేంద్రుఁడే
పరిపాలించెనుఁ, దక్కులోకములు దిగ్భాగంబులుం దొల్లి యె
వ్వరు పాలించిరి వార లేలెదరు, నావాక్యం బలంఘ్యంబు, యీ
మరియాదం జెడఁగొట్టి చక్రమునకుం బ్రాణంబు లీఁబోకుమీ!

మ. హితమే నొక్కటి చెప్పెదన్ వినుము నీయిక్కట్టు నూహించి నీ
యతిధైర్యంబు నీవదాన్యతయు సత్యంబు మెంచి నీతోఁటియు
న్నతి భావించి వధింప లేక బ్రతుకుం గాఁ గంచు నీ కిచ్చితిన్
సుతలం బందుల కేగు మింక దితివంశ్యుల్ తోడుగా దానవా!

ఉ! నావుడు నబ్బలీంద్రుఁడు జనార్దన! వందన, మానతిమ్ము నా
జీవన మెట్టులో? యచటఁ జేసెడినాపని యేమొ? నీకు నే
నేవిధిఁ గూర్తునో? యనఁగ నీశ్వరుఁ డిట్లనె దానవేంద్ర! దై
త్యావన మాచరింపు సుతలావనిపాలన మీ వొనర్చుచున్. 104

సీ. నియమంబు లేనియధ్యయనంబు నశ్రోత్రి
యం బైనపితృదేవతార్చనంబు
దక్షిణ లేనియధ్వరము ఋత్విజులు గా
కున్న వార లొనర్చుహోమములును
శ్రుతివిహితముగ సంస్కృతము కానిహవిస్సు
నశ్రద్ధగా నిచ్చునట్టియీవి
మద్విరోధు లొనర్చుమహితకార్యంబులు
మద్భక్తనిందకుమంచిపనులు;
గీ. అనెడు నివి యెల్లనీభాగమునకు వచ్చు
వానితో జీవనము చేయవచ్చు నీకు
సుతలలోకనివాసంబు సుఖ మొసంగుఁ
బొమ్ము దానవ! సపరివారమ్మునంగ. 105
గీ. భగవదాజ్ఞాప్రకారమా బలి వెడలెను
వామనుఁడు మాయమై త్రిదివంబుఁ జేరె.
శక్రుఁ డగ్రేసరుం డయి చనుచునుండ
సకలదేవత లరిగిరి సదనములకు! 105
వ. అంత. 107

నాగబాధితుఁడగు బలి సుతలమున శ్రీహరిని స్తుతించుట

మ. దనుజానీకము బంధుమిత్రగణముల్ దారాత్మజుల్ తోడ రాఁ
జని వైరోచని యిమ్ముగా సుతల మాసాదించెనో లేదొ యం
తన నాగంబులు వచ్చి వానికరపాదం బొండుగాఁ గట్టివై
చె నహో! యీశ్వరమాయ! చూడు బలికిం జేటయ్యె సర్పంబులన్.
వ. అయ్యవసరంబున నాగబంధంబులవలనివేదన దుర్భరంబై కనుపట్టి
గుట్టు వదలక బలీంద్రుఁడు లోలోనఁగుందుచుండ భార్యాపుత్రమి
త్రాదులతనికష్టంబు గాంచి మొత్తుపెట్టుచుండ దానవీరు లందఱు

ని దేమి వింత! పాములెక్కడ? బలిచక్రవర్తిని బధించు టెక్కడ?
చూచెద రేమి? పట్టి లాగి కొట్టి కోసి చీల్చెదము గాకయనుచుఁ
బెద్దగా నఱచుచుండి రప్పుడు. 109

క. ఆదారిఁ బోవునారదుఁ
డేదో సంకులనినాద ♦మీక్షించెదఁ గా
కా దెసకుఁ బోయి యని తా
నాదానవు లున్నచోటి ♦కరుదెంచి వెసన్. 110

ఉ. కాంచి బలీంద్ర! నీవు పడు♦కష్టము చూచి విచార మయ్యె, భా
వించఁగ దీనికారణము♦ విష్ణునిమాయగఁ దోఁచె, బంధముల్
త్రెంచఁ దలంతు రేని పది♦ రెట్లగునాగులబాధ, గానఁ గా
వించుము శ్రీహరిస్తవము ♦ పీడతొలంగునుబన్నగాళిచే 111

గీ. అనుచు వైరోచనికి విరిం♦చనసుతుండు
ఘనతరం బగునాగపీ♦డనము తొలఁగ
దేవదేవస్తవంబు బో♦ధించి చనియె
భక్తితో దానిఁ బఠియించె ♦బలియు నిట్లు. 112

గీ. సప్తలోకంబులను మీఁద ♦సప్తలోక
ములను గ్రిందను నిర్మింప ♦మూల మగుచు
సప్తసూర్యాత్మమహిమ వి♦శ్వమున వెలుఁగు
సచ్చిదానందతత్వంబు ♦ సంస్మరింతు. 113

గీ. విశ్వ మంతయు నెందు నా♦విర్భవించు
నిఖిలలోకంబు లెద్దాన ♦నిలిచియుండు
సర్వజగములు నెందులో ♦సమయు నట్టి
సచ్చిదానందతత్వంబు♦సంస్మరింతు. 114

గీ. సకలభూతప్రపంచంబు ♦సంహరించి
యోగినై సంవిదాకృతి♦ నుండియుండి
వెండియును దాని నంతను ♦విడుచునట్టి
సచ్చిదానందతత్త్వంబు ♦సంస్మరింతు. 115

గీ. శిష్టసంరక్షణము దుష్ట♦ శిక్షణంబు
ధర్మసంస్థాపనంబు న♦ధర్మనిహతి
యాచరింపఁగ నవనిపై♦నవతరించు
సచ్చిదానందతత్వంబు ♦నంస్మరింతు. 116

గీ. వేదములు భూమి విప్రులు♦ విబుధవరులు
కష్టముల మున్గినప్పుడు ♦కావఁ బూని
మత్స్య కూర్మ వరాహ సిం ♦హంబు లైన
సచ్చిదానందతత్వంబు సంస్మరింతు, 117

గీ. తనయు నొకని నపాంత♦రతముఁ డనంగ
నాత్మసంకల్పమునఁ గాంచి ♦యతనిచేత
వేదముల కర్థములను జె♦ప్పించినట్టి
సచ్చిదానందతత్వంబు ♦సంస్మరింతు. 118

గీ. మున్ను గురుశాపహతుఁ డయి ♦పుట్టుగ్రుడ్డి
యైనదీర్ఘతముం డను♦నసఘమతికి
ఋషికులాలంకృతికిఁ గన్ను ♦లిచ్చినట్టి
సచ్చిదానందతత్వంబు ♦సంస్మరింతు. 119

గీ. ప్రబల మైనట్టిమొసలికిఁ ♦బట్టువడుచు
దిక్కు గానక మొఱవెట్టి♦ దేవదేవ!
కావు మన్నట్టిగజరాజుఁ♦ గాచినట్టి
సచ్చిదానందతత్వంబు♦సంస్మరింతు. 120

గీ. భక్తవత్సల!నీపదా♦బ్జములు తలఁప
సకలసంసారబంధముల్ ♦సడలు ననఁగ
భుజగబంధంబు సడలు ట♦బ్బురమె? దేవ!
సకలజగదీశ్వరా!నమ♦స్కారశతము. 121

క. అని భక్తియుక్తుఁడై బలి
వినుతింపఁగ సంతసంచి ♦విష్ణువు గరుడున్
బనిచెను బలిపన్నగబం
ధనమోక్ష మొనర్ప నతఁడు♦తత్ క్షణము వడిన్. 122

చ. సుతలము చేరఁ జూచి యహి♦శూరులు కాతరులై బలీంద్రుతో
ధృతియుఁ బరిత్యజించి పరు♦గెత్తిరి భోగవతీపురంబు,న
ట్టితతిని నైజదుర్గతి క♦డిందివిషాదము గొల్ప దైత్యుఁ డా
నతముఖుఁ డైనఁ గాంచి ఖగ♦నాయకుఁ డిట్లని నూఱడించుచున్.

ఉ. కాలవశంబు దుఃఖము సు♦ఖంబును దీనికి నింత కుందఁగా
నేల!మదాంధవృత్తి జగ♦దీశ్వరుఁ గానక నేన కా జగ
త్పాలుఁడ నంచుఁ బొంగి బహు♦భంగులఁ బాప మొనర్చినాఁడ వా
కాలమునందు తత్ఫలము ♦గాంచక తప్పునె దానవేశ్వరా! 124

ఉ. ఇప్పటికైన నీహృదయ ♦మేగతి నున్నదొ చూడఁగోరి తా
నిప్పగిదిన్ జగత్పతి ప♦రీక్ష యొనర్చి యహీంద్రబంధముల్
తప్పఁగఁ జేసె నింకఁ బది♦లంబుగ నుండుము నీకుఁ దానుగాఁ
జెప్పు మటన్న మాటలు వ♦చించెదఁ జక్కఁగ నాలకింపుమా! 125

గీ. "సుతలమం దిప్పు డీవున్న♦చోటినుండి
రెండుక్రోసులపయికిఁ బో♦కుండవలయు
దాఁటఁ గూడదు సమయంబు ♦దాఁటితేని
చెప్పుచున్నాఁడ నీతల♦చెక్కలగును". 126

గీ. "నాదుసమయంబు దాఁటక నడతువేని
నిరతమును నన్ను మదిని ధ్యానింతువేని
వేయిసంవత్సరంబులపిదప నాదు
లోకమును జేరుదువు దైత్యలోకనాథ!" 127

క. ఆసమయము విని బలి యేఁ
జేసెద హరియాజ్ఞ యనుచుఁ జే యెత్తి జగ
చ్ఛాసకునకు మ్రొక్కెను విన
తాసుతుఁడును విష్ణుసన్నిధానము చేరెన్. 128

ఉ. ఈకథ విన్నవారు పఠియించినవారును నారదోక్తసు
శ్లోకహరిస్తవంబు మదిలో జపియించినవారు నెల్ల దూ
రీకృతసర్వపాపులురరీకృతపుణ్యులు నై సమస్తభూ
లోకసుఖంబు లొంది పరలోక సుఖార్హత గాంతు రెంతయున్.

క. అని వ్యాసునిశిష్యుఁడు వా
మనుకథ వినిపింప హృష్టమానసుఁ డగుచున్
జనమేజయుండు గౌరవ
మున వినయము భక్తి దోఁప మ్రొక్కి మునీంద్రా! 130

గీ. విశ్వమంతయుఁ దనయందు విశ్వవిశ్వ
మెల్ల దా నిండియుండ నిం కెందుకోస
మబ్జనేత్రుఁడు కైలాసయాత్ర చేసె
నయ్యుదంతంబు తెల్పుమం చడుగుటయును. 131

ఇది

శ్రీజటప్రోలుసంస్థానాధీశ్వర శ్రీరాజాసురభిలక్ష్మారాయమహీశ
సత్కృతచిరకాలవార్షికసమ్మానుండును, శ్రీనూజవీడు
సంస్థానవిభువర శ్రీరాజా నారయప్పారాయ
శ్రీరాజాసింహాద్ర్యప్పారాయ రాజసోదరాస్థాన
చిరకాలసమ్మానితుఁడును, తదారణప్రణీత
భీష్మప్రతిజ్ఞాదికృతియు నైన
మల్లాది సూర్యనారాయణశాస్త్రి సంతరించిన
యాంధ్రభవిష్యపర్వమునందు
తృ తీ యా శ్వా స ము.

---

# ఆంధ్రభవిష్య పర్వము.

## చతుర్థాశ్వాసము.

శ్లో॥ వాసుదేవం మహాదేవం కేశవం శివమవ్యయమ్
రమానాథ ముమానాథం నారాయణ మహంభజే. 1

రుక్మిణీదేవి శ్రీకృష్ణుని బుత్త్రివరమడుగుట.

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. నరనాథ! వినుము పరమే
శ్వరుకైలాసాద్రియాత్ర వర్ణించెద శ్రీ
హరిహరమతత్త్వవివేచన
పరమార్థం బెల్ల దానఁ బ్రత్యక్ష మగున్. 3

ఉ. ద్వాపరమందు రక్కసులు దర్పితులై చెలరేగి లోకముల్
మాపుట యాలకించి పరమాత్ముఁడు విష్ణుఁడు కృష్ణుఁడై జగ
ద్గోపన మాచరింప దయతో ధరణీస్థలి యాదవాన్వయో
ద్దీపనుఁడై జనించి తన తేజ మెలర్పఁగ బాల్య మాదిగా. 4

చ. ఖలు లగుదానవాధములఁ గంసుఁడు మున్నగుదుష్టధూర్తరా
జుల నరకాసురాదిరిపుసూరులఁ గూలిచి దేవమర్త్యబా
ధలు తొలఁగించి ధర్మము యథాస్థితికిం గొనివచ్చి యెల్ల రా
జులు దనయాజ్ఞలో మెలఁగుచుండ వసించెను ద్వారకాపురిన్. 5

క. శ్రీకృష్ణునివాసంబై
నాకంబును మించి నందనప్రాసాద
శ్రీకంబై ద్వారక భూ
వైకుంఠం బనఁగఁ బుణ్యపట్టణ మయ్యెన్. 6

చ. ధరపయి రాజధానులకుఁ దక్కువయే? జగదీశుఁడున్న యా
పురిసరిరావు గాక, తలపోయఁగ వెండిపసిండిప్రాఁతలన్
మెఱసెడియట్టికోటలును మేడలు మిద్దెలు గోపురంబు లా
పరిఖలు సర్వపుష్పఫలవస్తుసమృద్ధియు నెందుఁ గల్గునే? 7

గీ. వివిధవిద్యలకును సాంగవేదములకుఁ
బ్రకటనిజధర్మగతచతుర్వర్ణములకుఁ
బరభయంకరచతురంగబలములకును
బుట్టినిల్లయ్యె ద్వారకాపట్టణంబు. 8

ఉ. అంబుధి వేల నంటి చతురశ్రముగా దశయోజనప్రమా
ణంబుగ నొప్పునప్పురమున న్నడుచక్కి విచిత్రశిల్పర
మ్యం బగుపెద్దరాచనగరంబర మంటుచుఁ బట్టణంబు స
ర్వంబును గాంచుచుండెను సువర్ణఘటాంచితవజ్రకాంతులన్. 9

గీ. అష్టమహిషీసమేతుఁడై యిష్టసుఖము
లానర నందున్న శ్రీకృష్ణుఁ డొక్కరాత్రి
యంతిపురమున రుక్మిణీకాంతఁ గూడి
యలరుచుండంగఁ బ్రియుఁ గాంచి యాలతాంగి. 10

గీ. "మనసు సిగ్గును దోఁప నింతదనుక మీకుఁ
జెప్పనా మాననా యని చిడిముడిపడి
ప్రాణనాయక! యీవేళ పట్టలేక
చెప్పఁదలఁచితి నాకోర్కె సెలవుగోరి. 11

క. ఏమీ యనుకోరుగదా!
నామాటలు విన్న మీరు నవ్వుదురేమో!
సామాన్యపుఁగోరిక గా
దేమందురు?" నాఁగ నాతఁ డిట్లనె నగుచున్. 12

చ. తలఁచివనీమనోర్కెక వ♦తారికయా యిది? లేక ప్రౌఢకాం
తలసరసోక్తిచాతురివి♦ధానము? కాక వినూతనత్రపా
విలసనమా? చెలీ! తెలుప♦వే భవదీయమనోరథంబు నా
యలవికి మించినం దగిన♦యత్నమున న్నెఱవేర్చి తీరెదన్. 13

మ. అనినన్ రుక్మిణి భర్తచేయి గొని నా♦థా! స్వర్గసౌఖ్యంబు మిం
చినసౌఖ్యంబును గాంచుచుంటి మని నా♦చిత్తంబు శాంతింప దే
మనుదానన్? మగమొల్క లేనిమన కీ♦యైశ్వర్య మెల్లన్ వృథా
యనిపించెం గరుణించి పుత్త్రవర మి♦మ్మా వంశము న్నిల్పుమా!

చ. అడుగక యుండియుం డడిగి♦నందుకు మక్కువ దీర నీకు నా
కడుపునఁ బుట్టువాఁడు సరి♦గా నినుఁబోలినసుందరుండు ధా
రుఁడు యదువంశవర్ధనుఁడు♦ క్రూరవినాశనుఁ డెల్లవిద్యలుం
బడసినవాఁడు గావలె న♦వశ్యము నామన సెట్లు తీర్చెదో! 15

చ. అనుడు జనార్దనుండు దర♦హాసముతోఁ జెలియా సెబాసు! పు
త్త్రునరకంబునుండి కుల♦మంతయుఁ బ్రోచును బుత్త్రుఁ డట్టిపు
త్త్రునికయి తీర్థయాత్రలు క్ర♦తువ్రతదానతపోజపాదు లెం
దును బచరింతు రెందఱో! సు♦తుం గనుకంటెను భాగ్యమున్న దే?

గీ. కొడుకు పుట్టినశ్రీమంతు♦ నెడఁ దలంచి
పోయె నొకపుత్త్రికామేష్టి ♦పోయె ననుచు.
నాకులంపడు దేవేంద్రుఁ ♦డంద్రు, కొడుకు
గలుగు టెంత యలభ్యమో♦ గంబా చూడు. 17

గీ. ఐన నెయ్యది కష్టసా♦ధ్యంబొ? దానిఁ
గోరుచుండుట సర్వసా♦ధారణంబు,
అందు నిహపరసాధన♦మైన పుత్త్రి
జనన మాసించు టెంతయు ♦సాజము గద! 18

ఉ. కావున నెల్లరుం గొడుకు ♦గావలె నందురు కాని, వాఁడు వి
విద్యావినయాది సంపదల♦కాకరుఁడేని కులప్రసిద్ధి, పా
పావహుఁ డయ్యెనేని కుల♦హానియు వచ్చును, గోరకుండియుం
గావలుఁ డైనపుత్త్రుఁ గను♦కామినకంటెను వంధ్య మే లగున్. 19

ఉ. కోరకకోర కీ విప్రుఁడు ♦కోరినకోరిక కోరినట్లుగాఁ
దీరఁగ నాదిదేవు నజు♦దివ్యతపోమయు నీలలోహితుం
గూరిచి బ్రహ్మచర్యమున♦ఘోరతపం బొనరించి యాజగ
త్కారణుదీవనం బడసె♦దన్ రజతాద్రికిఁ బోయివచ్చెదన్. 20

క. అని పలికి రుక్మిణీసతి
యనుమోదము గాంచి కృష్ణుఁ ♦డరుణోదయవే
ళను వార్చి వేల్చి విప్రుల
కును దక్షిణ లిచ్చి, కొలువు♦కూటంబునకున్. 21

కృష్ణుఁడు యాదవాది వీరులకు ద్వారకయొప్పగించుట.

క. చనుదెంచి రత్నసింహా
సనమునఁ గూర్చుండి బంధు♦సచివాప్తభ్రా
త్రనుజాదులు యదువీరులు
పనివిన గాంభీర్య ముట్టి♦పడ నిట్లనియెన్. 22

ఉ. పిన్నటనాఁటఁగోలెఁ బృథివీస్థలిఁ బాపము మాపఁ బూని నే
మొన్నటిదాఁక శాత్రవసమూహ మణంచుచు వచ్చి సౌఖ్యసం
పన్నత గూర్చితిన్ సకలమానవజాతికిఁ గాని, పౌండ్రకుం
డన్నమహీశుఁ డొక్కఁడు మదాంధుఁడు నిల్చెనుశత్రుశేషమై. 23

ఉ. ఒక్కని కేమి యంచు మన మొప్పరికింపఁగరానిదిట్ట పే
రెక్కినజెట్టి భౌమునికి నిష్టసఖుం డఖిలాస్త్రశస్త్రముల్
చిక్కినద్రోణశిష్యుఁ డని చేయఁగ రెండవజామదగ్న్యుఁ డా
యుక్కరి కన్ను వేసి కనుచుండెను ద్వారక ముట్టడింపఁగన్. 24

గీ. ద్వారకాపురి వానికిఁ దలఁపువచ్చె
నేని యఱకాలిమంట నెత్తికెక్కినంట!
యాదవునిపేరు వాఁడు విన్నంత లేచి
తోఁక తొక్కినతాఁచునా గినుకునంట! 25

చ. ప్రకటితమత్సరుండు సమరప్రియుఁ డాతఁడు మచ్ఛలంబుఁ జీ
రికిఁ గొనఁ డెప్పు డెల్లు చెలరేఁగునొ! సందు లభించెనేని ద్వా
రకపయి కెత్తివచ్చును గరంబు నిజంబు, పరాకు లేనిపూ
నికమెయి రాజనీతిసరణిం బురరక్షణ మాచరింపుఁడీ! 26

వ. అని పలికి యుగ్రసేనాదిబంధుమిత్రామాత్యుల సాకూతంబుగ నవ
లోకించి— 27

ఉ. ఏ నిపు డేగుచుంటిని మహేశ్వరుఁ జూడఁగ వెండికొండకున్
గానఁ బురంబు వీడి యరుగం జన దాటలు వేఁట లంచు మీ
లో నొకరేని నేను బురిలో మఱి పాదము పెట్టుదాఁక, నే
మైనఁ బరాకునం బడుదురా పురనాశము సిద్ధమేసుఁడీ! 28

గీ. ఏను బురమున లే నని యెఱిఁగెనేని
ద్వారకాపురి నిర్యాదవం బొనర్ప
వాఁడు తప్పక దండెత్తి వచ్చి పడును
గాన జాగ్రత్తగాఁ బురిఁ గావవలయు. 29

సీ. రాకపోకల కుత్తరద్వార మొక్కటి
వదలి తక్కినపురద్వారములను
గట్టిగా మూయించి యట్టాలకంబుల
పై యుద్ధసామగ్రి భద్రపఱచి
ఉత్తరద్వారంబు నుభయపార్శ్వంబులఁ
బటుగాత్రసాయుధభటుల నిలిపి

వచ్చిపోయెడివారు ద్వారంబునందు చూ
పంగ రాజముద్ర లేర్పాటుచేసి

గీ. ముద్ర లేనట్టివారల మొదల నుంచి
స్వీయుఁ బరు నర్హరీతి శిక్షించుచుండి
వేగు నడపుచుఁ బుర మెల్లవేళలందు
వేయికన్నులఁ జూడుఁడీ వీరులార! 30

వ. అని యానతిచ్చి మఱియు బలభద్రాదివీరుల నొక్కొక్కరి
నుద్దేశించి. 31

సీ. పరభయంకరగదాపాణి!హలాయుధా!
ద్వారకాపురము భద్రంబుసుమ్ము
శస్త్రాస్త్రవిద్యావిశారద!సాత్యకీ!
ద్వారకాపురము భద్రంబుసుమ్ము
సరహస్యనయశాస్త్రసారజ్ఞ!ఉద్ధవా!
ద్వారకాపురము భద్రంబుసుమ్ము
యుద్ధతంత్రప్రవీణోగ్రసేనమహీశ!
ద్వారకాపురము భద్రంబుసుమ్ము

గీ. సర్వసంపత్సమృద్ధంబు సకలసౌఖ్య
భాజనం బగుయాదవరాజధాని
మీకు విడిచితి నే వచ్చుదాఁక రిపుని
బారిఁ బడకుండఁ గావుఁడీ ధీరులార! 32

వ. అని హెచ్చరించి కొలువు చాలించి సభ్యు లెల్లరుయథోచితంబుగ
సెలవు గైకొని వెడలినంత. 33

### శ్రీకృష్ణుఁడు బదరికాశ్రమమేగుట

మ. కమలాక్షుండు తలంచె వాహనము, ఋక్సామమాత్మపక్షుండు యా
గమయాంగుండు యజుశ్శిరుండు జితనాకస్వామి నాగాంతకుం
డమరాభీష్టసుధాహరుండు హరిభక్తాగ్రేసరుం డావిహ
గమనాథుం డరుదెంచి, "వచ్చితి నమస్కారంబు స్వామీ!" యనన్.

మ. అనురక్తిం గని వీఁపు తట్టి "ఖగనాథా! వచ్చితే సేమమా?
ననుఁ గైలాసము చేర్తువే! హరుని సందర్శింపఁ గాంక్షింతు" నా,
వినతానందనుఁ "డింతకంటెఁ గలదా! వేంచేయు మీపాదదా
సునియంసస్థలి" నంచు వేఁడుకొని కృష్ణుం డెక్క నుత్సాహియై. 35

సీ. బాల్యంబునంద గోవర్ధనం బెత్తిన
పురుషోత్తముఁడు భుజంబుల వసింపఁ
బౌరబృందము నేత్రపర్వమై యూరేఁగి
పురి దాఁటి మిన్నంటి పుష్పక మనఁ
జెవిదాఁక లాగి యేసినముల్కివడి మించి
చండమారుతమహాజవము నొంచి
మెఱపువేగంబును మిహిరాంశుజాలర
యంబును దాఁటెనో యనఁగనొప్పు

గీ. వడికి దివి నేగుపక్షులు పుడమిఁ బడఁగఁ
బుడమి వనపర్వతంబులు బోరగిలఁగ
జవరవంబు లయాబ్ధిఘోషంబు నాఁగ
సంజవేళకు బదరికాశ్రమముఁ జేరె. 36

గీ. అత్తఱిని విష్ణుపదవర్తులమరసాధ్య
సిద్ధగంధర్వు లెల్ల జేజే యటంచు
గరుడివాహను వెంబడి నరుగుదెంచి
క్రిందికిం దిగి భక్తిఁ గీర్తించి రిట్లు. 37

శ్లో. "జయాజేయ నమోదేవ భూతభావనభావన!
నారాయణ నమోదేవ కృష్ణకృష్ణ హరేహరే!
నమస్తే సకలేశాయ నిర్గుణాయ గుణాత్మనే
ఆదికర్తఃపురాణాత్మన్ బ్రహ్మయోనే సనాతన!
అచిన్త్యమూర్తయే తుభ్యం నమస్తే సత్యరూపిణే
జయాజేయ హరే దేవ యోగిధ్యేయ పరాగతే!" 40

బదరికాశ్రమవాసులు కృష్ణుని సత్కరించుట

క. అప్పు డాశ్రమవాసులు వే
దపురాను లనంగ వచ్చి తచ్ఛబ్దార్థం
బు పరోక్షముగా దిదిగో
యపరోక్షమె యంచు మ్రొక్కి రచ్యుతుఁ గనుచున్. 41

గీ. అంత గరుడుని డిగ్గి జనార్దనుండు
సకరుణాలోకనంబుల సకలదివిజ
తాపసులఁ గాంచి వారి నందఱిఁ గూడి
యాశ్రమముఁ జూచువేడుక నరుగఁ జొచ్చి. 42

సీ. మునులయభ్యర్చనార్థనముతో శుకశారి
కాకోకిలములు స్వాగతము చెప్ప
బ్రహ్మర్షు లిచ్చునర్ఘ్యంబుతో జాహ్నవి
విమలశీతలశీకరములు చల్ల
మాణవకస్తుతిమంత్రపాఠంబుతో
సకలజంతుగణంబు స్వస్తి చెప్ప
స్త్రీజనంబులు చల్లులాజలతో లతా
పాదపంబులు పూలవాన గురియ,

గీ. ఐదువలతో హుతాగ్నులు గహోరతీయ
శాంతరస మొలుకనట్టియాశ్రమముశోభ
కంతరంగంబు పొంగంగ నల్ల నల్ల
నడచి యాతండు బదరికాశ్రమము చేరె. 43

వ. అపుడు. 44

గీ. కశ్య పాత్రి భరద్వాజ•కణ్వ రైభ్య
వామదేవ వసిష్ఠ జా•బాలి ధూమ్ర
గౌత మాంగిరో యాజ్ఞవ•ల్క్య ప్రముఖులు
కృష్ణపరమాత్మఁ గని నమ•స్కృతు లొనర్చి. 45

క. ఇదె పాద్యం బిదె యర్ఘ్యం
బిదె దర్భాసనముతోడి•కృష్ణాజిన మి
య్యదె పేయం బిదె పుష్పం
బిదె ఫల మని సత్కరించి •యెంతయు భక్తిన్. 46

శా. దేవా! మాజననంబు పావనము మా•తీర్థంబు సార్థంబు, మా
భావం బెంతయుఁ శాంతిఁ జెందెను భవత్త్వాదావలోకంబునన్,
జీవన్ముక్తుల మైతి మేము, ఫలియించెన్ మాతపో యోగముల్,
నీవాత్సల్యము నిర్వచింపఁ దరమా•నే? విశ్వవిశ్వంభరా! 47

క. అని వినుతించినఁ జిఱునగ
వున వారలఁ గాంచి హరి త•పోధనులారా!
మును పున్నతపోవన మని
కనుఁగొన వచ్చితిని బదరి•కాశ్రమ మనుచున్. 48

చ. కుశలమె యెల్లతాపసుల•కున్? సుఖ మున్న వె హోమధేనువుల్?
కుశఫలమూలధాన్యముల•కున్ గొఱ లేదు గదా? యరిష్టముల్
ప్రశమిత మయ్యెనే?జపత•పంబులు వహ్నులు వేదపాఠముల్
వశితయుఁ దత్త్వబోధము న•వారణ నిత్యము సాగుచున్న వే? 49

క. అని యడుగ, నీయనుగ్రహ
మున నేమియుఁ గొఱఁత లేదు ♦ మురహర! నీద
ర్శన మొక్కవిశేషము నేఁ
డని యతనికి విందుచేసి ♦ రమ్మునివర్యుల్. 50

సీ. శ్రీరామునికి విందు♦ చేసినయాభర
ద్వాజుఁడే యం దున్న♦ వాఁడు గాన,
ఆవిందు వర్ణింప ♦నలవి గాదిల భర
ద్వాజవిం దందు ర♦ద్దాని నేమొ,
అది భరద్వాజ మ♦హాముని యత్నమో
శ్రీమహావిష్ణుమ♦హామహిమమొ?
చెప్పశక్యంబు గా♦ దప్పురుషోత్తముఁ
డతని వెంబడి వచ్చి♦నట్టి సురలు,

గీ. అమృతవాంఛను మఱపించు♦నట్టివివిధ
ఫలరసాజ్యపయోదధి♦భక్ష్యభోజ్య
చోష్యలేహ్యాదిసర్వవ♦స్తువులతోడ
నారగించిరి విందు లా♦హా యటంచు. 51

గీ. అంత నందఱు ముచ్చట♦లాడుచుండ
గరుడి గూర్చినపల్లవా♦స్తరణమందు
నడుము వాలిచి హరి కొంత♦తడవు కునికి
వేకువను లేచి తత్కాల♦విధులు తీర్చి. 52

నరనారాయణాశ్రమమునఁ గృష్ణుఁడు యోగనిష్ఠుఁ డగుట

వ. తోడ వచ్చినవారి నెల్ల వీడుకొలిపి యాశ్రమవాసులయనుమతి నంది గరుత్మంతు నంద నిలిపి నారాయణుండు దా నొక్కరుండ గంగోత్తరతీరంబునఁ దాను దొల్లి నరునిం గూడి తపస్సు చేసినప్రదేశం

బవలోకించునభిలాషంబున బయలువెడలి. గంగాతీర్థంబులు తపోవేదికలు ఋషులరచ్చపట్లు ఫలపుష్పభరితంబు లగుపాదపపంక్తులు కదళీవనంబులు మొదలగునాశ్రమవిశేషంబు లభిజ్ఞానపూర్వకంబుగా నీక్షించుచుఁ జనిచని. 53

సీ. అఖిలపురాణేతి♦హాసార్థముల విచా
రంబు గావించు పు♦రాణమునులు
కర్మకాండజ్ఞాన♦కాండసంబంధంబు
తర్కించు వేదవే♦దాంతవిదులు
సగుణనిర్గుణతత్త్వ♦సామరస్యరహస్య
ముగ్గడించెడు మహా♦యోగివరులు
ముక్తిభేదములతో♦ ముక్తాత్మభావంబు
పన్యసించెడు పర♦బ్రహ్మవిదులు.

గీ. తనరఁ బరమాత్మనాస్థాన♦మనఁగ సత్త్వ
శమదమానంద విజ్ఞాన♦సదనమైన
యోగసిద్ధాశ్రమంబున ♦కుత్తరమున
వెలయుచుండిన శనతోంటి♦ నెలవు చొచ్చి. 54

వ. ప్రశాంతపావనంబు మనోహరంబు నిశ్శబ్దంబు వివిక్తంబు నైనయొక బదరీషండమధ్యభాగంబునఁ గుశకల్పితాస్తరణంబున సుఖాసీనుండై మానసంబు సమాధినిష్ఠంబు గావించి యాత్మధ్యానంబున నున్నంత నిశాసమయంబున "రండి రండి పాఱిపోవుచున్నవి మృగములు. పరుగెత్తండి. అమ్ములఁగూలఁ గొట్టండి తినండి. భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁ డీప్రాంతముననే యున్నాఁడు. దేవా మాధవా కేశవా! నమస్కార నమస్కార" మను మృగయుల కేకలతో భయవిహ్వలంబులై పరుగు లెత్తుమెకంబులయు వానిందఱుము వేటకుక్కలయునడుగులతో

సంకులంబగు మహానినాదంబు సహూఫెక్షోభకరంబై శ్రవణగోచరం
బగుడు నాజగత్పాలకుండు. 55

క. కడుదారుణ మీశబ్దము
కడలి కలఁగినట్లు వనము ♦ కలఁగంబడె, నె
క్కడివారు వీరు? న న్నొక
యెడఁబొగడుటయేమి? వేఁట♦యే మొక్కడెడన్? 56

♣♣ ఘంటాకర్ణునికిఁ గృష్ణుఁడు వరమిచ్చుట. ♣♣

చ. అని కనువిప్పి చూచి విపి♦నాంతర మంతయు నెండగాసిన
ట్లనయము దివ్వటీలవెలుఁ♦గారుట కచ్చెరువంది యార్తని
స్వనములఁ బరులెత్తివడి♦వచ్చుమృగంబులు విండ్లు నమ్ములున్
గొని పలు తెంచుభూతములు♦ క్రూరపిశాచికలుం బిశాచులున్.

క. తనయున్నెడ కేతెంచుట
కనుగొని యిదియేమి యనుచుఁ♦గమలదళాక్షుం
డనుకొనుచున్నంతనె గొ
బ్బున నిద్దఱు భూతవరులు♦ పొడచూపి రటన్. 58

సీ. పాఱపండ్లును గున♦పాలకోఱలు తాటి
పట్టెనాల్కలు నెఱ్ఱ♦మిట్టగుడ్లు
దూలాలకాళ్లు కం♦బాల చేతులు చేట
చెవులు బూరాల నా♦సికలు గలిగి
భీకరాకారులై♦ పేగులు నమలుచు
నెత్తురు త్రాగుచుం ♦మత్తు చెంది
తూలుచుం జిందులు తొక్కుచు నవ్వుచు
నార్చు నడగొండ ♦లనఁగవారు

గీ. తారసిల్లుచు శ్రీహరి♦దానవారి
మాధవుం డెక్క డున్నాఁడు♦మాయలాఁడు?
మాకు దర్శన మీయఁడే?♦ మాపిశాచ
జన్మముల కింక నైన మో♦క్షంబు నీఁడె? 59

ఉ. స్వామి మహానుభావుఁడు కృ♦పానిధి విష్ణువు గాఁ గాఁడె? మా
బాములు తప్పవే? యనుచు ♦బారలు చాఁపి మృగాళిఁ గూల్చి కృ
ష్ణా! మముఁ బ్రోవవే యనుచుఁ ♦జంపిన జంతువు లాగికొంచు దే
వా మధుసూదనా పరమ♦పావన పాపవినాశనా హరీ! 60

చ. అని పలలంబు మెక్కుచు జ♦నార్దన! దారుణ మైన జీవహింస
సనమునఁ బాపజీవనము ♦సల్పఁగ లే మికఁ జాలునయ్య! యీ
యనుభవ మేముచేసిన మ♦హాదురితంబున కంత కంచు నో
య్యన నటు వచ్చివచ్చి కని♦యంబుజనాభుని నిల్చి యల్లనన్. 61

ఉ. ఎవ్వఁడ వీవు? నీ వొకఁడ ♦విచ్చటి కెచ్చటినుండివచ్చినా?
వెవ్వరివాఁడ? వెందులకు ♦నెందుకుఁ బోవుచు నాఁగి తిందు? పే
రెవ్వరు? నిర్మనుష్యము మృ♦గేంద్రముఖాఖిలదుష్టసత్త్వమా
నివ్వనిలోఁ బిశాచముల♦కెట్లు భయంపడ కున్నవాఁడవో! 62

క. నీసంగతి తెలియఁగ మా
కాస పొడమెఁ జెప్పు మనుచు♦నర్థింపఁగఁ బ
ద్మాసనమం దుండియె శ్రీ
వాసుం డిట్లనియె భూత♦వరులం గనుచున్. 63

గీ. క్షత్త్రియుండను యదువంశ♦సంభవుండ
శిష్టరక్షకుఁడను దుష్ట♦శిక్షకుండఁ
బార్వతీ నాయకుని గాంచి♦ భక్తిఁ గొలువఁ
బోవుచున్నాఁడఁ గైలాస♦మునకు నిపుడు. 64

సీ. బదరికాశ్రమము నా♦పాలనలోనిది
బ్రాహ్మణావాసంబు♦ పావనంబు
నిశ్చలం బగుయోగ♦నిష్ఠకు నిర్విఘ్న
మగుతపశ్చర్యకుఁ♦దగిన,దిందు
చోరరాదు నీచులు♦ శునకంబు లెప్పుడు
వేఁటాడ రా దిందు ♦వేఁటకాండ్రు
మీ రెవ్వరీదురా♦చారం బి దే మింక
ముం దొక్కయడు గైన ♦మోవరాదు

గీ. సెలవు మీఱితి రేని శి♦క్షింతు మిమ్ము
ననుచు నదలింప, వారిలో ♦నగ్రజుండు
దైవవశమున జడిసి యం♦దటిని నిల్చి
యంజలి ఘటించి మ్రొక్కి యి♦ట్లనియె హరికి. 65

సీ. వినవయ్య నేను గు♦బేరునియనుచరుం
డైనఘంటాకర్ణుఁ♦డనెడువాఁడ
విష్ణునామము నాకు♦వినిపింపకుండ గం
టలు వీనులందాల్చి♦మెలఁగువాఁడ
భూతపిశాచప్ర♦భుండనై చనువాఁడ
నపరమృత్యు వనంగ♦నలరువాఁడ
నశ్రాంత మాంసర♦క్తాశనంబున ఘోర
దర్పుండనుకీర్తిఁ♦దనరువాఁడ

గీ. నంతకుని కంతకుం డను♦నంతశూరుఁ
డితఁడు నాతమ్ముఁ డిందలి♦యీగణంబు
నాదుపరివార మన్నపా♦నములు మాంస
రక్తములు నాకు వేఁటయే♦బ్రతుకుతెరువు. 66

గీ. ఇట్లు భూతవరఖ్యాతి ♦ నెసఁగునేను
హాయనముక్రింద సర్వభూ♦తాధినాథుఁ
గొలువఁ గైలాసమున కేగి ♦ ఘోరతపము
సలుప నాతండు మొన్న ద♦ర్శన మొసంగి. 67

క. మెచ్చితి ఘంటాకర్ణా!
యిచ్చెద వర మడుగు మనఁగ ♦ నెంతయుభక్తిన్
దచ్చరణంబుల కెరఁగుచు
హెచ్చినయుత్కంఠ ముక్తి ♦యిమ్మంటి,ననన్. 68

మ. పరమేశుండును బ్రీతి నన్నుఁ గని ని♦ర్వాణంబు నీఁజాలువాఁ
డరవిందాక్షుఁడు గాక యన్యుఁ డది యీ♦యం జాలునే? తొల్లి యీ
నరనారాయణు లున్నచోట నిపు డా♦నారాయణుం డుండె వే
గిర మయ్యాశ్రమ మేగు మవ్విభుని భ♦క్తిం గొల్చి ముక్తిం గనన్.

క. నారాయణనామావళి
పారాయణ విష్ణుమంత్ర♦పఠనంబులు సం
సారారణ్యచ్ఛేదన
కారణములు గా నెఱింగి ♦కను మవ్విభునిన్. 70

క. అని యానతీయ నద్దే
వునిపాదద్వంద్వ మాత్మఁ ♦బూనియు గోవిం
దునిపాదంబులు గొనఁ జ
య్యన వచ్చితి నయ్య బదరి♦కాశ్రమమునకున్. 71

గీ. చెవులఁ గట్టినగంటలు♦పవులఁగొట్టి
పాఱవైచితి నిప్పుడు♦పంకజాక్ష
నామసంకీర్తనంబె నా♦నేమ మయ్యె
మానసంబును హరిపదా♦ధీన మయ్యె. 72

గీ. సహజధర్మంబుగా వేఁట ♦సల్పుచున్న,
స్వపరివారంబు న న్నంటి ♦వచ్చుచున్న,
నైజ మగుభోజనం బే నొ♦నర్చుచున్న,
వాసుదేవుని గనుట నా♦వాంఛితంబు. 73

సీ. వేదాంతవేద్యుఁడై ♦విశ్వంభరుం డైన
యోగనిష్ఠుం డెందు ♦దాఁగినాఁడొ?
సత్యస్వరూపుఁడై ♦సంవిదాకారుఁడై
నెగడునీశ్వరుఁ డెందు ♦నిలిచినాఁడొ?
సర్వలోకాత్ముఁడై ♦సర్వజ్ఞుఁ డైనట్టి
శ్రీవిష్ణు వెందు వేం♦చేసినాఁడొ?
ద్వారకావాసుఁడై ♦ధర్మసంస్థాపనం
బొనరించుకృష్ణుఁ డెం♦దున్నవాఁడొ?

గీ. ఆపరంధాముపాదంబు ♦లాశ్రయించి
ముక్తి గాంచెద నన్నయా♦సక్తితోడ
నాశ్రమం బెల్ల వెదకుచు ♦నరుగుచుంటి
నీ వెఱింగినఁ దెల్పుమీ ♦నృపవరేణ్య! 74

చ. తొలి నేఁ జేసినపాప మెట్టిదొ? జగ♦ద్ద్రోహంబుగా జాలికిన్
వెలియై ప్రాణివధం బొనర్చుచు హరి♦ద్వేషంబు మీఱన్ విశృం
ఖలవృత్తిం జరియించినాఁడ నిపు డా♦గర్వంబు శాంతించె నెం
దుల నున్నాఁడు పరాత్పరుండు హరి? నా♦తోఁ జెప్పవా మానవా!

గీ. యదుకులంబునఁ బుట్టిన♦యట్టినీవు
ద్వారకానాథు యదువీరు ♦వాసుదేవు
నెఱుఁగవే? యాతఁ డిచ్చోటి♦ కేగుదెంచెఁ
జాడవే? వచ్చిపోయిన♦జాడ గనవె? 76

గీ. శంకరుం డన్నమాట య♦సత్యమాౌనె?
యీశ్వరునితోంటియాశ్రమ♦మిదియె కాదె?
యనుచుఁ బ్రశ్నించి,హరిమాన ♦మాకళించి
హరిని గన్గొనుదాఁక నిం♦దధివసింతు. 77

వ. అనుచుఁ దనతో నున్నరక్తమాంసంబులు కంఠపూర్తిగా నారగించి తత్పాత్రంబులు మృగయాసాధనంబులు దూరంబుగఁ బెట్టి శృగణంబుతోఁ బిశాచగణంబును వెనుకకుఁ బంపి శుద్ధజలంబుల హస్తపాదముఖంబు గడిగికొని శుచియై యించుకదూరంబునఁ గూర్చుండి విష్ణునామజపంబు చేయఁ దమ్ముని నియమించి తా నొక్కకుశాసనం బేర్పఱచుకొనిసుఖోపవిష్టుండై పరమేశ్వరుపాదారవిందంబు లంతరంగంబునఁ బాదుకొల్పి యంజలి ఘటించి భక్తియుక్తుండై యుమామహేశ్వరోపదేశవిశేషాధిగతవాగ్విభవుం డగుట భవ్యవాక్కుల నిట్లని స్తుతించె. 78

దండకము:-శ్రీసత్త్వసత్యస్వభావా! స్వభావానుభావాంకురత్పంచభూతా! ప్రభూతాత్మ దివ్యామృతానంత తేజోఽనుభాస్వత్సహస్రాంశుభాభాసమానాఖులామేయ చిన్మాత్రవిస్తారితాజాండభాండోదరాంచజ్జగజ్జాలమూలాత్మమాయాప్రవిష్టస్ఫురజ్జీవరూపా! స్వరూపాత్మసంధానవిద్యోతితాద్వైతిభావానుభూతిప్రతీతి ప్రతీతావ్యయానంద! సాకారపాపాసురానికినీపాలకానేకదుర్దానవామూల నిర్మూలనారంభ సంరంభ సంభావనాభవ్యదివ్యావతార ప్రణీతామరస్తోమభూమీసురానంద! గోవింద! బ్రహ్మర్షి దేవర్షులే నిన్నుఁ గాంచంగ నిష్ఠాగరిష్ఠాత్ములై పెక్కువే లేఁడు లష్టాంగయోగంబున దీరినారన్న ఘూధుండనై యోగమో యాగమో దానమో ధర్మమో యేదియు న్లేక నీపాదపద్మంబులం గాంచ నాసించునాసాహసం

బింత యంతౌనె? లోకావనా! పావనా! యాదిమధ్యాంతహీనా! జగత్కారణా! విశ్వరూపా! విరూపాక్షభావంబునన్ లోకముల్ ద్రుంచి యేకార్ణవంబందు నేకాకివై సచ్చిదానందభావస్వయం జ్యోతివై యోగివై యుండి యట్లుండి విశ్వంబు నావిష్కరింపం దలంపూని లోకేశరూపంబుతోడన్ యథాపూర్వభూతప్రపంచంబు నిర్మించునోయాదిదేవా! మహాదేవ! దివ్యప్రభావా! భవన్మాయ లాబ్రహ్మరుద్రాదులే దాటఁగా నేర కున్నారనన్నాకు దిక్కేమి? నీపాదపద్మంబులే దిక్కుగా నాకు ముక్కంటి చూప న్నినుం జాడ నీవాడ కేతెంచి యున్నాఁడ రక్షింపుమోదీనరక్షా! నమస్తే నమస్తే నమః.

చ. అని నిజఘోరపాపపరి♦హారముగా మనసార నాజనా
ర్దనుచరణంబులం దలఁచి♦తత్పరుఁడై సకలేంద్రియప్రవృ
త్తిని మరలించుమంత్రజప♦దీక్షను బూనఁగ నాంత్రిపాశబం
ధనమున మేను గట్టి మదిఁ♦దామరసాక్షుని నిల్పి భక్తిమై. 80

వ. చక్రపాణీ! నీచక్రంబున నాఘోరశరీరంబు సంహారింపుమునిన్నుఁ గొలుచుచు దేవదూతనై యుందు. భక్తకల్పద్రుమమా! జన్మరాహిత్యం బనుగ్రహింపుము. అనుక్షణంబు నీధ్యానంబు దప్ప నా కితర చింత లేకుండ నామానసంబు నిష్కామంబు గావింపుము. పంచభూతంబులు నాపంచేంద్రియంబులు వశీకరించుకొన నాచిత్తంబు భవదాయత్తంబై భవదీయదివ్యనామామృతాస్వాదనంబున మత్తుగొనఁ గటాక్షింపుము. జాగ్రదాదిసకలావస్థల సుఖదుఃఖంబులు రాగద్వేషంబులు మఱచి నాహృదయంబు త్వదీయపాదారవింద లగ్నం బగుటయే నాయభిలషితంబు. దేవదేవా! మహానుభావా! శరణుశరణు, అనుచుం బ్రార్థించి. 81

శ్లో. ఓన్నమో నారాయణాయ
విష్ణవే ప్రభవిష్ణవే
మమ భూయా న్మనశ్శుద్ధిః
కీర్తనా త్తవ కేశవ! 82

వ. అనుచు గొంతెత్తి మువ్మాఱు పఠించి కూరత్రతముండు జాతి హీనుండు నయ్యు నప్పిశాచవీరుం డగుఘంటాకర్ణుం డంతలో భగవద్భక్తిపరవశుండై సర్వేంద్రియనిగ్రహంబుగాఁ జిత్తం బేకాగ్రంబు గావించి నారాయణమంత్రంబు జపించుచుఁ దదేకధ్యానవశంబున సమాధిం బడియుండి యుండినిర్మలాంతఃకరణంబున నీలమేఘ నిభంబు శంఖచక్రగదాఖడ్గాంచితచతుర్భుజంబు కిరీటరమ్యంబు పీతకౌశేయవసనంబు పద్మాక్షంబు శ్రీవత్సకౌస్తుభాలంకృతవక్షంబు నిశ్చలంబు నగుదివ్యరూపంబు సందర్శించి పరమానందంబున దేవా భక్తబాంధవా! దానవాంతకా! దీనరక్షకా! కృతార్థుండ. స్వామీ! నాజన్మ తరించినది. నాపాప మంతరించినది. హాహా! కేశవా! మహానుభావా! విశ్వరూపా! విశ్వాధారా! విశ్వరక్షకా! యనుచు భావంబు పట్టఁజాలక యాంత్రపాశంబు ద్రెంచుకొని లేచి హరిహరీ! కృష్ణకృష్ణా! యనుచుఁ దన్మయత్వంబున నృత్యంబు సలుపుచు నొక్కమాఱు కన్ను దెఱచి తాను మొదటఁ జూచి పలుకరించిన మానవుండే సమాధిలోఁ గన్నమాధవుండై యెదుట గోచరింప హర్షపులకితాంగుఁడై. 83

మ. ఇతఁడే విష్ణు వితండె కృష్ణుఁ డితఁడే♦యీవిశ్వముం బ్రోచువాఁ
డితఁడే నేను సమాధిలోఁ గనినవాఁ♦డీతండెనాపాలదై
వత మీశానుఁడు నాకుఁ దెల్పినకృపా♦పారీణుఁ డీతండె జ
న్మ తరించెం గనుఁగొంటి నంచుఁ బరమా♦త్మా! దాసునిం బ్రోవుమా!

క. అని ముమ్మాఱు ప్రదక్షిణ
మొనరించిసాష్టాంగనతులు♦నొనరించి హరీ!
విను నీమహిమం బెఱుఁగక
మనుజుఁడ వనుకొంటి తప్పు♦ మన్నింపఁదగున్. 85

ఉ. పాపుఁడఁ బాపవర్తనుఁడఁ♦బాపశరీరుఁడఁ బాపబుద్ధి నా
పాపము నిన్నుఁ జూచి ననుఁ♦బాసె,దయారసపూర్ణలోచనా!
పాపవినాశనా! పతిత♦పావన! యీతను వింక మోయఁగా
నోపను నీచజీవనము♦నొల్లను ముక్తి నొసంగుమీ కృపన్. 86

క. పాపం బెడలును బశ్చా
త్తాపంబున నందు రదియ♦ప్రాయశ్చిత్తం
బోపురుషోత్తమ! కాదే
నీపాదాలోకమునఁ బు♦నీతుఁడఁ గానే? 87

సీ. శబ్దపూర్వకసృష్టి♦సాధనవేదంబు
దొంగకు ముక్తి నొ♦సంగలేదె?
సర్వభూమండలిఁ ♦జాపచుట్టగఁ జుట్టు
పాపబుద్ధికి ముక్తి♦ చూపలేదె?
హరిహరీ! యనుభక్తు♦నగచాట్లఁ బెట్టిన
కూరాత్మునకు ముక్తి♦ కూర్పలేదె?
పరమర్షినుతపతి♦వ్రత నెత్తుకొనిపోయి
మొనఁగుకూళకు ముక్తి ♦నీయలేదె?

గీ. నిన్ను నిందించి యెదిరించు♦నీచమతుల
కందఱికి నీవు ముక్తి నీ♦యంగలేదె?
అట్టులే నన్నుఁ జక్రాన ♦మట్టుపెట్టి
దీనవత్సల! యిమ్మ వి♦దేహముక్తి. 88

క. నీమహిమఁ బుట్టె జగములు
నీమహిమనె విశ్వ మెల్ల ♦నిలిచెను దుదకున్
నీమహిమనె యణఁగారును
నీమహిమన నీవ యందు ♦నిగమసిదానా! 89

ఉ. మందర మెత్తినావు నృప♦మండలి నిర్వదియొక్కమాఱు కి
న్కం దునుమాడినావు బల♦గర్వితుఁ దైనబలీంద్రు నుద్ధతిన్
గ్రిందికిఁ ద్రొక్కినావు చెల ♦రేఁగినయాశిశుపాలు దంతవ
క్త్రుం దునియించినావు బహు♦రూపము నీమహిమంబు కేశవా! 90

ఉ. రాతిని నాతిఁ జేసితి భ♦రాజును బ్రోచితి గోపభామినీ
ప్రీతి యొనర్చి తంధునికి ♦విశ్వముఁ జూపితి కుబ్జమేను వి
ద్యోత మొనర్చి తాశబరి♦కుత్తమలోక మొసంగి తుద్ధతా
రాతుల సంహరించితివి♦ద్రౌపదిమానము గాచి తీశ్వరా! 91

చ. కొడుకును గూల్చి తండ్రి కొన♦గూర్చితిరాజ్యము,తండ్రిఁ జీల్చియుం
గొడుకునకున్ సుఖంబు నొడఁ♦గూర్చితి,తల్లి నణంచి తండ్రియా
నుడిపితి,వన్నఁ జంపి యొడ♦యుం బొనరించితి తమ్ముఁ,దమ్ములం
గెడపినయన్నగర్వ మణఁ♦గించితి వేమన నీమహత్త్వమున్? 92

గీ. కశ్యపునిశిక్ష గాంచితి ♦కాలకంఠు
నుపచరించితి కౌశికు♦నొద్ద నేర్చి
తధిగమించితి సాందీప♦నాంతికమున
విశ్వగురుఁడవు నీమాయ♦వేద్య మగునె? 93

క. నీయవతారంబులు నీ
మాయలు లీలలు ననంత♦మహిమలు తెలియన్
నాయట్టివాని కగునే?
మాయామానుషశరీర!♦మహిమాధారా! 94

క. కనుఁగొన వచ్చితి నిన్నే,
కనవచ్చితి వీవె నాకుఁ♦గలలో,నీవే
కనిపించితి విచ్చట,నిం
కను సందియ మేమి? లోక♦కర్తవు నీవే. 95

క. హరిహరి!కృష్ణాకృష్ణా!
మురహర!సురవర!ముకుంద!♦మునిజనవంద్యా!
కరుణింపుభక్తినమ్రుని
శరణాగతవత్సలా!ప్ర♦సన్నగభీరా! 96

వ. అని యాడుచుఁ బాడుచు నవ్వుచు నాట్యంబు సల్పుచు హరినామ సంకీర్తనపూర్వకంబుగాఁ బునః పునః ప్రదక్షిణనమస్కారంబు లాచరించి యెదుర నిలిచివినయవినమితగాత్రుండై బద్ధాంజలియై యిట్లు మానసికపూజావిధానంబున మాధవు నర్చింపఁ గడంగె. 97

సీ. ఆవాహనంబు స♦హస్రశీర్షా!, జగ
ద్వ్యాపకా!రత్నసిం♦హాసనంబు,
అబ్ధిశయాన!పా♦ద్యం బర్ఘ్య మభిషేక,
మంబుదాభాంగ!పీ♦తాంబరంబు,
యజ్ఞఫలప్రదా!♦యజ్ఞోపవీతంబు,
మందారవనవాస!♦చందనంబు,
వనమాలి! సురభిళ♦పత్రపుష్పంబులు
రవిచంద్రనేత్ర! నీ♦రాజనంబు

గీ. కామధేనువుపాలును ♦గల్పవృక్ష
ఫలము నైవేద్య మఖిలజీవ♦నవిధాన!
భక్తరక్షణతత్పరా!♦వందనములు
సర్వలోకేశ! సర్వోప♦చారవిధులు. 98

మ. అని పాదంబుల వ్రాలఁగా హరి యన♦స్యం బైనయాభక్తికిం
దనియం జిత్తము చేతితో నిమిరె ఘం♦టాకర్ణు,వాఁడంత మో
హనరూపంబును దాల్చి యచ్చెరువు నా♦హ్లాదంబు మీఱన్ జనా
ర్దన! దేహంబున మార్పు గాదు భవబం♦ధచ్ఛేదముం జేయుమా! 99

గీ. అనుడు హరి వానిఁ గని నేఁటి♦యమరనాథుఁ
డెంతకాలంబు నాకంబు♦నేలునంత
వఱకు నందుండి నీ వటు♦పైని నన్నుఁ
గలియుదువు పొమ్ము నాకలో♦కమున కనుచు. 100

గీ. ఆదరంబున వర మిచ్చి ♦యతనియనుజుఁ
గాంచి నీ వన్నతోడ నా♦కమున నుండి
నేఁటియింద్రుండు చనినంత♦నీవుశక్ర
పదవి నొందెదు పొ మ్మని ♦పలికి లేచి. 101

శ్రీకృష్ణుఁడు కైలాసశిఖరికేగి తపస్సుచేయుట

క. తనవిడిదికిఁ జని మునులకు
వినిపించెఁ బిశాచకథ స♦విస్తరముగ న
మ్మనుసు లలరి నుతించిరి యం
తన తూరుపు తెల్లవాఱెఁ ♦దత్సమయమునన్. 102

వ. వాసుదేవుండు తాపసోత్తములం గూడి గంగాస్నానం బాచరించి ప్రాతఃకాలానుష్ఠానంబు దీర్చి వచ్చి ప్రయాణోన్ముఖుండై యుండు నంత, మునీంద్రు లతని నాలోకించి మహాత్మా! నీవు చెప్పిన వృత్తాంతంబు విన్నపిదప ఘంటాకర్ణుఁ డెక్కటఁ మోక్షం బెక్కడ? యని మాహృదయం బద్భుతాక్రాంతం బయ్యె. ఘోరజీవనుం డైనవాఁ డొక్కజాములో నిన్ను భక్తిం దలంచినంతనే వానికి స్వర్లోకసౌఖ్యం బబ్బనే? అంతయత్యల్పకాలంబున వాని కట్టిమన

శ్శుద్ధి గలిగించినది నీయనుగ్రహంబు గాక వేఱేమి? చిత్తశుద్ధి లేక నీయనుగ్రహంబు రాదందురుగాని, నీయనుగ్రహంబు లేక చిత్తశుద్ధి గలుగ దనియుఁ గర్మపరిపక్వం బైనఁగాని నీయనుగ్రహంబు రా దనియు విదితి మైనది. మే మెంతకాలంబునుండియో తపోయోగనిష్ఠమై యుండ నేఁటికిఁ గదా నీదర్శన మైనది! ఆహా! అతండు పిశాచకులుం డైననేమి! ప్రాణిహింసకుఁ డైననేమి? నిన్నొకఁగక చూచియు నంతలోనే నిర్మలచిత్తుండై సంయుఁడై నిన్నంతరంగంబునఁ గాంచఁ గల్గుటకుఁ గారణంబు వానికర్మంబు పరిపక్వం బగుటగదా! దేవా! యింతటినుండి ఘంటాకర్ణునుదంతము మనశ్శుద్ధిబోధకంబై లోకంబున వ్యాపించుఁ గాక. మహానుభావా! నమస్కారము. అని ప్రస్తుతింప నతండు దరహాసవికసితాననుండై యందఱి నొక్కమాఱు వీక్షించి మీ రందఱు కైలాసంబునకు రండని సెలవిచ్చి గరుడవాహనం బెక్కి కైలాసాభిముఖుండై వెడలె. 103

సీ. శివుఁ గొల్చి మున్ను దాఁ ♦ జెందెఁ జక్రం బెందు
భార్గవుం డస్త్రముల్ ♦ వడసె నెందు
నలినగర్భుశిరంబు ♦ నఱికె హరుం డెందు
పౌలస్త్యుగర్వంబు ♦ తూలె నెందు
గణదేవతలు కాల ♦ కంఠుఁ గొల్చెద రెందు
యోగసిద్ధమహర్షు ♦ లుందు రెందు
రాజరాజేశ్వరా ♦ రాధకుం డగు నెందు
పుణ్యతరంగిణుల్ ♦ పొడము నెందు

గీ. అట్టికైలాసగిరిమీఁది ♦ కవతరించి
మానసానందకర మగు ♦ మానసంబు
నుత్తరతటంబుఁ జేరి య ♦ య్యోగివరుఁడు
ద్వాదశాబ్దతపశ్చర్య ♦ తలఁపుచేసి. 104

సీ. పరిచర్య లొనరింప ♦గరుడచక్రాదులు
నిత్యాగ్నిహోత్రంబు♦ నెఱపుచుండి
యబ్దక్రమంబున♦నాహారనియమంబు
పాటించి ఘోరత♦పం బొనర్చి
కడపటినెల నత్రి♦కశ్యపాదులఁ గూడి
భక్తి నారణ్యక♦పఠన సల్పి
ప్రణవపూర్వక మైన♦పంచాక్షరి జపించి
యగ్నిఁ బూర్ణాహుతి ♦నాచరించి
గీ. ఈశ్వరధ్యాననిరతుఁడై ♦యెసఁగునంత
ధ్యేయుఁ డైనట్టికృష్ణుండు♦ధ్యాత యయ్యెఁ
గనుచుఁ జూడంగ నచ్చటి ♦కమరసిద్ధ
సాధ్యగణములు వచ్చె నా♦సమయమందు. 105

సీ. గంగాతరంగసం♦గతసుధాకరఖండ
శోభితం బగుజటా♦జూట మలర,
డిండిమదర్భకుం♦డీదీపికాశూల
భూషితం బగుచతు♦ర్భుజము లలర,
నాగేంద్రరుద్రాక్ష♦నాగచర్మవిభూతి
దీపితం బగుదివ్య♦దేహ మలర,
అఖిలప్రపంచమూ♦లాధారశక్తి యీ
శ్వరి తనవామపా♦ర్శ్వమున నలర,
గీ. మునులు ముందును భూతాళి♦వెనుక నడవఁ
గర్మమోటులు రెండుప్రక్కలను నడవ
వృషభవాహనుఁ డగుచు వి♦శ్వేశ్వరుండు
గరుడవాహనుఁ జూడంగఁ♦గదలె నపుడు. 106

గీ. శివుడు కదలంగఁ గైలాసశిఖరి కదలె
ననఁగ నందలివారెల్ల ననుగమించి
వాసుదేవుని జూడఁగ వచ్చియున్న
యమరగణములఁ జేరి రయ్యవసరమున. 107

ఉ. వారును వీరు నేకమయి వాహినులట్టులు,భక్తిగౌరవో
దారతరంగపంక్తులు హృదంతరసీమల వెల్లి వాఱ నో
ఙ్కారము వేదమూలము జగన్నిలయంబును సర్వసృష్టిసం
హారకరంబు నాహరిహరాత్మకతత్త్వముఁ గాంచి యుబ్బుచున్.

శ్లో. జయ దేవ జగన్నాథ! జయ రుద్ర జనార్దన!
జయ విష్ణో! సరోజాక్ష! జయ శంభో! త్రిలోచన! 109
జయ కౌస్తుభదీప్తాఙ్గ!జయ భస్మవిరాజిత!
జయ శంకర! గౌరీశ!జయ గోవిన్ద! మాధవ! 110
చక్రపాణే జయానన్త!శూలపాణే జయాభవ!
వాసుదేవ! మహాదేవ! సనాతన! హరే! జయ! 111

—హరుఁడు హరికి దర్శనమిచ్చి పుత్త్రవర మొసఁగించుట—

గీ. అనుచు నుతియించుచుండ వాహనము డిగ్గి
యీశ్వరిం గూడి తనచెంతకే గుదెంచు
నీలలోహితుఁ గాంచి సికర్ణిద్రభక్తి
నీలగాత్రుండు శిరమునకే గేలుమోడ్చి. 112

శ్లో. నమ శ్శివాయ శాన్తాయ ప్రణవాయ పరాత్మనే
నమ ఆద్యాయ బీజాయ శఙ్కరా యాష్టమూర్తయే
హరా యానన్తరూపాయ శక్తియుక్తాయ శూలినే
విశ్వాయ విశ్వనాథాయ విశ్వకర్త్రే నమోనమః. 114

చ. అనుచు నమస్కరించి నిగమాగమమూర్తి నిను న్నుతింప నె
వ్వనితర మీశ్వరా!హృదయపద్మమున న్నినుఁ బాదుకొల్పి పే
ర్మిని భజియించుచుంటిని సమీహితసిద్ధి యొనర్చి భక్తునిం
దనుపు మనంగ శంకరుఁడు తత్కరముం దన కేలఁ బట్టుచున్. 115

క. ఏమిది విపరీతము!నీ
వేమి?తపం బేమి?వరము లిచ్చెడినీవే
కామితసిద్ధికిఁ దాపస
భూమిక ధరియించినావె?త్రిభువనాధీశా! 116

చ. తనయునికై తపించువనితామణిరుక్మిణికోర్కి దీర్చెదీ
క్షను దప మిట్లొనర్చితివి కాని,యొసంగితిఁ దొల్లి నీకు నం
దనవర మట్లు తప్పదు జనార్దన!నీ కెఱిఁగింతుఁ దత్ప్రస
క్తిని విను మంచుఁ జెప్పఁదొడఁగెన్ మునిదేవగణంబు మెచ్చఁగన్.

సీ. తండ్రియానతిని భూధరరాజపుత్రి యా
సతి నాకుఁ బరిచర్య సల్పుచుండఁ
గృతయుగాదిని నేను జితమానసుండనై
నిశ్చలం బగుతపోనిష్ఠ నుంటిఁ
దనమనోరథసిద్ధి దలఁచి యింద్రుండు నా
తప మణంపఁగఁ బుష్పధన్వు నంపఁ
గుటిచేసి నాపైని గుసుమాస్త్ర మాతండు
పఱపి నాకోపాగ్నిఁ భస్మమయ్యె

గీ. అపుడు దానికిఁ గారణ మాత్మఁ దలఁచి
నాకలోకేశు నాలోచనంబు తెలిసి
నిరపరాధుండు మన్మథుమరణమునకు
జాలిపడునంతలోఁ బద్మసంభవుండు. 118

వ. అతిరయంబున హంసవాహనారూఢుండై నాసన్నిధి కరుదెంచి బద్ధాంజలియై. 119

చ. జరిగినదాని కిప్పుడు విచార మదేల మహేశ్వరా!రతీ
శ్వరుఁ డశరీరుఁ డయ్యు సుమసాయకుఁడై త్రిజగంబులందు సం
చరణ మొనర్చి కామపురుషార్థము నిల్పఁగ,భూమిపై మహా
పురుషునిపుత్రరత్న మయి పుట్టివెలుంగ ననుగ్రహింపుమీ! 120

చ. అని నను వేఁడ మే లనుచు నప్పుడె తొంటివరంబు దీరఁగా
ననుమతి యిచ్చి,ద్వాపరమునం దభిజాతులు రుక్మిణీజనా
ర్దనులమనోరథంబు ఫలితంబుగఁ బుట్టెడు భూమి నంచుఁ ద
క్కినవర మిచ్చినాఁడ,నెఱిఁగించితిఁ గాని యెఱుంగవే హరీ? 121

శివుఁడు దేవాదులకు విష్ణుతత్త్వ మెఱిఁగించుట.

క. అని పలికి హరుం డచ్చటి
మునివరగంధర్వసురసమూహము వినఁగా
వినుతించె విష్ణుతత్త్వం
బనితరవేద్యంబు సచ్చిదానందంబున్. 122

చ. కనులకు గోచరించునది గాక మఱొక్కటి లే దటంచు నీ
కనఁబడుదానికిం బ్రకృతి కారణ మంచును దేహభిన్నుఁడై
తనరును వేఱొకం డనుచుఁ దదవ్యతిరిక్తుఁ డొకండు కర్తయం
చును వివిధంబుగాఁ దలఁచుచుందు రెఱుంగక విష్ణుతత్త్వమున్. 123

చ. "అనవరతంబు నీవు కనులారఁ గనుంగొని వీనులారఁగా
విని మనసారఁగా ననుభవించిన దెల్ల నశించు దీని నం
తను వెలయించు నొక్కపరతత్త్వమె సత్య"మటంచు నెంత చె
ప్పిన విపరీతవాద మని వీఱిఁడి పల్కుఁడె? వేత్త పల్కునే? 124

చ. తెలియఁడుగాక మందమతి దీనిరహస్యము, తెల్వి యింతయేఁ
గలిగిన దీని కంతకును గారణ మొక్కటి యుండి తీరునాఁ
దలఁపడే? లేకయున్న విభవం బగునే బహునామరూపసం
కలితచరాచరాత్మకజగంబు తలంపన యుప్పతిల్లునే? 125

చ. కదలునె గంధవాహుఁడు జగత్పతిశాసనభీతి చెందకే?
బొదలునె కర్మసాక్షి? శశి పొల్చునె? భూమి పరిభ్రమించునే?
చదల నుడువ్రజంబు దిగజారక నిల్చునె? యగ్ని మండునే?
యుదధులు వేల నాఁగునె? యహో జగ మంతయు నిట్లు సాగునే? 126

చ. అవగత మైనవిశ్వమున కంత కనాది యనంతుఁ డాస్వయం
భువు విభుఁ డాదివిష్ణు వగు మూల,మతండు గుణత్రయాత్మకం
బవునిజమాయఁ జొచ్చినఁ దదద్భుతశక్తిని బంచభూతసం
భవభువనంబు లేర్పడియె మాయి యటందురు దాన నీశ్వరున్.

క. ఆవిష్ణువుసత్వాంశం
బీవిష్ణువు, తామసాంశ మేను,రజోఽంశం
బావిధి,సృష్టిస్థితిలయ
భావన మే మందు మిదియ పరమార్థ మగున్. 128

ఆ. ఆదివిష్ణు వనఁగ నాపరబ్రహ్మంబు
సర్వసంగతుండు సర్వసాక్షి
ప్రత్యగాత్మ యైన పరమాత్మ యాతండె
కర్మభోక్త యైన కర్త యతఁడె. 129

సీ. అతఁడు సహస్రశీర్షాక్షి సహస్ర స
హస్రపా దోరు సహస్రభుజుఁడు,
అతనిమూర్ధంబున నాకాశ ముదయించె
నగ్నిందుర్లు లుదయించి రతనినోట,

అతనికన్నుల సహస్రాంశుండు జనియించెఁ
జిత్తంబునం బుట్టె శీతకరుఁడు,
అతనిప్రాణంబున ననిలంబు పుట్టెఁబా
దంబుల ధరణి; శ్రోత్రముల దిశలు,

గీ. అతనివదనభుజోరుపాదతలమందు
వరుసగాఁ బుట్టె నాలుగువర్ణములును
బంచభూతంబు లాతనిప్రకృతు లట్టి
విశ్వరూపుం డతండు సర్వేశ్వరుండు. 130

సీ. విశ్వవిశ్వవ్యాప్తివిష్ణుఁ డయ్యె నతండు
హరి యయ్యె హరుఁ డయ్యె హరణశక్తి,
నారసంవాసియై నారాయణుం డయ్యె
శంకరుం డయ్యె శివంకరేచ్ఛ,
విధివిష్ణురుద్రప్రవృత్తిఁ గేశవుఁ డయ్యె
నింద్రియేశత హృషీకేశుఁ డయ్యె,
వేదత్రయక్రమవిధిఁ ద్రివిక్రముఁ డయ్యె
నీశ్వరుం డయ్యె భూతేశుఁ డగుట,

గీ. వివిధవిద్యలు గాంచి గోవిందుఁ డయ్యె
సమధికానందమూర్తియై శంభుఁ డయ్యెఁ
ద్రిజగదావాసమై వాసుదేవుఁ డయ్యె
నణు వగుచు వామనుం డయ్యెఁ బ్రణవ మయ్యె. 131

గీ. అతనిమహిమను వెలసినయఖిలజగము
లతనియందె విలీనంబులగు నిజంబు,
సర్వవిధకార్యకారణజాత మైన
యాతఁ డొక్కండె తథ్య మన్యంబు మిథ్య. 132

క. తనయందు జీవరాశిం
గనుచుం దను జీవరాశిఁ గనుచుం దనుఁదాఁ
గనువాఁడు నేన నేనే
యనుకొని బ్రహ్మాహ మస్మి యని సుఖయించున్. 133

క. ఇది యాదివిష్ణుతత్త్వం
బిదియే వేద్యంబు దీని నెఱిఁగినయతఁడే
మదిఁ దన్నుఁ దా నెఱింగెడు
నది జీవన్ముక్తి యందు రాద్యమునీంద్రుల్. 134

హరిహరైక్యప్రశంస

క. హరుఁ డిట్టు చెప్ప నందఱు
హరి హర కేశవ శివా జనార్దన శంభూ!
పరతత్త్వజ్ఞానంబునఁ
జరితార్థుల మైతి మనుచు సంతోషమునన్. 135

వ. సర్వజ్ఞుం డగునమ్మహేశ్వరుం డుపదేశించినపరమాత్మతత్త్వం బంత రంగంబునఁ జింతించుచు హరిహరాత్మకపరమాత్ముని కనేకసాష్టాంగ నమస్కారంబు లాచరించి పరమానందవికసితవదనారవిందులై చేతులు జోడించుకొని నిలిచి రంత నీశ్వరుండు మఱియు వారి నెల్లర నుద్దేశించి— 136

చ. వినుఁడు శివుండు విష్ణు వను భేదము లే దని నమ్ముఁ డీజనా
ర్దనుఁడును నేను నొక్కటి యథార్థ, మితండు తపంబున న్ననుం
గనినది లోకసంగ్రహము గాఁ దలపోయుఁడు, కృష్ణుఁ డేమి? నం
దనుఁ గనుకోరికం దప మొనర్చుట యేమి? నిజం బెఱుంగుఁడీ!

వ. అని సదాశివుండు తమయేకత్వం బెఱిఁగించినంత సకలదేవదేవ యోనియోగీంద్రమునీంద్రు లందఱు నైకకంఠ్యంబుగా హరిహరాత్మ కతత్త్వం బిట్లు స్తుతియించిరి. 138

శ్లో. సర్వాణి శివనామాని విష్ణునామాని సర్వశః
అర్థత శ్శబ్దత శ్చాపి నాస్తి తేషాం భిదా క్వచిత్, 139
మహేశ్వర శ్శివ స్సాక్షా ద్విష్ణు స్స్యా జ్జగదీశ్వరః
జనార్దనో హరి స్సత్యం రుద్ర ఏవ జనార్దనః 140
అనయో రంతరం నాస్తి ద్వా వేతౌ పరమేశ్వరః
పరం బ్రహ్మ పరం ధామ పరమాత్మా హరో హరిః,
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
మహావిష్ణుస్వరూపాయ మహితాయ నమోనమః 142

గీ. అనుచు వినుతింప నీశ్వరుం డాలకించి
భక్తవరులార! మీకిదే పరమధనము
సర్వతపములు జపములు సకలవిధులు
నిదియె, మోక్షంబునకు మార్గ మిదె నిజంబు. 143

చ. హరి పరమేశ్వరుం డొకఁ డెయుండ దటికోర్కెలు తీర్చువాఁడు,స
త్స్మరణమె చేయుచుండుము సదా మది నీతఁడు నేనుఁ గాన సు
స్థిరమతి భక్తియోగనిరతిన్ భజియింపుఁడు ముక్తికాంక్షమైన్
బరమదయాపయోధి శరణాగతవత్సలు నాదివిష్ణువున్. 144

క. అని పలికి వారి కందటి
కిని జన నానతి యొసంగి కృష్ణునిబుజముం
గొని యేగు మింక నేనుం
జనియెద నని చెప్పి వెడలె సగణుం డగుచున్. 145

గీ. అంతఁ గృష్ణుండు శంకరు నాత్మఁ దలఁచి
పుత్త్రవరలబ్ధిఁ జిత్త ముప్పొంగుచుండ
నరుగుదెంచిన త్రోవనే యమరల బదరి
కాశ్రమముఁ జేరె గరుడవాహనము నెక్కి. 146

క. అని చెప్పిన వైశంపా
యనమునిఁ గని కౌరవాన్వయాభరణుం డా
జనమేజయుండు యదునం
దనుపిమ్మటివృత్తమెఱుఁగఁగోరుచుఁ దలఁతు ననుటయున్. 147

ఇది

బ్రహ్మసూత్రార్థదీపికారజోఽనన్తర వివాహసంస్కృత కృతికర్తయు
శ్రీ చర్ల బ్రహ్మయశాస్త్రి గురువరకరుణాధీతపాణినీయుఁడు
శ్రీ మంథా చెన్నయశాస్త్రి గురుపాదకరుణాధీతోత్తర
మీమాంసుఁడునగు మల్లాది సూర్యనారాయణశాస్త్రి
రచియించిన యాంధ్రభవిష్యపర్వమునందు
చతుర్థాశ్వాసము.



# ఆంధ్రభవిష్యపర్వము.

## పఞ్చమాశ్వాసము.

శ్లో॥ సన్మయంకల్పితాజాండః, తన్మయంచిన్మయంమహః
లీలాప్రశమితాధర్మం, కృష్ణస్త్వంస్మరామ్యహమ్. 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

గీ. వాసుదేవుండు బదరికావనమునందు
జాహ్నవీతీరపావనాశ్రమములందు
భక్తిపరవశులైనతాపసులకోర్కి
సంతసంబునఁ గొన్నివాసరము లుండె. 3

వ. ఆసమయంబునఁ బౌండ్రకరాజస్థానంబున. 4

### పౌండ్రకునిగర్వోక్తులు

ఉ. పోరికిఁ బేరుపడ్డబలుపోటరి రాజుల నోర్చి వారికై
వారము లందుమేటి యదువంశజిగీషువు వాసుదేవుఁడ
న్పేరిడుకొన్నమచ్చరి వివేకవిహీనుఁడు పౌండ్రకుండు దై
త్యారి నణంచుపూన్కి యెగయన్ సభవారలఁ గాంచి యిట్లనెన్.

చ. ఇలఁ గలరాజు లందఱి జయించితిఁ గాన్కలు గొంటిఁ గాని వృ
ష్ణులు పొగరెక్కి నాకడిమిచూడక యుండిరి కృష్ణు నమ్మి,యా
ఖలుఁడును శంఖచక్రములుఖడ్గగదాధనురాదిసాధనం
బులు నెద నమ్మి గర్వమునఁబొంగుచు నన్ను గణింపఁ డెయ్యెడన్.

ఆ. పులిని బోలఁ జూచి తెలివితక్కువనక్క
వాత లెట్టుకొన్నరీతి నతఁడు
నన్నుఁ బోలఁ జూచి నావాసుదేవుఁడ
న్పేరు పెట్టుకొనియెనీతిమాలి. 7

సీ. అస్థినిర్మిత మైనస్థియతనిశంఖం బీడె
సహజ మైనట్టినాశంఖమునకు?
పాఁతగిల్లినవానిఁ దోఁతచక్రం బీడె
సరికొ_త్త దైననాచక్రమునకు?
మొక్కపోయినవాని మొద్దుఖడ్గం బీడె
కడవాయిదేలునాఖడ్గమునకు?
తుప్పుపుట్టినవానిఁ చప్పిడిగద యీడె
నూతనం బైననాచేతిగదకు?
గీ. కొమ్మువింటికి సద్వంశజమ్మువింటి
కేమిపోలిక? చెప్పెడి దేమి యింక?
నాదుపరమాయుధంబులయాదవేంద్రు
మట్టుపెట్టెదఁ దప్ప దీమాట నిజము. 8
చ. వసుధను వాసుదేవుఁ డనఁ బౌంద్రమహీంద్రుఁడ నేను గాక యా
తసుకులమారిగోపవనితావిటధూర్తుఁడు వాసుదేవుఁడే? *
యసమపరాక్రమార్జిత జయంబుల నేనును జక్రపాణి నా
పసులను మేప డొంకిగడ పట్టిన యాతఁడుఁ జక్రపాణియా? 9
గీ. కన్ను గానక కృష్ణుండు తన న్నెఱుఁగక
న న్నెఱుంగక వర్తించుచున్నవాఁడు
వాని నేఁ జక్కఁబెట్టెదఁ గాని యిప్పుడు
సభ్యులార! వినుండు నాశాసనంబు. 10
చ. ఇది మొద లెల్లవారలు నహీనబలు న్నను నొక్కనిన్ మహీ
విదితుని వాసుదేవుఁ డని పిల్వఁగ నొప్పను, గాని కృష్ణు దు
ర్మదు నిఁక వాసుదేవుఁ డనరా దిది తప్పితి రేని మీకుఁ ద
ప్పదు పదివేలనిష్కములబంగరుదండుగ చెప్పితిం గదా! 11

* తసుకులమారి గొల్లతలదాసుఁడు చోరుఁడు వాసుదేవుఁడా? పా. అం.

చ. అనుడు సదస్యులందు సచివాప్తపురోహితు లెల్ల మేలు మే
లని మెలుఁగెత్తి యాజ్ఞఁ గొనియాడిరి,శూరులు కొందఱేము కృ
ష్ణునిపయి కెత్తి వత్తు మనఁజొచ్చిరి,కొందఱు రాజు లేమిశా
సన మని సిగ్గు చెందియును జల్లగ నూరకయుండి రత్తఱిన్. 12

గీ. సకలలోకవిహారి తాపసికలమారి
తత్త్వవిజ్ఞాత లోకవృత్తాంతవేత్త
నారదమహర్షి కైలాసనగమునుండి
వచ్చి యచ్చట దర్శన మిచ్చె నంత.

నారదుఁడు పౌండ్రకుని నిరసించుట

ఉ. అందఱు వేచి భక్తివినయంబుల మ్రొక్కుచు మానిదీవనల్
పొందఁగ, నాతిథేయవిధిపూర్వకముగా మునినాథుఁ బైఁడిగ
ద్దెం దగ నిల్పి పౌండ్రకుఁడు దేవమునీశ్వర! నీవు పోనిచో
టెందును గల్లఁ బో దనుచు నెంచితి నీ కొకమాట చెప్పఁగన్.

చ. అని మది సిగ్గు లేక తమయంతర మేని యెఱుంగ కాతఁడో
మునివర! నీవు నిత్యమును బోయెడిచోటుల నెల్లఁ బౌండ్రకుం
డనునరనాథుఁ డొక్కఁడె సమస్తజగంబున వాసుదేవుఁడా
జనపతి చక్రపాణి యని శార్ఙ్గి యతం డని చెప్పుచుందుమా! 15

చ. మహితుఁడు భూతలేంద్రుఁ డనమానయశోరుచిరప్రతాపధూ
ర్వహుఁడు విశిష్టరాజకులపాంసనవర్తనశత్రుదుర్మదా
పహుఁ డత డొక్కఁడే యనియు "పౌండ్రమహీశసమాన రేశ్వరో
నహి" యనియున్ సమస్తభువనంబుల నెల్లెడఁ జాటిచెప్పుమా!

క. సమయజ్ఞుండవు గావున
సమయమునకు వచ్చినావు సంతస మయ్యెన్
శ్రమ యిచ్చితి సంయమివర!
క్షమియింపుము తెలుపు మీ నిజస్థితి జగతిన్. 17

చ. కలఁ డనుకొంకు యాదవుని గన్గొని వేఱొకవాసుదేవుఁ డీ
యిలపయి, నాదుపేరు ధరియించినయంతనె, ధైర్యశౌర్యదో
ర్బలముల వాఁడు నాకు సరివచ్చునె? నీ కిది విప్పి చెప్పఁగా
వలయునె? వాసుదేవుఁ డనఁగ న్దగె నీవును నల్లగొల్లనిన్. 18

సీ. అశ్వసందోహమా హతవాయువేగంబు,
కరియూథమా మహీధరదృఢంబు,
స్యందనవ్యూహమా సర్వతోగమనంబు,
భటసంఘమా కాలభటనిభంబు,
ఘనరాజబృందమా గాంగేయకల్పంబు,
శస్త్రాస్త్రజాలమా సారతరము,
సచివాప్తవర్గమా సర్వసమర్థంబు,
కాలమా యుద్ధానుకూలతమము,

గీ. ఇన్నిటం జేసి నేఁ డెల్లి యెత్తి వెడలి
కృష్ణుతో వృష్టివంశంబు గీటణంచి
ద్వారకాపురిఁ గాల్పించి తరలి వత్తుఁ
జెప్పు మీమాట కనఁబడ్డ జీవి కెల్ల. 19

వ. అన విని నారదుం డశ్రావ్యదురాలాపనిరాసనూచకంబుగా నపహ
సించి. 20

చ. హరిహరి! యెంతమాట వినవయ్యె?ని దెంతటిదుర్మహూర్తమో?
యరి యగుఁ గాక నీకు హరియైనను నీ విటు లాడవచ్చునే?
సరసిజనేత్రుమీఁదఁ బగఁ జాటినమాటలపాప మంతయున్
సరసిజమిత్రుమీఁది కెగఁజల్లినదు మ్మయి నీతలం బడున్. 21

ఉ. ఎక్కడివాసుదేవజగదీశ్వరుఁ డెక్కడినీవుపౌండ్రకా!
యెక్కట! క్రొవ్వి యిట్లు తెగనాడుదె? యెత్తిన వెండి వత్తువే?
కుక్క మొఱుంగుఁ గాక మదకుంజరముం గని చెంత కేగునా?
తక్కక యేగనేని మఱి దానికరాహతిఁ దప్పి వచ్చునా? 22

గీ. సర్వలోకంబు తనయందుఁ సర్వమందు
తాను నుండుట,వసుదేవుతనయుఁ డగుటఁ,
గేశవుఁడు వాసుదేవుఁడై సత్కీర్తి కెక్కెఁ
దలఁచుకొ మ్మర్థ మాపేరుతగునె నీకు? 23

గీ. చక్రి నని శార్ఙ్గి నని కొంకుజంకు లేక
కాఱుకూఁతలు కూసెదు కాని నీవుఁ
జక్రి వైతేని కుమ్మరిచక్రి కాఁడె?
తొండ మున్నంత దోమ వేదండ మగునె? 24

గీ. పట్టఁ బగ్గాలు లేకుండ మిట్టిపడిన
యతిదురాత్ములు నరకాసురాదిఖలుల
కెట్టిదుర్గతి పట్టెనో యెఱుఁగ వొక్కొ?
నిఖిలజగదీశు నెదిరింప నీతరంబె? 25

చ. పలుకులు వేయు నేల విను పౌండ్రక!నీవును నీబలంబులున్
శలభములట్టు లాభువనశాసనుకోపలయానలంబునన్
మలమల మాఁడిపోవుదు రవాంతముగా నిది నిశ్చయంబు,పె
ద్దలు నినుఁ జూచి నవ్వుదురు తప్పదు,పొ మ్మిఁకఁ జెప్ప నేటికిన్?

క. అని పలికినఁ బౌండ్రుఁడు మదిఁ
గనలియు నేమైన నెదురుగాఁ బల్కిన న
మ్మౌని కోపించి శపించెడు
ననుభయమున శాంతచిత్తుఁడై యిట్లనియెన్. 27

క. శాపాయుధుండ వని నేఁ
గోపము దిగమ్రింగి యూరకుంటి మునీంద్రా!
యీపాటి కేగు మీ వని
చాపలమున నతఁడు కొల్వు చాలించి చనెన్. 28

-- నారదుఁడు పౌండ్రకు నవినయంబు కృష్ణునికిఁ దెల్పుట. --

ఉ. నారదుఁ డంతఁ గామగమనంబున శ్రీహరి యున్నచోటికిన్
జేరి ముకుంద! యే మనుచుఁ జెప్పెదఁ బౌండ్రుఁడు దుర్మదాంధుఁడై
ద్వారకమీఁది కెత్తి చను వాఁడయి యంతటఁ జాటుమంచు నన్
గోరినవాఁడు, వానిచెడుకూఁతలఁ జిల్లులువోయెఁ గర్ణముల్. 29

గీ. వాసుదేవుండ నే ననువాఁడు తనదు
శంఖచక్రగదాఖడ్గచాపములకుఁ
బాంచజన్యాదిసంజ్ఞ లేర్పఱచుకొనియెఁ
జిత్ర మిది వాఁడు నొకశబ్దసృష్టికర్త. 30

క. అతని దురాలాపంబులు
ప్రతిహతముగ దుష్టగర్వపరిహారముగా
క్షితిపతులయెదుట దూషిం
చితి నైనను మొండి కేమి సిగ్గు? మహాత్మా! 31

చ. అనుడు మురారి యోను నిజమాబలదర్పితు దుష్టచింతనం
బును మును నే నెఱుంగుదు నపూర్వము గా దిది తాపసోత్తమా!
కనియెదుగాక రే పతనికాయము ముక్కలు ముక్కలై పడన్
వినియెదు గాక నన్నతఁడు పేర్మి నుతింపఁగ నింద్రుకొల్వునన్.

ఆ. అనిన నమ్మునీంద్రుఁ డానందమునఁ జనె
హరియు నాశ్రమంబునందు యుండె
నిచటఁ బౌండ్రకక్షితీశ్వరుం డప్పుడె
జైత్రయాత్ర పురిని జాటఁబంచి. 33

-- పౌండ్రకుఁడు ద్వారకపై దండెత్తుట. --

క. పదివేలరథంబులు ని
ర్వదివేలతురంగ మత్తవారణములు న
ర్బుదపత్తిబలంబులు గొని
కదలె రథం బెక్కి చక్రఖడ్గాదులతో. 34

చ. అతనికిఁ దోడుగాఁ గదలిరంగబలంబులఁగూడి శౌర్యద
ర్పితు లగునేకలవ్యపృథివీవరముఖ్యనరేంద్రు లప్పు డు
ద్ధతగతివాహినుల్ నడవ ధారుణి కుంగినచోట్లు వారణ
ప్రతతులదానధారల భరంబున వాహిను లయ్యె వింతగన్. 35

చ. ఇనుఁ డపరాద్రికేగుతఱికెల్లబలంబు నగంబుమేర దాఁ
టెను, భటు లంత నెత్తుదివటీలవెలుంగు దినేశకాంతియై
యనువు పడంగ రేయి పగలయ్యెను, మృత్యువు జుట్టుపట్టి యీ
డ్చినగతి దండు లన్నియును జెచ్చెర సాగె నవార్యవేగమై. 36

ఉ. ఘోరతరాస్త్రశస్త్రములు కుప్పలువోసినబండ్లు వెంబడిన్
వారణయోధవార మిరువంకల నాశ్వికకోటి ముందు నో
ప్పారఁగ నర్ధరాత్ర మగునప్పుడు పౌండ్రుఁడు ద్వారకాముఖ
ద్వారము డాయ వచ్చి నృపవర్గము నచ్చట నిల్పి యిట్లనెన్. 37

ఉ. మీరును మీబలంబులు సమిద్ధబలోద్ధతిఁ బశ్చిమాదిక
ద్వారము లాక్రమింపుఁ డనివారణ మే నిటు లేగి యుత్తర
ద్వారము ముట్టడించెదఁ బదం డని తాఁ జనె మేరుధీరుఁడై
వీరభటాహతప్రథనభేరులు మ్రోఁగుచునుండ నత్తఱిన్. 38

చ. అది విని పౌరవర్గ మకటా! యిది యే మని భీతి నొందఁగా
యదుకులవీరశేఖరు లహా! కుటిలాత్ముఁడ పుండ్రరాజు దు
ర్మదమున వచ్చె నంచుఁ బురరక్షణసాధనతీవ్రచిత్తులై
కదలిరి నాల్గువైపుల కఖండరుషారుణభీషణాస్యులై. 39

వ. ఆసమయంబున. 40

గీ. "పరభయంకరపౌండ్రకవాసుదేవ
భూతలేశుండు మీతోడఁ బోరవచ్చె
వెడలి రం డింక యాదవవీరులార!
రానిచోఁ గప్ప మంపించి బ్రతికిపొండు." 41

క. అనుఘోషణతోన పురం
బున నాలుగుదెసలనుండి ఘోరనభేరీ
ధ్వని యరుదెంచెను దానికి
నినుమడిగాఁ బటహనాదము మెదఁ రేగె నిటన్. 42

—యాదవ పౌండ్రిక సేనల యుద్ధము.—

వ. అంత బద్ధంబులై యున్న నాలుగుద్వారంబులకు వెలుపలనున్న యాదవసేనలకు పౌండ్రసైన్యంబులకు నొక్కమాఱుగా సంకుల సమరం బారంభంబగుటయు, నుద్ధవుండు రథారూఢుండై సత్వరం బుగ నలుదెసలు పరికించి పశ్చిమద్వారంబుకడ నున్న పరబలంబు పరిమితం బగుట కనిపెట్టి ద్వారంబుల లోపలిభాగంబులు రక్షింపఁ దగినబలంబుల లోపల నలుదెసల నుండ నియమించి పురంబు లోపలితక్కిన సైన్యంబుల నెల్లఁ బశ్చిమద్వారంబున వెలుపలి బంపించి యది మూయించె నప్పుడుగ్రసేనాదిమహావీరు లుత్తర ద్వారంబు చెంతకుఁ దిరిగివచ్చి. 43

ఉ. ఓరిదురాత్మ పౌండ్రక! మహోద్ధతి నీనడురేయి దొంగవై
ద్వారక ముట్టితే? పిఱికిసంజవు నీయడ వీవు గాక దో
స్సారము గల్గువాఁడవే? సంగరధర్మ మెఱుంగువీరులీ
తీరునవత్తురే? యనుచుఁ దేజువతో నెదిరింప నాతఁడున్. 44

శా. ఏఁడీ కృష్ణుఁడు మింటిగొల్లఁడిపుడం దే యాఁగెనా దాఁగెనా?
రాఁడా రాముఁడు త్రాగుచుఁబోతు పొలిమేరల్ దున్నఁగాఁ
బోయెనా?
వాఁడా సాత్యకి వచ్చెనా? పురము గారవం బూనినాఁ డంట! యే
జాడం బోయెనొ యుద్ధవుం డనుచు విస్ఫారంబు గావించుచున్. 45

గీ. విసరె నది వే కలవ్యుని♦విల్లు విఱిచి
యరద మగలింప సత్యకి♦నన్యరథము
నితఁడు వేఱొక్క విల్లందె♦నింతలోన
నిరుబలంబుల పోరాట♦మేపుచెందె. 52

చ. మునుమిడి కామపాలుఁ డరి♦భూపతిసేనలఁ దున్మచుండఁ బొం
దుగ్రిని జలపట్టి సాత్యకి ప♦టుప్రదరంబుల నొంచుచుండె, హె
చ్చినపగ నుద్ధవుండు మద♦సింధురలీలఁ జెలంగి బోయనా
యనిబలగంబులన్ జదుప♦నాతఁడు రౌద్రము మేను దాల్చెనాన్.

సీ. అయి దేసిముల్కులు♦నక్రూరు హార్దిక్యు
"బ్రతుకు జీవా! యంచుఁ♦బఱవఁ" గొట్టె
దశసాయకములను న♦ద్ధవుఁడు "కృష్ణ! యని
పురము దిక్కై పాఱి♦పోవఁ" గొట్టె
తొమ్మిదిక్రూరభ♦ల్లమ్ములసారణుం
డరదంబుపై దొర్లు♦నట్లు కొట్టె
తొంబదికోలల♦తో నుగ్రసేనుండు
వసుదేవుఁ డడలిపో♦వంగఁ గొట్టె

గీ. కారుచిచ్చునఁగాఁ బొలి♦కలను ల్గునా
కడలఁ బుంఖానుపుంఖంబు♦గాఁ బ్రచండ
శరపరంపర లడరింపఁ ♦బరువులెత్తెఁ
బడుచు లేచుచు యాదవ♦భటగణంబు. 54

గీ. ఇట్లు వార్ష్ణేయబలముల♦యే పణంచి
సింహగర్జన మొనరించి♦సీరపాణి
సాత్యకియు నేరి? యని జయ♦శంఖ మూఁదఁ
బౌండ్రుఁ డది విని యుత్సాహ♦భరితుఁ డగుచు. 55

ఉ. ద్వారకవాటముల్ నగరి♦వాకిటితల్పులు పెల్లగించి ప్రా
కారపుగోడ కొట్టి పరి♦ఖం బడఁద్రోసి యవారణంబుగా
ద్వారక కొల్లగొట్టి యదు♦వల్లభు మేడలు గూల్చి తద్ధనా
గారము లెల్ల దోఁచుకొనఁ♦గాఁ జనుఁడీ యని చేయి వీచినన్. 56

వ. సహాయభూపతు లాసన్న యెఱిఁగి తమతమబలంబులం బురికొల్పి
నంత నవి యెల్ల వివిధసాధనసమేతంబులై పఱచి యొక్కుమ్మడి
తూర్పుద్వారంబు కూలఁగొట్టి కోటలోపలఁ జొచ్చె నప్పటియాదవ
బలంబులహాహారవంబులు పెడబొబ్బలు వీరాలాపంబులు విస్ఫారం
బులు భేరీభాంకారంబు లాకాశకుహరం బగలింప నమ్మహాసంకుల
నినాదం బాలకించి సాత్యకి రోషవిషాదవికలాంతరంగుండై యాదెసఁ
దిరిగి చూచి. 57

మ. అవురా! యెంతపరాభవంబు! నగర♦ప్రాగ్ద్వారముం గొట్టి శ
త్రువు దుర్గంబునఁ గాలుపెట్టెనె? య♦దుద్రోహంబు గావించి మృ
త్యువువాతం బడకుండఁ బౌండ్రుఁ డిఁక నిం♦దున్నిల్చునే? నేను శా
త్రవనిర్మూలము చేయకుండఁగ బలి♦ధ్వంసి న్నిరీక్షింతునే? 58

చ. అని పటుకోపవేగమున♦నచ్చటికిం గరదీపికాళి వె
ల్గున నరదంబునం జని ని♦లుండు నిలుండు దురాత్ములార! కృ
ష్ణునిపురి నర్ధరాత్రమునఁ ♦జొచ్చినదొంగలు మీ కిదే ఫలం
బని గురునిం దలంచి యని♦లాస్త్రము నుద్ధతి నేసె నేసినన్. 59

ఉ. దారుణ మద్భుతంబు నగు♦దానికిఁ దాళక శత్రుసైనికుల్
బూరుగుదూదియ ట్లెగిరి♦పోయి నలుంగడ నెందు కూలియే
మైరో రెఱుంగరా, దపుడు ♦యాదవవీరులు తక్కుమూఁక నే
పారఁగ నడ్డగించుటయుఁ♦బౌండ్రుని సాత్యకి దాఁకి యిట్లనెన్. 60

ఉ. పౌరుషశాలివే పిఱికి♦పందవు దొంగవు గాక? యీనిసిన్
ద్వారక దోఁచుకోఁ దలఁచి♦వచ్చితె? నీశల గొట్టి కట్టెదన్
ద్వారమునందు చూడు మని♦దారుణబాణము లైదు కూర్చి నిం
డారఁగ లాగి యేయ నతఁ♦డా శరముల్ తెగఁగొట్టి యిట్లనెన్. 61

సీ. సాత్యకీ నీకునుక్క శరములా? గోవును
మగుడఁ జంపినబంటు♦మాయలాఁడు
యుద్ధంబు వచ్చు నం♦చూహించి ముందుగా
ద్వారకాపురము నీ♦తలకు నెత్తి
కైలాసగిరికిఁ బి♦క్కబలంబు చూపెనే?
కుఱ్ఱకుంకవు నీవు♦కోట గాతె?
కోట గొట్టితి నన్న♦మాట దక్కిన నేమి?
మన్నామచోరుండు♦మడియకుండె

గీ. అట్టియెడ నిన్నుఁ జంప నే♦మగును? పొమ్ము
వద్దు వద్దుండు పౌండ్రిక♦వాసుదేవు
చేతిలో నీవు చచ్చిన♦రీతి తెలిసి
గొల్లభామల మిండఁడు♦కూలుఁగాక. 62

వ. అనిన విని సాత్యకి పట్టరానికోపంబునఁ బెదవు లదర మొగంబు
జేవురింప నాకర్ణపూర్ణశరాసనుండై 63

ఉ. కాలము తీఱె నీకు, నినుఁ♦గాకులు గ్రద్దలు పీకునంతకున్
బ్రేలెదు గాక, నీవు నొక♦వీరుఁడవే? పురి దొంగపోటుగాఁ
గాలిడినంతనే గెలుపు♦గాంచితివే? జగదీశుఁ డిట్టునీ
నాలుక యూడి క్రిందఁబడె♦నా? యని కర్కశకాండ మేసినన్. 64

క. నెత్తురు గ్రక్కుచు నించుక
తత్తఱపడి పౌండ్రుఁ డపుడు♦దారుణకోపా
యత్తుఁ డయి యమ్ము చేకొనె
నత్తఱి బలరాముఁ డచటి♦కరుదెంచుటయున్. 65

గీ. ఏకలవ్యుండు చెచ్చెర♦నేగుదెంచి
రౌహిణేయు నెదుర్కొనె♦రౌద్ర మెసఁగ
నప్పు డారెండుజంటల♦యాహవంబు
భువికి దివికిని గూడ న♦బ్బురముగొల్పె. 66

వ. సాత్యకిపౌండ్రుఁడు లొకరికొకరు తీసిపోక శస్త్రాస్త్రంబులఁబోరిపోరి విరథులై నేల కుఱికి శక్తిగదాతోమరంబుల శక్తికి మీఱఁ బోరాడి పోరాడి జయాపజయంబు లెఱుఁగక యసూయాగ్రహంబుల నంతరంగంబు లల్లాడ మల్లయుద్ధంబునకు దిగి చేతిదెబ్బలు పిడిగుద్దులు మోఁకాలిపోట్లు తన్నులు దండపట్లునుంగా నొడ లెఱుఁగక క్రిందఁబడుచు మీఁదఁబడుచుఁ ద్రొక్కుచుఁ జిక్కుచుఁ బెడగాలుపట్టి గొట్టుచుఁ బెడగేలుపట్టి దొర్లించుచు ధూళిధూసరితాంగులై స్వేదధారలు రక్తధారలుం దొరఁగ నెడతెగక యార్చుచు నిరుబలంబులు వెఱఁగుపడి చూచుచుండ గెలుపోడులు లేక యలసి సొలసి చెఱియొకప్రక్కఁగూలఁబడి రయ్యవసరంబున. 67

గీ. రామరావణులట్టులు♦కామపాలుఁ
డేకలవ్యుండు పోరాడి♦రేమి చెప్ప?
సైన్యములురెంట హర్ష వి♦షాదములకు
నరనిమిషమేని నిలుకడ ♦యబ్బకుండె. 68

గీ. అస్త్రశస్త్రమహాయుద్ధ♦మనఁగ నదియె
ముందు లెక్కింపఁదగు,నట్లు♦పోరుచుండఁ
గొంతవడికి నిషాదులగుంపు♦ మీఁది
కడరుటయుఁ దేరు దిగి యచ్యు♦తాగ్రజుండు. 69

చ. హల మొకచేతఁబూని ముస♦లాయుధ మింకొకచేతఁ బట్టి య
బ్బలమునఁ జొచ్చి గ్రుచ్చి యుసు♦వంకలకుం బడలాగి మోఁది య
ప్పాలికల నెల్ల పీనుఁగుల♦ పోగుల నిండఁగఁ జేయునంత మొ
క్కలుఁడు నిషాదరాజు గద♦ గైకొని క్రిందికి డిగ్గి యుద్ధతిన్. 70

చ. హలిపయి కేగుదెంచె నతఁ♦డప్పుడు పెన్గద పట్టి వానితోఁ
దలపడె వీర లిచ్చట గ♦దాసమరంబొనరించి, రక్కడా
విలమతిఁ బౌండ్ర సాత్యకులు♦ వెండియుఁ బూనిరి మల్లయుద్ధ, మా
చలమును శౌర్యమున్ సమర♦చాతురి వారికి వారికే తగున్. 71

గీ. అమ్మహాద్వంద్వయుద్ధంబు ♦లద్భుతంబు
లగుట నిరువాఁగు నిశ్చేష్ట♦ మయ్యె నప్పుడు,
అవ్వి కనలేక తారక♦ లంతరించెఁ
జూచుకోరికఁ దలయెత్తె ♦సూర్యుఁ డంత. 72

శ్రీకృష్ణుఁడు ద్వారకకువచ్చి పౌండ్రకుని సంహరించుట

గీ. బదరికాశ్రమముననుండి ♦బయలువెడలి
గరుడుపై నెక్కి కృష్ణుండు ♦గడియలోన
ద్వారకాపురిచెంతకుఁ♦ జేరి ఘోర
నాద మాలించి యుద్ధంబు♦గాఁ దలంచి. 73

గీ. వృష్ణియదువీరభటకోటి♦ వేడ్క హెచ్చ
శత్రుయోధబలంబును♦త్సాహ మణఁగ
దిక్కు లెల్లెడ శబ్దంబు ♦పిక్కటిల్లఁ
బాంచజన్యంబు పూరించెఁ♦ బౌరు లప్పుడు, 74

మ. హరిశంఖధ్వని యాలకించి యదునా♦థా!ద్వారకాపాలకా!
కరుణం గావుము నీపురం బనుచు మ్రొ♦క్కన్, మిత్రవర్గంబు సం
బరముం జూపఁగ, శత్రుసైనికులు కం♦పంబొంద,దైత్యారి సం
గరరంగస్థలి డిగ్గి భిన్న మగుప్రా♦గ్ద్వారంబు వీక్షించుచున్. 75

గీ. తన కని దారకుఁ డప్పుడు
కొనివచ్చినయరద మెక్కి♦గురుతరశంఖ
ధ్వని గావించినఁ బౌండ్రుం
డని మాని మురారి నెదుర♦నరదం బెక్కెన్. 76

గీ. అపుడు సాత్యకి తేరికి ♦నడ్డమగుచు
యుద్ధమర్యాద దాఁటుదే♦ యోద్ధ లేని
పోర నను గెల్చి పోవుట ♦పొసఁగు నీకుఁ
గానిచో నిన్ను ముందుకుఁ♦గదలనీను. 77

క. అని గద చేకొని త్రిప్పఁగ
ననుజన్ముని బిలిచి కృష్ణుఁ♦డాఁగుము నీచె
ప్పినది నిజం బైనను వా
నిని విడువుము తన్మదంబు♦నే నణఁగింతున్. 78

క. ఆమాటలు విని పౌండ్రకుఁ
డేమీ! నామద మణంతు♦వే? యింతకు నీ
వేమూల దాఁగినాఁడవు?
రా మఱి,యణఁచెదవు గాక ♦రా యని యెదురై. 79

చ. జగతిని వాసుదేవుఁడను♦జక్రిని శార్ఙ్గిని నేను గాక నీ
వగుదువె?యావు నెద్దు ముస♦లవ్వను బండిని గూల్చినందుకా
యెగురుచునుంటి వోరి!చల♦ మెక్కినమాటలు కట్టిపెట్టి నీ
పొగ రణఁగింతు విల్లు గొని♦ పోరికి సిద్ధము కమ్ము నావుడున్. 80

గీ. మందహాసంబు గావించి♦మాధవుండు
పౌండ్రకా! నీదుచిత్తంబు ♦వచ్చినట్లు
ప్రేలుకొనవచ్చుఁ గాని నా♦ పేరు విన్న
నింతదుఃఖంబు ని న్నేల♦హింసపెట్టు? 81

గీ. కోరుకొన్నది గాదు నా♦ పేరు నాకు,
కోరుకొన్నను రాదు నా♦ పేరు నీకు,
క్రొత్తగా నీవు తగిలించు♦కొంటి గాని
పిలిచెనే యెవ్వఁడేని యీ♦ పేర నిన్ను? 82

ఉ. మానవుఁగాక చక్రి నను♦మాట వృథాశ్రమ చేసి మోసి చ
క్రాన నొనర్చినట్టిఘన♦కార్యము చెప్పుము చూత, మెట్టులో
తూనిక నాసుదర్శనము♦తో సరివచ్చిన వచ్చుఁగాని వీ
ర్యానికి సాటివచ్చునె? య♦యఃఫలకంబును జక్ర మందురే! 83

గీ. బ్రతికినా చచ్చినా నీకు ♦వాసుదేవ
పదము చెల్లదురా వెఱ్ఱి♦పాడెకట్ట!
మాట లింకేల? తుచ్ఛపు♦నోటిపంద!
నన్ను గెలువు మటంచు బా♦ణంబు విడిచె. 84

చ. అది యణఁగించి పౌండ్రుఁడు ప♦దాఱిరవై యఱువై క్రమంబుగాఁ
బ్రదరము లేసి సారథిఁ దు♦రంగములం దనుఁ గొట్ట నాత్మలో
యదుపతి మెచ్చి మొల్కనగ♦వారఁగ శార్ఙ్గము లాగి, తేరుపె
ల్లడరఁ బతాక సారథి హ♦యంబులు నేలకుఁగూలనేసియున్. 85

గీ. చక్రరక్షకు లిద్దఱిఁ♦ జావఁగొట్టి
రథము చతికిలఁబడఁగఁ జ♦క్రములు నఱికి
యెవరిదో శార్ఙ్గ మిప్పు డే♦నెఱుకపడెనె?
యనుచు నవ్వంగఁ బౌండ్రకుఁ♦ డరద ముఱికి. 86

చ. గిరగిరఁ ద్రిప్పి కత్తి పరఁ♦గింపఁగ ముక్కచేసి కృష్ణుఁడ
య్యరి గద వేయఁ జీల్చి పరి♦ఘాయుధ మేయఁగ రెండుచేసి దు
ర్భర మగుశక్తి పూన్కి విస♦ర న్నవిగాఁ బడఁగొట్టె, యోరి!నీ
గరువ మణంగెనే?గదిలి♦ఖడ్గివి గా వటె యంచు దెప్పినన్. 87

చ. మన మెరియంగ వాఁ డప్పుడు♦మాధవ! నో రణఁగింతు నుండు మం
చనుపమసారమై దశశ♦తారమునై బహుభారలోహభా
జన మయి ఘోర మైనతన♦చక్రము చేకొని నన్నుఁ జంపఁ బు
ట్టినయది కాచుకొ మ్మని క♦డిందిమగంటిమి నేసె నార్చుచున్. 88

క. గిరగిరఁ దిరుగుచు మెఱయుచుఁ
జరచర చనుదెంచుదాని♦జవముం గని య
చ్చెరు వొందుచుఁ గృష్ణుఁడు తన
యరదము తప్పించె నదియు♦నవనిం బడియెన్. 89

చ. అది గని పౌండ్రకుండు తన♦యాయుధ మట్టులు వొల్లవోవఁగా
మది చెడి యొక్కరాయి గొని ♦మాధవ!చచ్చితి వంచు వేసినన్
యదుపతి దానిఁ గూల్చి యసు♦రాంతక మమ్మహనీయచక్రమున్
వదలఁగ వానిఁ జీల్చి యది ♦వచ్చెను వెండియుఁ గృష్ణుచేతికిన్. 90

గీ. అట్లు పగతుని ద్రుంచి నా♦రాయణుండు
నగరినల్లడ హర్షని♦నాద మెసఁగ
వృద్ధయదువీరమిత్రులు♦వెంటరాఁగఁ
జనియె వేడ్క సుధర్మ కా♦సమయమునను. 91

ఏకలవ్యుఁడు పాఱిపోవుట

క. బలరాముఁ డేకలవ్యుని
బల మారఁగఁ గొట్ట బొమ్మ ♦పటపట లాడన్
జల మారఁగ నాతండును
బలభద్రునురంబు గొట్టెఁ♦బటుతరగదతోన్. 92

ఉ. అంత హలాయుధుండు తులు♦వా!యిదె కూలితి వంచు నొక్కదు
ర్దాంత మరిందమం బగుగ♦దం దనచేతులఁ బట్టి యెత్తఁగా
లాంతకుచేతిదండ మిది♦యాఁపఁగ రా దని యేకలవ్యుఁడ
త్యంతభయాకులుం డగుచు♦నంబుధిలోఁబడఁ బాఱిపోవుచోన్. 93

ఉ. వానిని వెంబడించి బల♦భద్రుఁడు పర్విడఁ బూనె నప్పుడా
మానవిహీనుఁ డొక్కగతి ♦మన్నును మిన్నును గాన కేగి వే
గానఁ బయోధిఁ జొచ్చి హలి♦గట్టిన నాఁగుట చూచి,యీశ్వరా!
దీనుని గాచి తంచు నొక♦దీవికిఁ జేరె గజీతనేర్పునన్. 94

గీ. కామపాలుండు యుద్ధరం♦గంబుఁ జేరి
యరిబలం బెల్ల నిశ్శేష ♦మగుట చూచి
వృష్ణియదువీరవరుల వే♦ ర్వేఁ బొగడి
సాత్యకిం గూడి కృష్ణుని♦సభకు వెడలె. 95

ఉ. అందుల కేగుదెంచి రఘు♦డాప్తులు మిత్రులు బంధువుల్ మహా
నందముతోఁ గనుంగొనఁగ ♦నందునినందను భక్తులుం జిదా
నందుని వాసుదేవుని గ♦నం జనుదెంచిరి, నాఁటి దేవకీ
నందనునాసుధర్మ సుర♦నాథుసుధర్మను మించెనో యనన్. 96

ఉ. ఆసభలోనిపెద్దలకు♦నంజలిచేసి నమస్కరించి వి
శ్వాసము తెల్పి పిన్నలకు ♦సన్ననినవ్వునఁ గృష్ణుఁ డాశ్రమా
వాసులయాదరంబు వన♦వాసిపిశాచయుగంబుభక్తి కై
లాసముఁ జేరుకొంట వర♦లాభము నన్నియుఁ జెప్పి వారికిన్. 97

### శ్రీకృష్ణుఁడు రుక్మిణ్యాదులకు దర్శనమిచ్చుట

గీ. కొలువు చాలించి దరహాస ♦మలర లేచి
యంతిపురి కేగి రుక్మిణి♦యనుమతింప
సత్యభామాదిసతుల న♦చ్చటికిఁ బిలిచి
సర్వమును దెల్పె వారలు ♦సంతసింప. 98

వ. అనంతరంబ. 99

సీ. రుక్మిణీదేవికోర్కులు దీరఁ బ్రద్యుమ్నుఁ
గాంచి యానందంబు♦గాంచుచుండ
సత్యభామాదులు ♦సర్వసంపదలతోఁ
దులఁదూఁగుచుం దన్నుఁ ♦గొలుచుచుండ
ద్వారకాపురము శా♦త్రవబాధఁ దొలఁగి భూ
తలనాకమై వృద్ధిఁ ♦దనరుచుండ,
అవని నిష్కంటక♦మై ధర్మబద్ధమై
పాఁడిపంటలతోడఁ ♦బరఁగుచుండ

గీ. నిజకులోచితవృత్తులై నిఖిలజనులు
భక్తివాత్సల్యగౌరవభయనయములు
వెలయఁ దనయాజ్ఞ మీఱక మెలఁగుచుండ
సకలజగదీశ్వరుం డయ్యెఁ జక్రపాణి. 100

వ. అని పౌండ్రకవధాఖ్యానంబు వినిపించుటయు జనమేజయుండు సంతుష్టస్వాంతుండై మునీంద్రా! శ్రీకృష్ణకథామృతాస్వాదనంబునఁ దనివి చెందువా రుండఁబోరు. శ్రీహరిమహత్త్వంబు ప్రదిపాదించు నుపాఖ్యానము లెన్ని విన్న నింకను వినవలె నని యే మన సువ్విళ్లూరుచున్నది గావున నింకొకటియడుగుచుంటి ననుగ్రహింపుము.

గీ. [1] హంసడిభకుల నణఁగించె హరియటంచు
విందు వా రెవ్వరో వారిచంద మేమొ?
వారిసఖుఁడు విచక్రునివార్త యేమొ!
నుడువు మంచును భక్తితో నడుగుటయును. 102

ఇది
ప్రేమతత్త్వకలివిడంబనసత్యకీర్తి భీష్మప్రజ్ఞాంధ్ర దశరూపక
భాసభవభూతినాటకవచనాది కృతులకును, శృంగారరస
విమర్శన కర్ణార్జునశీలపరిశీలనాది వివిధవిషయక
వ్యాసంబులకుం గర్తయగు మల్లాది
సూర్యనారాయణశాస్త్రి నిర్మించిన
యాంధ్రభవిష్యపర్వమునందు
పంచమాశ్వాసము.

1. హంసడిచికులనియు, హంసడింభకులనియుఁ బాఠములు కలవు.

# ఆంధ్రభవిష్యపర్వము.

## షష్ఠాశ్వాసము.

శ్లో. ఓఙ్కారాక్షరరూపాయ। యోగగమ్యాయయోగినే
రజస్తమోవినాశాయ। శ్రీకృష్ణయనమోనమః. 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె. 2

హంసడింభకులజనాదికము

గీ. విమలతరకీర్తితత్త్వవివేకమూర్తి
యాగదీక్షారతుండుదయాపరుండు
సాల్వరాజ్యంబునేలునుక్షత్త్రియుండు
తనరుఁగాంపిల్యపురిబ్రహ్మదత్తుఁడనఁగ. 3

మ. అనపత్యుం డగునాతఁ డిర్వురును భార్యల్ వెంబడింపం దపో
వనముం జొచ్చి పదేండ్లు దీక్ష గొని శర్వాణీపతిం గొల్వ నా
తని కాతండు కలం గనంబడి మహీంద్రా! నీకు శీఘ్రంబుగాఁ
దనయుల్ పుట్టుదు రిద్ద ఱేగు మని యంతర్ధాన మైనంతటన్. 4

క. నరపతి మేల్కొని వేడ్కన్
వరలాభము తెల్పి తనదువనజాక్షులతోఁ
బురమునకుం జనుదెంచెను
బరమేశ్వరుకరుణకలిమిఁ బరవశుఁ డగుచున్. 5

గీ. ఆసమయమందె యైదేళ్లు హరినిగొలిచి
బ్రహ్మదత్తునిమిత్రుండు బ్రాహ్మణుండు
మిత్రసహుఁడును బడసెనుబుత్త్రివరము
వార లట్లు కృతార్థులై వెలుఁగుచుండ. 6

మ. మనుజవరేణ్యుభార్యలు క్ర♦మంబుగ హంసుఁడు డింభకుండు నాఁ
దనయుల శంకరోపములఁ ♦దద్వసుధామరుపత్ని యొక్కనం
దనుని జనార్దనాఖ్యుని జ♦నార్దనసన్నిభుఁ గాంచి,రంత వా
రును దమతండ్రులట్లు నెన♦రుం గనునెయ్యమునన్ మెలంగుచున్. 7

చ. కులగురుసన్నిధానమునఁ♦గోరిక నేర్పును మీఱ వేదవి
ద్యలు ధనురాగమార్థనయ♦దండరహస్యము లాహవంబులన్
మెలఁగెడియెల్లమార్గములు♦నేర్చినయంతట సర్వరాజులన్
గెలిచినశూరు లన్నఘన♦కీర్తి గడింపఁగ హంసడింభకుల్. 8

క. కులదైవ మైనశూలిం
గొలువఁగ హిమగిరికి నేగి♦ఘోరతపంబుల్
సలిపిరి, యింటనె చక్రిన్
దలఁచుచు విద్యారతిన్ జ♦నార్దనుఁ డుండెన్. 9

గీ. రాజపుత్రులు పంచవ♦ర్షంబు లట్లు
గాలి నీరును శరణంబు♦గాఁ దపింప
హరుఁడు ప్రత్యక్షమై కోర్కె♦లడుగుఁ డనియె
నెలమి యేపార మ్రొక్కి వా♦రిట్టులనిరి. 10

చ. పరమశివా మహేశ్వర కృ♦పామయ శంకర! భక్తియుక్తి నీ
చరణము లాత్మలోఁ దలఁచు♦సజ్జను లిష్టము గాంచుచుండ, నీ
దరిసెన మైనవారు వర♦ధన్యత గాంచుచునుండ నింక నీ
వరమునఁ బుట్టునీసుతులు♦వాంఛితసిద్ధిని గాంచు టబ్రమే? 11

సీ. అందు నిందును గ్రింద♦నఖిలవీరులయందు
నొకఁడేని మము♦నోర్వ కుండునట్లు,
రౌద్రమాహేశ్వర♦బ్రహ్మశిరోఽస్త్రంబు
లచ్ఛేద్యచాపంబు♦లబ్బునట్లు,

పగఱ కభేద్యంబు♦లగుకవచంబులు
ఘనశక్తిపరశువుల్♦కలుగునట్లు,
పాయక యుద్ధస♦హాయులై యిద్దఱు
ప్రథమ వీరులు వెంట♦వచ్చునట్లు,

గీ. వరము లిమ్మని నట్టులే♦హరుఁ డొసంగి
యంతఁ గుండోదరుని విరూ♦పాక్షుఁ బిలిచి
యాజ్ఞ వీరికిఁ దో డగుఁ♦డనుచుఁ జెప్పి
యందె యంతర్హితుం డయ్యె♦నపుడు వారు. 12

వ. ఈశ్వరానుగ్రహంబున నభీష్టంబు సిద్ధించినందుకుఁ బరిహృష్టాంతరంగులై భస్మోద్ధూళితవిగ్రహులును రుద్రాక్షాలంకృతులును జటావల్కలవ్యాఘ్రచర్మాంబరధరులునై శివునినోటనుండి యూడిపడినట్లు శివరూపంబుల నొప్పుచు "నమశ్శివాయ శాన్తాయ నిత్యాయ పరమాత్మనే" ఇత్యాదిగా శివధ్యానంబు చేయుచు నిజగృహంబున కరుదెంచి. 13

గీ. తల్లిదండ్రుల పాదప♦ద్మముల కెరఁగి
గురునికిని మిత్రసహునికిఁ♦ గోర్కె మ్రొక్కి
మిత్రుఁడై నజనార్దను♦మేను నిమిరి
సేవకుల నెల్లఁ గరుణ వీ♦క్షించి రంత. 14

వ. వీరపురుషలక్షణంబుల వీరశైవచిహ్నంబులఁ జెలంగు తమ్ముం గని సామంతులు ప్రజలు భయభక్తివినయంబులఁ బ్రణమిల్లుచుండ హంసడిభకులు రాజ్యకార్యంబు లరయుచు జననీజనకులయానతి నుత్తమరాజవంశసంజాత లగుసుందరాంగులఁ బరిణయంబై గార్హస్థ్యధర్మంబులు యథోక్తంబుగ నాచరించుచు యాగప్రియులై యుండిరి. జనార్దనుండును దండ్రి యనుమతిని శ్రోత్రియకులసంభూత

యగుసుశీలను వివాహమాడి గృహమేధివిధుల మెలంగుచు క్రతువు లాచరించుచుండె. అంత నొక్కనాఁడు. 15

హంసడిభకులు వేఁటకేగి యతులను బాధించుట.

చ. మునులు వశించునాశ్రమము♦పొంతల దుష్టమృగంబు లున్నవా
ర్తను విని వేఁట సల్పుమతిఁ♦దద్వని కేగిరి హంసడింభకుల్
మునికొని వేఁటకాండ్రు పని♦ముట్లు సమస్తము వాహనంబులం
గొని చనఁగా జనార్దనుఁడు ♦కూరిమిఁ దోడయి రా రథంబులన్. 16

చ. చని వని ముట్టడించి యదె♦చార్లమెకంబు సివంగి యే దదే
వనమహిషంబు ఖడ్గ మిదె♦భల్లుక మిందు వృకంబు సింగముం
గను మదె దుప్పి లేడి శశ♦కం బను కేకలుతో మృగార్తని
స్వనము లెసంగఁ గ్రూరమృగ♦జాల మణంచిరి శస్త్రిచాతురిన్. 17

వ. అంత మట్టమధ్యాహ్నం బగుటయు మృగయ చాలించిపరిచరవర్గం బుం దామును గొంతయలసట దీర్చుకొని యచ్చటి కనతిదూరంబున నున్నయొక్కకమలాకరంబుం జేరి శ్రమాపనోదంబుగ నవగాహనస్నాన మాచరించి జలంబు లాని తత్తీరతరుచ్ఛాయల విశ్రమించి నయెడ. 18

ఉ. వేదనినాద మచ్చటికి♦వీనులవిందుగ నేగుదెంచి యా
హ్లాద మొనర్పఁగాఁ బరిచ♦రావళి నచ్చట నిల్పి వార లా
నాదముజూడ నేగి ముని♦నాథపరీతుని వైష్ణవాఖ్యస
త్రాదరచిత్తుఁ గాశ్యపమ♦హామునిఁ గాంచి నమస్కరించినన్. 19

గీ. వారు మువ్వురికిని ముని♦వర్యు లెలమి
నతిథిసత్కారవిధు లెల్ల♦నాచరించి
రప్పుడు హంసుండు వినయంబు ♦హర్ష మలరఁ
గాశ్యపమునీంద్రుఁ గాంచి యొ♦క్కరణిఁ బల్కె. 20

చ. అనఘుఁడు తత్త్వవేత్త వివిధాధ్వరకర్త మహీశ్వరుండు మా
జనకుఁడు రాజసూయమును సల్పఁ దలంచి నృపాళిఁ బిల్వఁగాఁ
బనిచెను, దానికిం దిరుగుబా టొనరించెడువారి గెల్చి నా
యనుజుఁడు నేను మాజనకునాహవశాలకుఁ జేర్తు మెత్తఱన్. 21

ఉ. శూలిదయాతిరేకమున శూరుల నెల్లర నోర్చునట్టి యా
భీలపరాక్రమాదులు లభించెను మాకు, మమున్ జయింపఁగాఁ
జాలెడువాఁడు లేఁడిది నిజం బిఁక నాయనగారి యాగ మే
జాలము లేక సాగుటయు సత్యము, కావున మీర లందఱున్. 22

గీ. రాజసూయంబు చేయింప రాఁదగు నని
మనవిచేయుచునున్నాఁడ మన, మునీంద్రుఁ
డప్పటికిఁ దీరనేని మా యాగదీక్ష
శిష్యులం గూడి వత్తుము సిద్ధ మనియె. 23

వ. అంత హంసడిభకులు కాశ్యపాదులకు బునఃపునఃప్రణామంబు లాచ
రించి వారివీడుకోలు వడసి జనార్దనుం గూడి బయలువెడలి వెనుకటి
సరోవరంబు నుత్తరతటంబునఁ జనుచు నొక్కచో నుపాంతంబునం
బ్రశాంత మైనయొక్కయాశ్రమంబు గాంచి సమీపించి యందు. 24

సీ. యమనియమాదియోగాంగసాధనమున
నింద్రియంబులను జయించువారు
శమదమాదికషట్కసంపద నాత్మత
త్త్వానుసంధానంబు నరయువారు
సర్వవేదాంతార్థసారవిచారణఁ
జిత్త మేకాగ్రంబు చేయువారు
జీవాత్మపరమాత్మ భావనాస్మృతి నైక్యజీ
వన్ముక్తిమార్గంబు పట్టువారు,

గీ. అగుచు నమనస్కయోగంబు♦నభ్యసించు
హంసపరమహంసాదు లక్కట్లరయుచుండ
నాల్గవయవస్థ దాఁటి యా♦నందమైన
వానిఁబద్మాసనస్థు దుర్వాసుఁ గాంచి. 25

వ. పాపంబు పండెనో యన దుర్గర్వారంభంబున మురహంకారులై, [illegible]
కారణంబు కలిగెనేని కన్ను తెఱచి చూచినంత సకల[illegible]
భస్మముచేయఁ జాలు నమ్మహర్షి మహామహిమంబెఱుఁగక యా[illegible]
దిరస్కరింపఁబూని 26

ఆ. బోడితలలవారు♦పుట్టగోచులవారు
చుట్టుముట్టి యుండ♦నట్టనడుమ
బిఱ్ఱబిగిసి వెన్ను ♦బిగఁదన్ని కూర్చుండె
వీఁ డెవండొ పెద్ద♦వెఱ్ఱిబోడ ! 27

ఉ. ఆసలు మానినట్లు జను♦లందఱి మోసముచేసి యెట్టి[illegible]
యాసము లేక పొట్ట బలి♦యం దిన వేసినవేస [illegible]
న్యాసము నొక్కయాశ్రమమె? ♦యర్థము ధర్మము కామ ము[illegible]
భ్యాసమునం జరించెడు గృ♦హస్థులకన్నను మిన్న [illegible]! 28

వ. అని పలుకుచు, జనార్దనుం డించుక వెనుక [illegible] [illegible]
లిరువు రింకొకయడుగు వైచి దుర్వాసోమునీంద్రుకట్టెదుట నిలిచి
నిశ్చలసమాధి నస్లేయున్నయతనిం బరిభవదృష్టి [illegible]. 29

క. కదలఁడు చూడుఁడు పలుకఁడు,
మదమునఁ గను మూఁతపడెనొ? ♦మతి పోయినదో ?
పెదవులు కదపక యేమో
మదిఁ దలఁచుచునున్నవాని♦మాడ్కి నటించున్. 30

గీ. వీఁడు గురువని నమ్మి యీ నెత్తిముండ
కొడుకు లెల్లరు పెడదారిఁ బడి, రితండు
తాఁ జెడుట గాక చెఱిచె నిందఱిని, దాను
జెడ్డకోఁతి వనం బెల్ల జెఱచినట్లు. 31

ఉ. నిప్పుల నీరు వోసి సతి నెత్తిని నిప్పులు వోసి ధర్మముల్
తప్పినయిట్టిమూఢుల నుదారికిఁ దెచ్చుట రాజధర్మ మా
నిప్పుడు బుద్ధి చెప్పి తమ యిండ్లకుఁ జేరఁగ వీరి నంపి, యిం
కెప్పుడు తప్పు చేయ నని యిమ్మదిచే ననిపింపఁగాఁ దగున్. 32

వ. అనుచు నొడలు మఱచి యిట్లు ప్రేలఁ జొచ్చిరి. 33

ఉ. ఎందుకు డాబుచేసెద? వి దెక్కడియాశ్రమ? మేమి లాభముం
బొందద గృహస్థధర్మములఁ బోకడ పెట్టితి? కాఁపురాలు గం
గం దిగఁద్రొక్కి వీరు నరకంబునఁ గూలరె? యెంత చేసితి
వెందఱిఁ బాడుచేసితివొ? యెందఱికొంపలఁ జిచ్చు పెట్టితో? 34

ఆ. సతుల సుతులఁ గూడి సంసార మొనరించు
హరిహరాదు లెల్ల నజ్ఞు లొక్కొ?
స్త్రీలు పురుషు లనఁగ సృష్టి చేసిన జగ
త్కారణుండు చేఁతకాని వాఁడె? 35

ఉ. చేసినపాపముం దలఁచి చింతిలి శాంతి యొనర్చుకొమ్ము, మా
శాసన మాచరింపుము, విచారణ చేయక పుచ్చుకొన్న స
న్యాసము మాను మూనుము గృహస్థత, నిత్యము పంచయజ్ఞముల్
చేసి సుఖింపు మిందు, తుదిఁ జెందుము నాకసుఖంబు లెంతయున్. 36

గీ. ఆలకించితి వా?—బదులాడ వేమి?
ఒళ్లు తెలియక యున్నాఁడ వోరిమూఢ!
బ్రతుకఁ దలఁచితి వేని మా పలుకు చేయు
మనుడుఁ జిత్తంబు కలఁగ జనార్దనుండు. 37

చ. శరణు తపోధనా! శరణు, సజ్జనభూషణ మాలకించు నా
దురితము లంతరింప నిదె దోసిలి యొగ్గితి నంచు మ్రొక్కి, ని
ష్ఠురగతి హంసడింభకులఁ జూచి మదాంధులు బుద్ధిహీను లం
తరము లెఱుంగఁజాలరు వృథా మునినాథుని ధిక్కరింతురే! 38

ఉ. ఆయువు చెల్లెఁగావలయు నక్కట! మీచదు వెల్ల పొల్లయై
నే!యిది నేర్పి రే గురువు! లెంతటిమూర్ఖులుగాని యింతయ
న్యాయముగాఁ జరింతురె!మహామహిమాంచితుఁ డైనయిట్టిశా
పాయుధునుగ్రదృష్టి కిఁకఁ బ్రాణముఁ బాయక నిల్వ శక్యమే! 39

గీ. ఎట్టిమహనీయుఁడో యిమ్మునీంద్రుఁ డనుచు
వందనం బాచరించి దీవనలు గొందు
రంతియే కాని యిట్లు నిందింతురయ్య!
ఖర మెఱుంగునె చందనపరిమళంబు? 40

గీ. వర్ణములయందు బ్రాహ్మణవర్ణ మట్టు
లాశ్రమములందు సన్న్యాసమధికతమము,
దాని కర్హత గనువాఁడు ధన్యతముఁడు
పరమపురుషార్థ మాతనిపట్టుఁగొమ్మ. 41

చ. అని నిగమాంతవేత్త లగునాద్యులు తెల్పినతత్త్వసారముం
గనియును మీ రొనర్చుయతిగర్హణ వింటి.ని,జాలు నింక ని
మ్మ్మను విడనాడి నీటఁ బడిమున్గుదునో గరళంబు తిందునో!
యనలముఁ జొత్తునో!యనుచుహాయనుచున్ విలపించె నత్తతిన్.42

వ. దుర్వాసోమహర్షి యామాట లాలకించి యట్లే నిశ్చలుండై యుండి
యించుక కన్ను తెఱచి. 43

క. కనియె జనార్దను వత్సల
మును జిల్కెఁడియొక్కకంటముందుగఁ, బిసపన్
గనుఁగొనె హంసుని డింభకు
ఘనరౌద్రానలము గ్రక్కు కంట నొకంటన్. 44

క. కనుఁగొని యాదార్జన్యం
బునకారణ మాత్మఁ దెలిసి పురుషోత్తముమా
యను బడి వీరలు తమయం
తన తాము నశింపఁగలయు దర్పితు లనియున్. 45

క. కనుఁగొని "చత్తురు చత్తురు
చనుఁడు చనుం డిపుడు మీరు, శాపంబున మి
మ్మును గూల్పఁ జాలియును శాం
తిని గని యున్నాఁడ విడిచితిం బోపొండీ! 46

చ. విని సయిరింపఁ జాల నిఁక వీతిఁడిమాటలు పొందుపొందు నేఁ
గనలితి నేని మి మ్మొకరిఁ గాదు మహీవరవంశ మెల్ల నా
శన మొనరింతుఁ గాని యముసన్నిధి కేగఁగ మాటఁ జంకఁ బె
ట్టినమిము నేను గూర్చినసహింపం బడఁజాలను జెప్ప నేటికిన్?" 47

చ. అని యదలించి లేచి విపినాంతరసీమకుఁ బోవఁ జూచున
య్యనఘుని రెక్క పట్టుకొని యట్టిటు ముమ్మఱు గుంజి హంసుఁడే
మనఁ దగు! గోచి చింపెను, భయంపడి శిష్యులు పాఱిపోయి ర
య్యనుచితకృత్యముం గని జనార్దనుఁ డాఁగు మటంచు నడ్డమై. 48

గీ. తప్పు తప్పంచు వానిహస్తంబు వట్టి
పట్టు విడిపించి లాగె నివ్వలికి నంత,
యతియు హృదయంబు భగభగలాడ మీఱు
కినుక దిగమ్రింగి మెల్లగా ననియె నిట్లు. 49

మ. హతమార్వం గలనేను మి మ్మధముఁలారా! కాని నా కేల సం
యతచిత్తుండను లోకరక్షకుఁడు దైత్యారాతి యుండంగ? నీ
క్షితి మీపేరుప్రతిష్ఠ లుండ వీఁక, మీచేష్టల్ జరాసంధభూ
పతి యాలించినఁ జీయటంచు మిము మీబాంధవ్యమున్ దూఱెడున్.

వ. అని పలికి, జనార్దనువంకఁ జూచి దుర్వాసుండు. 51

గీ. స్వస్తి యగుఁగాక, యిహపరసాధనంబు
లెల్ల ఫలియించుఁ గాక, శ్రీకృష్ణ నీవు
రెండుమూణ్నాళ్లలోన దర్శింతుగాక
వెడలు మిది యెల్ల మీతండ్రి వినెడుఁగాక. 53

వ. అని చెప్పుచుండ హంసడింభకులు మఱింత క్రోధావిష్టులై దౌర్జన్యంబు
నకు దిగి. 53

సీ. దండముల్ విఱిచి కమండవుల్ నలిచేసి
దర్భాసనంబులు తగులఁబెట్టి
మూఁకుళ్లు ముంతలు గోకర్ణములు కుండ
లింతేసిగా నేల నేసి కొట్టి
కృష్ణాజినంబులు కేలఁ గాలను జీల్చి
కాషాయవస్త్రముల్ కాళ్ల మట్టి
అగ్నయే స్వాహాయటంచుఁ గుటీరముల్
చిటచిట లాడంగఁ జిచ్చుపెట్టి

గీ. చూడ వచ్చినయెలుకును గూడె మంచి
మైణమాంసంబు తెప్పించి యాగృహాగ్ని
యందె కాల్పించి యింపార నారగించి
పాగ రణంగినదా? యంచుఁ బోయి రపుడు. 54

గీ. బ్రహ్మదత్తునిపుత్త్రి లీశ్వరునిభక్తు
లధిగతామ్నాయు లస్త్రశస్త్రాగమజ్ఞు
లక్కటా! భ్రష్టులై పోయి రని వగచుచు
నరిగె వారిని గూడి జనార్దనుండు. 55

వ. అంతఁ బలాయితులై తిరిగివచ్చిన యైదువేలయతులు నాశ్రమవినా
శంబునకు వగచుచుండ వారి నూరార్చి, దుష్టులైన రాజపుత్రులు
చేసినదుండగంబుల కానవాళ్లుగా నగ్నిపాలుగాక యందందు
చెదరిపడియున్న కృష్ణాజినకుశాసన కాషాయ కౌపీనంబులచీలికలును,
కాలీకాలనిదండఖండంబులును, కమండలుశరావంబులపెంకులును
మూటలుకట్టుకొని వారు వెంటరా దుర్వాసుండు ద్వారకామార్గంబు
పట్టెనంత. 56

దుర్వాసుఁడు తమబాధ కృష్ణునికెఱిఁగించుట.

గీ. కాలు నేలను మోపిన కామగమన
మనఁగ దుస్సహ మగుకోప మనెడిచండ
మారుతము పట్టి త్రోయంగ వారు తెల్ల
వాఱువేళకు ద్వారక చేరుకొనిరి. 57

ఉ. చేరి పురోపకంఠసరసిన్ శ్రమ వాయఁ గృతావగాహులై
తీరిచి యాహ్నికంబు వసుదేవకుమారునిదివ్యమందిర
ద్వారము చేరి,రంత మునివల్లభుఁ డంపెను వార్తయుం బ్రతీ
హారునిచేత లోపలికి నప్పుడు చక్రి సుధర్మలోపలన్. 58

శా. లీలార్థంబుగఁ దాను సాత్యకియు గోళీలాటకుం జొచ్చి యు
ద్వేలంబై తమకంబు హెచ్చ నిదెముందీగోళి త్రోపాడు నీ
గోలం బంచును వ్రేళులం గొని తగులోఁ గొట్టి నా దాట యం
చాలోకించెడుబంధుమిత్రతతికిన్ హార్షంబు గావించుచున్. 59

క. సుగ్రీవునితోఁ దొల్లిక
శగ్రీవాంతకుఁడు క్రీడ ♦సల్పినగతిఁ బ్ర
త్యగ్రోత్సాహంబున రా
జగ్రామణి కృష్ణుఁ డాడి ♦సాత్యకి గెలిచెన్. 60

వ. మఱియుఁ గౌతుకాతిశయంబున. 61

క. ఒక్కొక్కయదుకుమారుని
దక్కక యట్లోర్చుచుండఁ, గడఱి చిక్కక వాఁ
డిక్కడ నిలిచెను యతిగణ
మక్కడనే నిలిచె రెండుజాములు లయ్యెన్. 62

వ. అంత నతం డాట చాలించుటయుఁ బ్రతీహారి చేతులు మోడ్చి దేవా! దేవర దర్శింప వచ్చినమునిగణంబు కోటముంగిట వేచియున్న దని విన్నవించి యుత్తరువు వడసిపోయి విచ్చేయుం డన సశిష్యుండై దుర్వాసుఁడు కక్ష్యాంతరంబులు గడచి సుధర్మ సమీపించి ముఖద్వారంబుఁ జొచ్చి. 63

చ. కనఁగ నజాండమో యనఁగఁ గాంచనగోళము చేతఁ ద్రిప్పుచున్
గనుఁగవ సత్త్వరేఖయు మొగంబునఁ జిక్కుల తాండవింపఁగాఁ
గనులకు విందుగా నెదురుగాఁ జనుదెంచెడుకృష్ణుదివ్యమూ
ర్తిని మనసారఁ గాంచి వినుతించిరి మౌనులు భక్తినమ్రులై. 64

చ. కనలున నెఱ్ఱవాఱిన మొగంబున కందలివారు భీతిలన్
జినిఁగినగోచి పెట్టుకొని చేరఁగ వచ్చినమౌనినాథు కే
ల్గొని యుచితోపచారములు గలోపలికిం గొనిపోయి యండఱిన్
గనిపి యథోక్తపూజల జనార్దనుఁ డిట్లనె నయ్యతీంద్రుతో. 65

శా. కామక్రోధముఖారివర్గమును ధిక్కారించి సర్వేంద్రియ
గ్రామంబుం దిగఁద్రొక్కి బంధపరిముక్తస్వాంతతన్ యోగవి
ద్యామార్గంబున నాత్మతత్త్వ మనుసంధానించువిజ్ఞాని వో
స్వామీ! నీ విటు లేగుదెంచుట మహాశ్చర్యంబుగాఁ దోఁచెడున్.

గీ. సర్వసంగపరిత్యాగశాంతమతివి
కాంక్షచే రావు,రావు నిష్కారణముగ,
ఇందు విచ్చేయఁ దగినంతహేతు వేమొ?
తెలియకున్నాఁడ దయచేసి తెల్పుమయ్య! 67

మ. అన దుర్వాసుఁడు కోపవేగమున నేమన్నావు దైత్యాంతకా!
నను వంచించెద వే? సమస్తజగదంతర్యామి వం చే నెఱుం
గనె? నారాకకుఁ గారణంబు తెలియంగా రాదె నీ కోసనా
తన? విశ్వాత్మక విశ్వకారణ జగత్కల్యాణసంధాయకా! 68

ఉ. ఏను బురాతనుండ భవదీయమహామహిమం బెఱుంగ వి
జ్ఞానులలో నొకండ,జలజప్రభవాదు లెఱుంగునీదు,పౌ
రాణికదివ్యరూపము ధరాస్థలి ధర్మము నిల్పఁ బుట్టినీ
మానుష మైనరూపమునుమాయలు సర్వము నే నెఱుంగుదున్.

చ. ఎఱిఁగి యెఱుంగనట్లు నటియించుటె నాకడ? తల్లిపుట్టిని
ల్లెఱుఁగఁడె మేనమామ?జగదీశ్వర!శిష్టులఁ బ్రోవ దుష్టులన్
జెఱుప జనించుచుందు నని చేసినతొంటిప్రతిజ్ఞ యింతలో
మఱచితె? దొంగనిద్ర గనుమానిసి మేల్కొనఁ జేయవచ్చునే?70

ఆ. సగము చచ్చి వచ్చి శరణుచొచ్చితి మయ్య!
కష్టపా టెఱింగి కాతు వనుచు
నాదుకర్మఫలము నానోట వినఁ గోరి
పుండుమీఁద మెంతి పోసినావు. 71

శా. నీపై కోపము గాదుసూ యిది జగన్నిర్మాణపారీణ! నా
పాపారంభులు హంసడింభకులు నాపై నిన్ను గావించు దు
ర్వ్యాపారంబునఁ గన్నుగిన్న, నను సర్వజ్ఞా! క్షమింపం దగున్
గోపం బంతయు నంతరింప నిఁక నీకు న్నాగతిం దెల్పెదన్. 72

ఉ. మాదురదృష్ట మెట్టిదో? ద్వారకారమణా! వినిపింప నోపురా,
దీదృశబాధ లొందిన మహీసురు లెక్కడ నుండఁబోరు, ని
ర్వేదము శాంతిఁ గొల్ప నటువిం బరతత్త్వము చింతజేయుమా
కీదురవస్థ వచ్చుటకు హేతువు కర్మము గాక యే మగున్. 73

గీ. కలుష మడఁగించి ధర్మంబు గావఁదగిన
క్షత్రియ కుమారు లెక్కడ? సంయములను
బట్టి బాధించు టెక్కడ? యెట్టిఁడైన
విన్నచో ముక్కుపై వేలు వేసుకొనఁడె? 74

గీ. హారవరమదాంధు లైనయా హంసడిభకు
లమరపతి నైన గణియింప రాజి ననఁగ
శాంతనవు బాహ్లికుని జరాసంధు నైనఁ
జీరికిం గొన రంచు వచింపనేల? 75

గీ. అట్టిఘనశూరు లయ్యు వా రల్పబుద్ధి
నిన్ను చేసినపాపంబు విన్న నిపుడ
చేతఁ జక్రంబు పట్టి విచ్చేసి వారి
చేతు లింతింతముక్కలు చేసి రావె? 76

క. యతు లన సన్యాసం బన
మతి సంకటిరోఁత వడయు మనుజాధము పీ
క్షితి నుండఁబోరు, వారే
గతిఁ బుట్టిరొ యెట్టిగతులు గన నున్నారో!

గీ. శ్రీహరీ! యేమి చెప్పుదు? సిగ్గుసిగ్గు,
"పలికిమాలినసన్న్యాసమును దొఱంగి
యాశ్రయింపుము గార్హస్థ్యమనుచు వారు
నన్నుఁ దిట్టినతిట్లన్ని యన్ని కావు. 78

ఉ. ముందుగ గోచి చింపి, నను ముమ్మఱు గుంజినహంసుఁ జూచి పీ
రందఱు పాఱిపోయి రపు డాసుజనుండు జనార్దనుండు వా
నిం దొలఁగించెఁ, గానియెడ నిన్నె కన్నులవిందుగాఁగ ని
న్నుం దిలకించియుందును మనోరథసిద్ధిని గాంచియుండుదున్. 79

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 80

ఉ. వేసము మార్చి బంధువుల వీడి యరణ్యము చేరినంత స
న్న్యాసము సిద్ధిగాంచునె? సమస్తము పోయినఁగాని సన్న్యస
న్న్యాసము సిద్ధిగాంచ దనుసత్యము మా కెఱిఁగింప నొజ్జలై
మానకలార్థసంచయము మాంపిరి కాల్చిరి పూరికుటీరముల్. 81

వ. చిత్తగింపు మనుచుఁ దమ తెచ్చిన మూటలు విప్పి గోవిందు నెదుటఁ
బెట్టి. 82

సీ. కంసనిషూదనా! కాంచు మీ శాటీలు
చీల్చినచేతులు చీలిపోను
బలిమార్దనా! చూడు బ్రహ్మదండంబులు
విఱిచినహస్తముల్ విఱిగిపోను
నరకాంతకా! కమండలురాశి చూడు మా
పాపులతల లిట్లు పగిలిపోను
దానవారీ! చూడు దర్భాసనాదు లా
చెట్టలచర్మముల్ చిఱిఁగిపోను

గీ. ఉట్టి చిక్కంబు గోకర్ణ మొక్క టేమి?
సర్వనాశన మయ్యె నాశ్రమము నమ్మ
మమ్మహాఘోరపాపులనణఁచకున్న
నామశేషంబు గాదె సన్యాస మింక? 83

క. వారిని గెలువఁగఁ జాలిన
వీరులు లోకమున లేరు నీవును మిఁక నీ వే
తీరున నమ్మదమత్తులఁ
బోరం బరిమార్చువాఁడవో దైత్యారీ! 84

గీ. శిష్టసంరక్షణంబు నీచేత యగుట
రక్షకుం డనుబిరుద మేర్పడియె నీకు
దుష్టు లగుహంసడిభకులఁ ద్రుంచి యిప్పుడు
నిఖిలలోకేశ! నీపేరు నిలుపుకొనుము. 85

క. అని రౌద్ర హాస్యకరుణము
లును భక్తియుఁ దోఁపఁ బాపలుంటాకుఁడు యో
గనిధానము దుర్వాసుఁడు
వినిపింపఁగ నఖిలలోకవిభుఁడిట్లనియెన్. 86

శ్రీకృష్ణుని హంసడిభకవధ ప్రతిజ్ఞ — యుద్ధయాత్ర

మ. విని యున్నాఁడను హంసడింభకులు గర్విష్ఠాత్ములై లేచి గనం
పనిగుండా లని కాని, తాపసుల నేఁపం జూతురా యంచు నే
టి నుపేక్షామతి, నాది పెద్దపొరపాటే తప్పు మన్నింపు మో
మునినాథా! శివుఁడడ్డు వచ్చినను నిర్మూలింతు నప్పాపులన్. 87

క. హరుఁ డొక్కఁడ కాదు సురే
శ్వర వరుణ బ్రహ్మలిప్పుడు వరము లొసఁగినన్
బరిమార్చెద నీకిన్కకు
గురి యగునావంటయింటికుంకం దేళ్ళ నపన్. 88

క. నినుఁ గాఱియపెట్టుట త
మ్మును గట్టఁగఁ ద్రాళ్లు తామె మును చేకొనుటే
యనుమీ! కాలము కర్మం
బొనగూడెను, సాధుబాధ యూరక చనునే? 89

ఉ. గంధగజంబులట్లు కడుఁ గావర మెక్కినవారి కాజరా
సంధుఁడు బంధుఁ, డాఖలుఁడు శత్రుజయంబున కేఁగె, వానిసం
బంధము లేకయున్నతఱిఁ బట్టి వధించెద హంసు డింభకున్
సంధిలిరేని ముప్వురు దుస్సాధ్యము శత్రుజయంబు, కావునన్. 90

గీ. సత్వరంబుగ వారిని సంహరింతుఁ
దప్ప దిది సంయమీంద్ర! సత్యంబుతోడు,
యతుల నెల్లరఁగూడి మీ యాశ్రమంబు
చేరుకొనవచ్చు నింక విచారముడిగి. 91

వ. అనుచు మునిజనహృదయనివాసుం డగుముకుందుం డానతీయ
దుర్వాసుం డమందానందపరవశుండై యిట్లనియె. 92

చ. వరములదండ కంతములఁ బాసిల మూర్ఖను దైత్యవీరులం
బొరిగొనినట్టి నీమహిమఁ ముందట నిల్తురె హంసడింభకుల్?
పరసర కట్టలే నమలుఁ వానికి నప్పము లొక్కలెక్కయే?
మురహర! లోకరక్షక! తమోహర! మెచ్చితి నీప్రతిజ్ఞకున్. 93

ఉ. కారణజన్మ మెత్తినజగత్త్రియకర్తవు కేశవా! నమ
స్కారము, నీమహామహిమఁ సర్వ మెఱింగియు నిన్న గన్నవో
వ్వారఁగ మీఱుకోపమునఁ నాడినమాటలు సైఁపుమీ! క్షమా
సారులు భక్తదోషములఁ సైఁతురు గాదె సుమత్వభావనన్? 94

క. అన విని హరి యుట్లనె నే
ననవలసినయట్టిమాట ♦యంటివి నీ వో
మునివర! నామాటలలో
ననుచిత మేదేని యున్న ♦నది సైఁపఁదగున్. 95

క. సారాసారవిచారణఁ
దీరనమీవంటియతులు ♦ తెలియంగ క్షమా
సారు లని చెప్పఁ దగుదురు
సైరణ యేపట్టునందు ♦సడలకయున్నన్. 96

ఉ. సైరణ చిత్తశుద్ధికిని♦సాధన, మింద్రియనిగ్రహంబునం
గారణ, మైహికం బగుసు♦ఖస్థితిమూలము, పుణ్యసద్గతి
ద్వారము, తత్త్వచింతకు ని♦దానము, సత్యముదారి, ముక్తి కా
ధారము, సర్వసద్గుణ ని♦ధానము దానికి సాటి యున్నదే? 97

ఆ. కాన మీరు సర్వ♦కాలసర్వావస్థ
లందు దానిఁ దలఁపుఁ ♦డనఘులార!
అనుచుఁ జెప్పి లేచి♦ యందఱికిని మ్రొక్కి
బిక్ష యారగింప♦ వేఁడుకొనియె. 98

ఉ. 'ఓ'మని యైదువేలయతు♦ లొక్కట లేచి గురుండు ముందుగాఁ
దామరసాక్షుతోఁ జనుచుఁ ♦దద్గృహాభిత్తుల నైజవిగ్రహ
స్తోమముగాంచి భ్రాంతిపడి♦ తొట్రనె సాపడి రేమి? యెవ్వరీ
స్వాములు? తోడివారె? యను♦పల్కుల భోజనశాలఁ జేరఁగన్.

గీ. కృష్ణుకనుసన్న యదువృద్ధ♦వృష్ణివరులు
యతుల నెల్లర నుచితాస♦నాదివిధుల
బహురుచిరభోజ్యపానీయ♦భక్ష్యములను
ఫలరసంబుల సంతృప్తి♦పఱచి పిదప. 100

గీ. పట్టుకౌపీన మొక్కటి♦పట్టుపుట్ట
మొక్కటియుఁ గాఁగ నందఱి♦ కొసఁగి రంతఁ
బద్మనాభునివీడ్కొలు ♦వడసియతులు
ముద మలరఁ దొంటియాశ్రమం ♦బునకుఁ జనిరి. 101

వ. దుర్వాసుం డొక్కండు మాత్రి మచ్చట న నిలిచి నారదమహర్షిం గూడి పరతత్త్వవిచారం బొనర్చుచుండె. పుండరీకాక్షుండు హంస డింభకోపాయం బన్వేషించుచుండె నట్టియెడ.

హంసడిభకులు బ్రహ్మదత్తుని రాజసూయము చేయుమనుట-జనార్దనుఁడడ్డు చెప్పుట

చ. గురుసచివాప్తబంధువులఁ♦ గూడి సభాస్థలి నున్నధర్మత
త్పరుఁ డగుబ్రహ్మదత్తుఁ దమ♦ తండ్రిఁ గనుంగొని హంసడింభకుల్
"నరపతి నిందు నందు నభి♦నందితుఁ జేసెడిరాజసూయమున్
జరపఁగ దీక్షగై కొనుము♦సర్వముసిద్ధ మొనర్తు మెమ్మొయిన్. 103

గీ. యాగసంకల్ప మొనరించి♦నట్టి నెలకు
ధరణినల్గడ విజయప♦తాక నిల్పి
యజ్ఞసంభారములతోడ♦ నవనిపతుల
వెంటఁ గొనివచ్చుపని మాకు♦ విడిచిపెట్టు". 104

క. అనిపలుక, సుతులమాటకు
జనకుం డానంద మొంది ♦ సభ్యులఁ గని, యే
నొనరింతు రాజసూయము
జనపతులకు యోగ్య మైన♦ జన్నంబనియెన్. 105

క. అనుడు జనార్దనుఁ దుర్వ్రా
శుని గని సైరింపు మడ్డు♦చొచ్చితి ననుచున్
విను మొక్కమాట చెప్పెద
నని హంసుని గాంచి యిట్టు♦ లనె నెయ్యమునన్. 106

చ. బళిబళి! యెట్టిసాహసము? భారతవర్షము గొడ్డువోయెనే?
యిలపయి సర్వదిగ్విజయ మిప్పుడు పోఁకకుఁ బుట్టెఁ డయ్యెనే?
తెలియక రాజసూయమును దీర్చినతొల్లిటివారిశౌర్యముల్,
తలఁపక నేఁటిశూరులయు దంతము లీగతిఁ బల్కవచ్చునే? 107

ఆ. ఇరువదొక్కమాఱు ధరణీతలం బెల్లఁ
ద్రొక్కి చూచి రాచ మొక్క లేఱి
కలుపుతీసినట్టి గండరగండండు
పరశురాముబాహు బలము వినవె? 108

సీ. ఆభార్గవునిదర్ప మణఁగించినట్టియా
చండశాసనుఁడు భీష్ముండు లేఁడె?
పరభయంకరశస్త్ర పాండిత్యమహితుండు
కురుకులాగ్రణి బాహ్లికుండు లేఁడె?
నీయాప్తబంధుండు నిర్జితారిన్పాళి
దోడ్డిఁ బెట్టినమాగధుండు లేఁడె?
కదనరంగంబునఁ గాలరుద్రుని కీడు
జోడైన తాళధ్వజుండు లేఁడె?

గీ. అఖిలశూరులలోన విఖ్యాతిఁ గన్న
యస్త్రవిద్యాఘనుండు సాత్యకియు లేఁడె?
ఔర! చాలును దిగ్విజయంబుమాట
చెప్ప కిఁక గోడలకుఁ గూడఁ జెవులుకలవు. 109

చ. ఖలుల వధించి భూతల మకంటకముం బొనరించినట్టి ని
ర్మలతరకీర్తి భూవరశరణ్యుఁడు కృష్ణుఁడు ద్వారకాపురిం
గలఁ డని నీవెఱింగియు సుఖంబుగ నున్నటు లుండ కెందు కీ
యలజడి తెచ్చుకొందువు? జయం బన మాటలు కాదు మిత్రమా?

గీ. మొన్న సన్న్యాసులను గెల్చి♦ యున్నరీతి
యప్పుడే చెప్పె దుర్వాసుఁ♦డచ్యుతునకు
దానిపై నిప్పు డధ్వరా♦హ్వాన మొకటి
కూడఁ జేరిన నగ్గిపై♦ గుగ్గిలంబె. 111

చ. యతివరపీడ యాదవుల♦ కాగ్రహకారణ మయ్యెనంచు నా
కతిథి యొకండు తెల్పె, మన♦ యాగము వారలు సాగనీరు, మీ
హితమును గోరి నేను వచి♦యించితి మానుఁడు రాజసూయమీ
హితులును మంత్రులు న్నృపుఁడు ♦నే మనువారలొ యాలకింపుమీ!

చ. అన విని హంసుఁడిట్లనె జ♦నార్దన! వారును వీరుఁ జెప్పఁగా
వినియెడి దేమి? భూవరుఁ డ♦భీష్టము తెల్పెను జాలుఁ, గాని ము
గ్గినఫల మైనభీష్ము దివి♦కిం జనఁగాళులు చాఁచి మీఁదికిం
గనుఁగొను బాహ్లికున్ గెలువఁ♦గా దని యేగతి నీవెఱింగితో? 113

మ. బలభద్రున్ గణియించువారమె సురా♦పానప్రమత్తాత్ము? మే
ల్బళిరా! సాత్యకి లెక్కచేసితివె వి♦ల్లాడంచుఁ? గంసారియా
టలు మాదగ్గఱ సాగునోక్కొ? యగచా♦ట్లింబెట్టుమా వానిఁ? గొం
పలలో దూఱక తుచ్ఛయాదవులు మా♦పై కెత్తి రా శక్తులే? 114

గీ. అట్టివారల లెక్కచే♦యంగ నేల?
శౌర్యసంపన్నుఁ డా జరా♦సంధుఁ డొకఁడె,
అతఁడు ధర్మాత్ముఁ డనుకూలుఁ ♦డాప్తబంధుఁ
డింక దిగ్విజయంబున♦ కేమి కొఱఁత? 115

ఉ. తప్పదు రాజసూయవిధి ♦తప్పదు దిగ్విజయంబు, గాన నీ
విప్పుడ ద్వారకానగరి♦ కేగి జనార్దన! యాదవేంద్రుతోఁ
జెప్పుము "మాకు నీవు దర♦సించెడి కప్పము సర్వ మప్పుగా
నప్పనచేసి యాగసమ♦యానికి ర''మ్మని నాదుమాటగా. 116

గీ. ఇట్టిపని నిర్వహింపంగ ♦నీవే తగిన
మిత్రుఁడవు మాకు నీకంటె♦మిత్రుఁ డేఁడి?
ఒక్కమఱుమాట చెప్పకు ♦మొట్టు సుమ్ము!
వెడలిపొ మ్మిది నెఱవేర్చి ♦వేగ రమ్ము. 117

చ. అనఁగ జనార్దనుండు బదు ♦లాడక నవ్వుచు లేచి "నేఁడు నే
పని జరిగించుచక్రిపుర♦యాత్ర లభించెను నేఁటి కీవిధం
బున,నిది యొక్కమేలె తల♦పోయఁగ భూపతి వద్ద మాట ద
క్కను హరిపాదసేవ సమ♦కూడు"నటంచుఁ దలంచి వేడ్కతోన్. 118

జనార్దనుఁడు జనార్దనుని సందర్శించుట.

గీ. తేనియానతి వడసి తం♦డ్రికిని మ్రొక్కి
హంసడిభకరస్పర్శ♦మాచరించి
యావలికి వచ్చి గతి సైగ♦యిచ్చినంత
ననిలగతి మించి పోవుహ♦యంబు నెక్కి. 119

గీ. ఎండఁ బడి దప్పి గొనుపాంథుఁ♦డెదుట నీర
మరసి పర్వెత్తునట్లు జ♦నార్దనుండు
కృష్ణసందర్శనపిపాస ♦హెచ్చఁ దేజి
దౌడు నడపించుచున్ మదిఁ♦దలచె నిట్లు. 120

సీ. కందోయితనియఁగాఁ♦గనుఁగొందునా నేఁడు
కులదైవతంబగు♦జలజనేత్రు!
వీనులవిందుగా♦విందునా నేఁడుని
ర్వ్యాజదయామూర్తి♦యమృతవాణి!
వేదోక్తఫలముగా♦ సేవింతునా నేఁడు
పరమేశ్వరునిపాద♦పద్మయుగము!
భావంబువికసింప♦భావింతునా నేఁడు
దేవాదిదేవుని♦దివ్యమహిమ!

గీ. ఔర! నాపూర్వపుణ్య మే మనఁగ వచ్చు?
ధన్యుఁడను నేను నన్నుఁ గన్న ధర్మమతులు
తల్లిదండ్రులు ధన్యులు, ధర్మపత్ని
ధన్యు రాలంచు భక్తిఁ జిత్తంబు పొంగ. 121

వ. పురాణపురుషోత్తముఁ డగుపుండరీకాక్షునిమహామహిమంబు మన
సార ధ్యానించుచుం జనిచని, ద్వారక సమీపించుచున్నంతఁ దా
వచ్చినపని తలఁపువాఱ స్వాంతంబు చింతాక్రాంతం బగుడు. 122

గీ. ఉప్పు తెమ్మని హరి కెట్లు చెప్పనేర్తుఁ?
జెప్ప కెట్టులు మిత్రు వంచింప నేర్తు?
అక్కటా! యెందు నాత్మజ్ఞుఁ డైనవాఁడు
చిక్కువడ కుండఁబోవునే చెలిమివలన? 123

గీ. ఐన నాహరి సర్వజ్ఞుఁ డేను దోషిఁ
గా నని యెఱుంగ కున్నె? యే నైన నేమి!
ఓటఁ దలదూర్చి రోఁకటిపోటునకును
వెఱవవచ్చునొకో! యవివేకి నగుచు. 124

వ. అని దౌత్యనిర్వహణంబు కర్తవ్యంబుగా నిశ్చయించుకొని చనుచు
మఱియును. 125

క. నాజన్మము నాకన్నులు
నాజన్నము ధర్మనిరతి నాసత్యంబున్
నాజిజ్ఞాసయు సఫలము
గాఁ జూచెద యాదవేంద్రుఁ గరుణాసాంద్రున్. 126

సీ. భక్తినమ్రుండనై భద్రపీఠము చేరి
పాదపద్మంబులు పట్టుకొందు,
ఆపాదమస్తకం బాదివ్యదేహంబు
చూచి యానందంబు చూఱగొందు,

శాంతగంభీరప్రసన్నవీక్షణ మైన
నెమ్మోము గనుఁగొంచు నిల్చియుందు,
ఎవ్వఁడ వీ వెందు కేతెంచి తనెడిభీ
షణతోషణార్థ భాషణము విందు,
గీ. ఎవనివరమున నే నుదయించినానొ?
ఆపరంధాముఁ డైనజనార్దనుండు
తనదు పేరింటిభక్తు భక్తునికుమారుఁ
గరుణఁ జూడఁడె! నారాక గనుఁగొనండె? 127

వ. అని భావించుచు ద్వారవతిఁ జేరి కృష్ణప్రసాదంబుముంగిట గుఱ్ఱము దిగి ద్వారపాలకునిచేఁ దనరాక తెలియనంపి యాదయాళునను మతి వడసి సుధర్మఁ జొచ్చి యాభక్తజనార్దనుండు. 128

సీ. నవరత్నకాంచనోన్నతసింహపీఠిపైఁ
దనతోడ బలదేవుఁడును వసింప,
ఎదుట శైనేయుండు నెడమవైపున నుద్ధ
వాదిముఖ్యాప్తులు నధివసింప,
దుర్వాసుఁడును నారదుం డుగ్రసేనుండు
కుడిప్రక్క సద్గోష్ఠిఁ గూడియుండ,
గంధర్వలోకవంక గానంబు పచరింప
నచ్చరలోకవంక నాడుచుండ,
గీ. వందిమాగధసూతస్తవంబు లెసఁగ
సభ్యసామంతహర్షనిస్స్వనము లలర
సామగానంబు కర్ణరసాయనముగ
వినుచు నిండోలగం బున్నవిష్ణుఁ గాంచి. 129

గీ. హంసదూతను భక్తజనార్ధనుండ
దేవదేవ! జనార్దన! దీనరక్ష!
యనుచుఁ బాదంబు లంటి సంవదన మొనర్చి
యల్లె బలదేవునికి మ్రొక్కి సంత హరియు. 130

వ. అతని యథోచితస్థానంబునఁ గూర్చుండ నియమించి, మీతండ్రికిఁ గుశలమా? బ్రహ్మదత్తునికి సుఖమా? హంసడింభకుల కారోగ్యమా? యని యడిగి, యానరదృష్టవీరు లేమి చెప్పి నిన్నంపిరి? వినిపింపు మనసతండు చేతులు జోడించి. 131

ఉ. ఏ మని విన్నవింతు! జగదీశ్వర! నీపదపద్మముల్ గనం
గా మది తత్తఱించు నెడఁగర్మము చాలక దౌత్య మంచు నా
కీమిష వచ్చి మీఁదఁ బడె నిందుకె డెందము కుందుచుండ, వా
రేమని రంచు నన్నడిగెదే? సకలజ్ఞుఁడ వీ వెఱుంగవే? 132

వ. అనిన విని భక్తమందారుం డగుయదునాథుండు. 133

ఉ. భూతలనాథుమాటలను మూటలుగట్టుకువచ్చి విప్పుటే
దూతలవంతు, కాని గుణదోషవిచారణ వారి కేల? నీ
వై తెగనాడ వచ్చితివె? యా దొర లన్నది తెల్ప నింతగా
భీతిల నేల? చెప్పుము లభించునె గండము మంత్రసానికిన్? 134

గీ. అనుడు విప్రుండు లజ్జాకులాత్ముఁ డగుచు
దూతకృత్యంబునం దలదూర్చినాను
గాని నీమాట జవదాఁటఁగాని యొకటి,
పాపలేశం బెఱుంగ నీపాదమాన. 135

వ. ఇది వాచ్యం బిది యవాచ్యం బిది కర్తవ్యం బిది యకర్తవ్యం బిది గ్రాహ్యం బిది యగ్రాహ్యం బని నిర్ణయింప సర్వజ్ఞమూర్తియు సర్వాంతర్యామియు సర్వజగదాత్మకుండు నగు దేవర యే ప్రమాణము

ఇఁక వారన్న దన్నట్లుగా విన్నవించుటయే నాపని. మన్నించి
చిత్తగింప వేఁడెద. 136

హంసుఁడు పంపినవార్తకు శ్రీకృష్ణుఁడుక్రుద్ధుఁడగుట.

చ. నరపతి బ్రహ్మదత్తుఁడు వా♦నర్పఁగఁ బూనెను రాజసూయ, మ
ధ్వరమును జూడఁ గప్పములు♦పట్టుకు రండని హంసడింభకుల్
ధరఁ గలరాజులం బిలువ ♦దాసుల నంపుచు, నిన్నుఁ బిల్వఁగన్
గరముగ నుప్పు తెమ్మని య♦నన్ బనివంచిరి నన్ను శ్రీహరీ! 137

చ. అన విని వింతనవ్వు నగి♦యంబుజనాభుఁడు కొల్వు గాంచి సా
ల్వుని కిపు డుప్పు మోసుకొని♦పోవలె సిద్ధముకండు యాదవుల్!
మనకు నియంత లైరి పర♦లాభమదాంధులు హంసడింభకుల్
వినుఁ డనఁ గామపాలముఖ♦వీరుల నవ్విరి, యెల్లసాత్వతుల్. 138

గీ. విఱుగఁబడి నవ్వ చొక్కరి♦వీఁపు నొకరు
చఱచుకొంచు బళీబళి! ♦చక్రపాణి
పన్ను చెల్లించు నంచుఁ జ♦ప్పట్లుగొట్ట
దూత తల వంచుకొనె సిగ్గు♦చేత నపుడు. 139

చ. హరి యతనిం గనుంగొనిజ♦నార్దన! పాపము పండె వారికిన్
గరముగ నుప్పు తెమ్మనిరి♦గా! సరి తెచ్చెదఁ దేక తప్పునే?
కర మిడఁ జక్రమో శరమొ♦కత్తియొ వారిశిరంబులం దద
ధ్వరమున, వారిదేహముల♦పాఁతఱ కుప్పు కరంబు తెచ్చెదన్.

ఉ. నీచులు తమ్ముఁ దా మెఱుఁగ♦నేరనిమూఢులు గాక, యెంతసే
పీచికిలింతయేఁపు? హరుఁ♦డిచ్చునుగాక వరంబు పోరఁ దా
నై చనుదెంచి యడ్డపడి♦యామదమత్తులఁ గూర్మిఁ గావఁగా
జూచును గాక, వార లిఁకఁ♦జూడఁగ రాదు ధరాతలంబునన్. 141

గీ. యుద్ధమున నుప్పు కప్పంబు ♦సిద్ధమనుము
దాఁడి యిఁక మూఁడునాళ్లకుఁ ♦దప్పదనుము,
స్థలము మథురాప్రయాగపు♦ష్కరములందు
సేది వా రందు రది మాకు♦నిష్ట మనము. 142

క. మోమోటపడక వారికి
నామాటలుచెప్పు దేజ♦నార్దన? పోనీ!
నీమనసునొచ్చునేమో!
యామత్తులకడకు వచ్చు ననుజుఁడు నీతో. 143

గీ. వెడలు మింక జనార్దనా! ♦విప్రబాల!
భద్ర మగుఁగాక నీకు మ♦ద్భక్తినిరతిఁ
గష్టసంసారనీరధిఁ ♦ గడచి తుదను
గాంచెదవుగాక విష్ణులో♦కంబు సుఖము. 144

క. అని పలికి, సాత్యకిం గని
చని యాతనిఁ గూడి సీవు♦సాల్వునిపురికిన్
మనమాటలు మననిశ్చయ
మును వారికిఁ జెప్పిరమ్ము♦పొ మ్మని లేచెన్. 145

సాత్యకి హంసడిభకుల చెంతకేగుట.

వ. అంతఁ గొలువువా రెల్లరు జయజయారావంబు లెసఁగఁ దమతమ సదనంబులకుం జనిరి. సాత్యకియు ధనుస్త్రాణసమేతుండై యుత్తమహయం బధిరోహించి జనార్దనుం గూడి సాల్వనగరంబున కేగి తన రాక యతనిచే హంసడిభకుల కెఱిఁగించి వా రున్నమందిరంబునకుం జని యథోచిత సత్కారపూర్వకంబుగ నర్హాసనాసీనుఁ డై నంత హంసుఁడు సాత్యకిం జూచి. 146

మ. విని యున్నాఁడను నీపరాక్రమము నీ♦విద్యావివేకంబు మఱి,
గనుఁగొన్నాఁడను నేఁడు సంతసము, సౌ♦ఖ్యంబే? సుఖోక్షేమ్మే
మనవా రందఱు మాధవాదు, లని సం♦భావించి ప్రశ్నించి, మ
న్ననకున్ మెచ్చినయట్లతండు సుఖ ము♦న్నా రెల్ల రన్నో పనిన్.
వ. హంసుండు జనార్దనుం గాంచి, 148
క. కనుఁగొన్నావా? యదుపతి
ననుమానము లేక నిన్ను♦ నంపినమాటల్
వినిపించినావ? యతఁడే
మనియెను వచియింపు మనుచు♦ నతఁ డిట్లనియెన్. 149

జనార్దనుఁడు హంసుని మందలించుట.

క. కనుఁగొంటి నంబుదశ్యా
ముని బీతాంబరుఁ బ్రసన్న♦ముఖుఁ బద్మాక్షున్
మునియదువరపరివృతకాం
చనపీఠనిషణ్ణు శంఖ♦చక్రిన్ శార్ఙ్గిన్. 150
క. కనుఁగొంటి వందిమాగధ
వినుతుని సామంతరాజ♦ వినతాంఘ్రిని స
జ్జనులం గావఁగ దుష్టుల
నణఁపఁగ నవతార మెత్తి♦నట్టిపరాత్మున్. 151
క. కనుఁగొంటి జగత్కారణుఁ
గనుఁగొంటి జగన్నివాసుఁ♦గనుఁగొంటిని నా
కనువిందుగఁ బరతత్త్వముఁ
గనుఁగొంటిని భక్తలోక♦కల్పద్రుమమున్. 152

క. వినిపించితి నీమాటలు
విని జగతీనాయకుండు వింతగ నవ్వెన్
విని నవ్వె సభాజన మె
ల్లను గడు పుబ్బంగ నేను లజ్జపడంగన్. 153

ఉ. ఏ మనువాఁడ? హంసునికి నెందుకుఁ బుట్టెనొ యిట్టిబుద్ధి? య
య్యో! మతి పోయెఁగాని, యిదు ముప్పు కరం బని యెట్లు చెప్పినా
నో మురవైరితోడ? ననియుమ్మలికమ్మున వంచుకొన్నవా
మే మటి యొత్తలే దడుగు మీ మహితాత్ముఁడు చూచె నాగతిన్.

చ. పొరపడి నోరుజారితివి పో! యిపు డైనను దప్పు దిద్దుకోఁ
దరుణము దాఁటలేదు, ముని తల్లజుఁ డొందిన బాధ తీర్ప సం
దరయు మురారి కీపలుకు లగ్గని జల్లినగుగ్గిలంబు నాఁ
జరచర మంట దెచ్చె నది సర్వము సాత్యకి తెల్పు నీపయిన్. 155

హంసుఁడు జనార్దనుని దూషించుట

చ. అన విని కన్ను లెఱ్ఱపడ హంసుఁ డిదేమిర బ్రాహ్మణబ్రువా!
ననుఁ జెడనాడి శత్రువుగుణంబులు మెచ్చెదె? యెంత సాహసం
బున కొడిగట్టినావు? మతి పోయెనె నందకుమారు దొంగడా
బును గని? వానిమాయఁ బడిపోయితె? ఛీ కనరాకు నా కికన్.

చ. సురుచిరభూషణంబులును సొం పగుబట్టలు దాల్చి గద్దెకున్
సరిపడఁ బోఁతవిగ్రహము చాడ్పునఁ జక్కఁగఁ గూరుచుండి, కా
తరు లగురాజులున్ వయసు దాఁటినవీరులుఁ బొట్టకూటిదా
సరులు నుతింపఁ ద్రుళ్లిపడు జారుఁడు దేవుఁడె నీకు దుర్మతీ. 157

చ. సమయము కార్యము న్మఱచి శత్రుని మోసపువేషభాషలన్
భ్రమపడి నన్ను దూఱి రిపురాజు నుతింతువె? తిన్నయింటివా
సములు గణించుని న్నిపుడు చంపినఁ బాపము లేదు గాని స
ఖ్యము తలపోసి కిన్క దిగనాడితి నిన్విడనాడితిం గృపన్. 158

ఉ. ఎంతటిధైర్యసాహసము ♦ లెంతమదాంధత? యోరిపాపి! నీ
యంతరమేమి? సర్వజగ♦మాత్మమహామహిమన్ భరించుదై
త్యాంతకుఁ డైనచక్రిధరు♦నంతరమేమి? వరంబు లొంది త్రు
ళ్లింతలుపడ్డవారియవ♦లేపకథల్ తలపోసి చూడుమా! 166

గీ. ఉప్పు తెమ్మన్నయంతనే ♦ యొలుకలేదు,
ఇల్లలికినంతనే పండు ♦ గెట్టు లగును?
అయిన మీమాట కడ్డమా?♦ హరికుమారు
లుప్పుతో మిమ్ముఁ గప్పంగ ♦ నున్నవారు. 167

గీ. హంసడింభకమూర్ధ బా♦ణాభిషేక
సమయమం దుప్పుసేసలు ♦ చల్లఁగోరి
వేచియున్నారు యదుభోజ♦వృష్ణివరులు
హరిసహాయులు వారిపే♦ర్లాలకింపు. 168

సీ. వీనులారఁగ మును ♦ విన్నావు బలరాముఁ
గన్నారఁగా నన్నుఁ ♦ గాంచినావు,
నుతికెక్కె రెఱుఁగవే ♦ కృతవర్మ నిశితుండు
బభ్రుఁ డుత్కలుఁడు దో♦ర్బలమునందు?
ఎఱుఁగనివా రుందు♦రే తారణాఖ్యుని
సారంగు శస్త్రాస్త్ర♦చతురమతుల?
సంగ్రామరంగదు♦స్సహు లైనవిపృథుండు
నుద్ధవుండును సుప్ర♦సిద్ధులు కద!

గీ. ఎంద అని చెప్పనేర్తుఁ గ♦న్గొందుగాక
భండనం బెల్లి లేక యె♦ల్లుండి, పోరి
కలను మధురాప్రయాగపు♦ష్కరములందు
నెద్ది యైనను మీయిష్ట ♦ మెన్నుకొనుఁడు. 169

గీ. లేక గోవర్ధనం బైన ♦ మాకు హితము,
ఏది మీ కిష్ట మెఱిఁగింపుఁ ♦ డీ! బలానఁ
గొలఁదిఁ దలగొనుకొన్నమా ♦ మ్లుల వినండి
కప్ప మర్పింతు మచ్చటఁ ♦ గదలి రండి 170

వ. అనుచు నపహాసంబుతో ధిక్కరించినకై నేయుపలుకులు [illegible]
బులు మనశ్శల్యంబులు నై వేధించినంత నయ్యాదవు [illegible]
పట్టరానికోపంబున నొక్కమాఱు మందిరంబు [illegible]
హుంకరించి. 171

ఉ. దూతవు గానఁ బ్రాణములతోఁ గనిపించెదుగాని యింతకున్
భీతియు నీతియుం దొఱఁగి ♦ ప్రేలిననాలుక కోసి నోటికై
వ్రాతలు పెట్టుకొందుమె! య♦భాజన సాత్యకి! పొమ్ము పొమ్ము [illegible]
పోతర మాజిలో నణఁగుఁ ♦ బోరికి రమ్మనుకట్టిగొల్లనిన్. 172

ఉ. యాదవుఁ డేమి? మాకు ♦ నెదురాడుట యేమి? హరప్రసాదసం
పాదితఘోరశస్త్రములు ♦ మా ప్రమథాధిపమైత్రి గాంచి నై
నా దరిసింపరాఁడె కద ♦ నంబునఁ గప్పము? నీవు పొమ్ము, [illegible]
పేదుర మంచుఁ బుష్కరము ♦ నెన్నితి మంచును చెప్పు వానికిన్.

చ. కరము నొసంగ కిందు బ్రతు ♦ కంగలఁడే యెవఁడేని? సర్వభూ
వరమకుటప్రభారుచిర ♦ పాదసరోజులు సార్వభౌము లీ
శ్వరవరలబ్ధశస్త్రవర ♦ సాధితదిగ్జయరాజసూయు ల
న్గురుతరకీర్తి హంసడిభ ♦ కుల్ గనువా రని చెప్పు వానికిన్, 174

చ. హరికి సహాయు లన్నసరు ♦ కంతయు వాచవి కైనఁ జాలునే
సురపతిఁ గేరుపంచశత ♦ శూరులు సూరెలఁ దీరుమాకు? నం
గరమున నెంద తాపసుల ♦ కాపదిఁ గాచినఁ ద్రొక్కిపట్టి కం
ధర మరి పుచ్చుకొందు మిది ♦ తప్పక ముందుగఁ జెప్పు వానికిన్.

గీ. అనుడు సాత్యకి లేచి దు♦రాత్ములార!
బ్రతికి పోతిరి దూతనై ♦ వచ్చియుంటఁ,
గాని-చో మీర లీగతిఁ ♦గాఁబు లఱవ
నింతసే పూరకుండునే ♦యీనాఁకటారి? 176

చ. అదియును గాక మీమరణ ♦మూజగదీశ్వరుఁ డంబుజాక్షుఁ డా
యదుకులభూషణుండు దితి♦జాంతకుఁ డైనమురారిచేత ను
న్నది, యది గాన నాశరము♦నన్ మృతి తప్పెను మీకు నేఁటికిన్
బ్రదుకుఁడు, రేపు శ్రీహరిశ♦రంబులఁ జత్తురు గాక, యేగెదన్.

క. అన హంసడింభకులు చ
య్యన మీఁదికి వచ్చి దూత♦వగుటం బ్రాణం
బునఁ దప్పితి వీనాఁటికిఁ
దునియదె నీనాల్క రేపు ♦తొలఁగుము పాపీ! 178

వ. అనుచు వారు మాటకు మాట బదులాడి కడుపుమంట దీర్చుకొని నంత, సాత్యకి నవ్వుచు నోరీదురహంకారులార! రేపు జీవంబుతో నే నుందునో మీ రుందురో పుష్కరతీరం బెఱుంగును లెండు రండి రండి యనుచీవలికి వచ్చి తనహయంబు నెక్కి వాయువేగంబున నిజ పురంబున కరుదెంచి జరిగిన దంతయు జనార్దనునకు విన్నవించె. అతండు నాక్షణంబ బలాధ్యక్షుల రావించి "రేపు పుష్కరస్తీరం బున మనకు హంసడిభకులతో మహాసంగ్రామంబగు నందుకుం దగిన సకలసంభారంబులతో వివిధసన్నాహంబులతో సిద్ధముకం డని యానతిచ్చె నంత నానాఁటి వేకువజామున. 179

—యాదవుల పుష్కర ప్రయాణము—

చ. అరదములన్ గజంబుల హ♦యంబుల నెక్కి పదాతికోటి ముం
దరుగ, బలాధినాథులు స♦హాయులుగాఁ దురగాధిరూఢులై
గురుతరసర్వసైన్యముల♦కున్ నలుప్రక్కల వృష్ణిభోజభూ
వరయదువీరపుంగవుల♦ బారులుతీరిన తేసు లేగుచున్. 180

చ. పరమితి లేనివీరభటవాహము ప్రక్కల రాఁగ ఘూర్ణని
ర్భరతరభేరిభాంకృతు లరాతులగుండెలు వ్రీలుచుండఁ
సత్వరగతి వచ్చుచుండ, యముఁడల్లన సాహసపరాక్రమోద్ధా
స్వరుఁ డయి యాయుధంబులు [illegible]
[illegible]. 181

గీ. సూతమాగధవంది సంస్తుతు లెసఁగ
బ్రాహ్మణులమంత్రపాఠంబు పరిఢవిల్ల
దారుకుఁడు పూన్కి నడుపురథంబు నెక్కి
చనుచుఁ బూరించె వడిఁ బాంచజన్య మపుడు. 182

ఉ. ఆనినదంబు కొండగుహలంటి గుభిల్లన మాఱుమ్రోఁతలన్
గానలు నేలఁ గూలిననినాదముతోఁ జని ఘూర్ణితాంబుధి
స్వానముతోఁ దిశాప్రతిరవంబులతోఁ జెలరేఁగి పెల్లుగా
ధ్వానతరంగరూపమునఁ దాఁ జన లంపెట [illegible]. 183

వ. ఇవ్విధంబున సమధికచతురంగబలంబులతో వారిధిపుండు పుష్కర
సరస్తీరంబు చేరి యందలిస్కంధావారంబు చేరి [illegible] వీర
సామంతదండనాథులు [illegible] బులు [illegible] వరం
బున నుపస్పర్శ మాచరించి యతివర్యులకు నమస్కరించి [illegible] బల
నాధసమేతులై బలభద్రసాత్యకులు పన్ను మోహనంబులు వీక్షించు
చుండె నయ్యవసరంబున. 184

హంస డిభకుల యుద్ధసన్నాహము

సీ. సితచందనాక్షతాంకితకూర్చభాగులు
భస్మపుండ్రోజ్జ్వలత్ [illegible] ఫాలతలులు
స్ఫటికలింగవిభాసితవక్షఃకవాటులు
తపనీయఘటిత [illegible] పదులు

ధగధగాయితతనుత్రాణశిరస్త్రాణ
గోధాంగుళిత్రాణగుప్తతనులు
బహువిధశస్త్రాస్త్రభరితరథారూఢు
లక్షీణతూణచాపాసిధరులు,

గీ. అగుచుఁ బ్రమథులజంట ముందరుగుచుండఁ
బటహభేరీరవంబు దిక్తటము లంటి
చన, దశాక్షౌహిణీసైన్యసహితు లగుచు
బయలువెడలిరి హంసడింభకులు వేడ్క. 185

సీ. రాక్షసేశ్వరుఁడు సంగ్రామధీరుఁడు ప్రాణ
సఖుఁడు హిడింబుండు జయము కోరి
తనతోడ నెనుబదియెనిమిదివేలర
క్కసులతోఁ బోరికిఁ గదలి రాఁగ,
ఆది నింద్రుని గెల్చినట్టిశూరుండును
యాదవతతి నొంచినట్టిఘనుఁడు
హంసడింభకుల కత్యంతప్రియుండు దా
నవనాథుఁడు విచక్రనాముకుండు

గీ. యాదవులమీఁదిపగ దీర్చుకోఁదలంచి
లక్షలకొలందిదైత్యబలంబుతోడ
బహువిధాహవసాధనసహితుఁ డగుచుఁ
బటుతరస్యందనం బెక్కి బయలుదేఱె. 186

గీ. హంసడిభకులవార్తకునాప్తమిత్ర
బంధుజన మెల్ల తోడుగావచ్చెఁ గాని
నిర్నిమిత్తవిరోధంబు నింద్య మనుచు
సాగి రాఁ డయ్యె నాజరాసంధుఁ డొకఁడు. 187

ఉ. ఆగతిఁ గూడినట్టిచతురంగబలంబులు భూమి యీనిన
ట్లేగెడునట్టియొత్తడికి నేళ్లు తటాకము లింకె, వృక్షముల్
పోగులుపోగులై పడియెఁ లోయలు మెట్టలు మట్ట మయ్యెఁ ద
ద్వేగవిధూతధూళివినువీథిని బర్వె విచిత్రరూపమై. 188

గీ. కడువడిం బొంగి పొరలెడుకడలిమాడ్కి
లయసమయచండవేగానిలంబుపోల్కి
వారిచతురంగసేనాప్రవాహ మింత
లోనఁ బుష్కరతీరంబు గానవచ్చె. 189

గీ. పుష్కరం బెన్నఁ గొనె యుద్ధభూమి గాఁగ
హంసుఁ డది యొక్కటే వానియర్హగుణము,
ధరణిఁ గలయెల్లపుణ్యతీర్థంబులందు
ముందుగాఁ జెప్పఁదగినది పుష్కరంబె. 190

గీ. పుండరీకాక్షుఁడును మఱి పుష్కరంబు
పాప మణఁగించు దర్శనస్పర్శనముల
నట్టియుభయంబు నొక్కమాఱరయునట్టి
భాగ్యము లభించె నిరువాగువారి కెల్ల. 191

యదువీర హంసడిభకుల ఘోరసంగ్రామము

వ. అట్లు వచ్చినసైన్యత్రయంబు సర్వంబును బుష్కరతీరకదనరంగంబు చేరినంత నుభయపక్షంబుల భేరీకాహళపణవఝర్ఝరడిండిమాది వాద్యంబులు కడు మ్రోఁగుటయు రెండుబలంబులు దలపడియె నప్పుడు రథికులు రథికులం గదిసియు నాశ్వికు లాశ్వికులం గూడియుఁ బదాతులు పదాతులం గలసియు నతిఘోరంబుగ సమ యుద్ధంబు జరుపుచుండ, రాక్షసబలం బతివేలంబుగ యదుబలం బుపైఁ బడుటయు వృష్ణిభోజవీరు లాగుంపును ముట్టడించి నిశితశర

పరంపరల వారిని గాలుసేతులు ఖండించియుఁ గంఠంబులు తెగనఱి కియు నురంబులు చీల్చియుఁ బొలికలను రక్తమునుం బగునట్లు చించి చెండాడుడు హతశేషం బగునిశాచరగణంబునఁ గొందఱు కాంది శీకులై కాలికిబుద్ధి చెప్పిరి. కొందఱు పిపాసార్దితులై ఘుమ్కారంబు చొచ్చిరి. కొందఱు నేల కౌఁగిలించుకొని పడియుండి రట్టియెడ హంసడిభకులు చెఱియొకప్రక్కనుండి యోహో! ఓడకుఁ డోడ కుఁడు మే మున్నవార మనుచు, నేఁడియాదవగోపాలుఁ డెక్కడ నున్నాఁడనుచు, సమరాంగణమధ్యంబున కేతెంచుచున్నంత; వారికి ముందై విచక్రుం డతిరయంబునఁ జక్రపాణి నెదుర్కొనె, బలభద్రుండు హంసు నెదిరించె, సాత్యకి డిభకు నడ్డగించె, హిడింబు నుగ్రసేన వసుదేవు లెదుర్కొనిరి, తక్కినయాదవాదివీరులు పరపదాతిమర్ద నంబున సంసక్తం బయ్యె, నంతఁ గర్మసాక్షి గగనతలమధ్యగతుం డగుటయు. 192

సీ. చక్రాయుధుండు విచక్రుని డెబ్బది
మూఁడుశరంబులఁ గ్రమ్మి నతఁడు
వాఁడిములుకి హరివక్షంబు గొట్టె గ
ర్భస్థలోకము లాదిఁ గ్రక్కినట్లు
నెత్తురు గ్రక్కంగ, నత్తఱిఁ గృష్ణుఁడు
క్రుద్ధుఁడై సిడమును గుఱ్ఱములను
సారథిఁ గూల్ప నసహ్యవీరుండు దిగి తేరు
బొప్పి కట్టఁగ నొసల్ బొమిడికంబు
గీ. తల్లడం బంద గదఁ గొట్టె యల్లనార్చి
బండరా మెత్తి వేయంగఁ బంకజాక్షుఁ
డందుకొని దానిఁ ద్రిప్పి యసహ్యసురఁ గొట్టె
వాఁడు మూర్ఛిల్లెఁ బ్రాణముల్ పోసినట్లు. 193

వ. అంతఁ గొంతసేపటికి వాఁడు తెలివి వడసి లేచి కోపావేశంబున ఘోరం బగుపరిఘం గొని యోరీ! యింతమాత్రంబున కెగిరిపడకుమని యదలించి. 194

మ. తొలి దేవాసురసంగరంబునెడ నాతోఁ బోరఁగా వచ్చినా
బలముం గన్గొని భీతి చెందఁతివిగావా? వాఁడనే నేను, నా
దళితేందారిమరబాహుదర్పము నదే దైత్యారివా నీవు? నేఁ
డిలఁ గృష్ణారిని నేను గాచుకొనుమీ యీదెబ్బ గోపాలకా? 195

క. అని పరిఘ విసరఁగాఁ గ
త్తిని దానిం దునియ నఱికి దితిజాధము! పొం
గణఁగినదా? యని, చెట్టుం
గొని వేయఁగ దానిఁ జెఱిచి కూలిచి పిదపన్. 196

చ. హరి యపు డుగ్రబాణ మనలాస్త్రముతో జతచేసి యేయ న
ద్దురితుని బూదిచేసి యదితోడన తూణముఁ జేరె నంతఁ గా
తరు లయి దైత్యు లెల్లరు యథాయథలై పరుగెత్తి యబ్ధిఁ జొ
చ్చిరి మఱి చచ్చిరో బ్రతుకు జీవుఁడ! యుం చట నుండిపోయిరో!

క. అక్కడ హంసుఁడు హలధరుఁ
డెక్కువతక్కువలు లేక యెక్కటిపోరన్
నెక్కొని తుద కరదంబులు
ముక్కలుగా నేల కుఱికి ముంచినకిన్కన్. 198

వ. గదాయుద్ధంబునకుఁ గడంగి కుడియెడమప్రక్కలకు మాఱుచుఁ గూర్చుండియు నిలచియు వంగియు మోఁకత్రిప్పియు నొఱగియు మొక్కలించి యిట్టిగదాసంగ్రామంబు గన్నది గా దని యిందలివా రందలివారు నచ్చెరువడుచుండ నొకరి నొకరు వధింపఁ గోరి యొక్కరి కొక్కరు తీసిపోక యలసియు సొలసియుఁ బట్టువిడువక ట్టులె యతిఘోరంబుగఁ బోరుచుండి రాసమయంబున. 197

క. కసి మసఁగుపూన్కి సాత్యకి
కసి దీరఁగ వాఁడిమొనలకలకమ్ముల మే
నసియాడఁ గొట్టె డింభకు
నోసటన్ నిశితాంబకంబు నొవ్వఁగ నాటన్. 200

గీ. అతఁడు శైనేయురథముపైఁ గైదువేల
శరము లేయంగ జడివాన కురిసినట్లు
సాత్యకియు వాని నడుమనచక్కఁ బెట్టి
డింభకునిచేతివిల్లు ముష్టికిని ద్రుంచె. 201

గీ. వాఁడు వేఱొక్కవి ల్లందివాఁడిముల్కి
మోమున న్నాటఁ బూచినమోదుగట్టు
లమరి సాత్యకి కినిసి వాఁ♦ డందుకొనుట
తడవుగా నూటపదివింట్ల♦ తుడిచిపెట్టె. 202

ఉ. నిక్కము విల్లు చేతఁగొను♦ నేర్పున డింభక ! సాటి లేదు నీ
కెక్కుడి నేని యంచు హాసి♦ యింపఁగ ఖడ్గముఁ బూని యాతఁడీ
సెక్కినపూన్కిఁ దేరు డిగె ♦నీపయిఁ గత్తిని బట్టుచాతురిన్
జక్కఁగఁ జూపెదే యనుచు♦సాత్యకియున్ దిగెఁ దేరు కత్తితో.

వ. అంత వారిరువురు సౌభద్రదాశ్వాసని నకులసోమదత్తులం బోలి ఖడ్గవిద్యాప్రావీణ్యంబు మెఱయ భ్రాంత ముద్భ్రాంత మావిద్ధము ప్రవిద్ధము బహునిస్సృత మాకారము వికారము భిన్నము నిర్మర్యాద మమానుషము సంకోచితము కులచితము సవ్యజానువు విజాను నాహికము చిత్రకము క్షిప్తము కుసుంభము లంబనము ధృతము సర్వబాహువు వినిర్బాహువు సవ్యేతర ముత్తరము త్రిబాహువు తుంగబాహువు సవ్యోన్నత ముదాసి పృష్ఠతఃప్రథితము యథాధికము ప్రథిత మనుముప్పదిరెండుప్రకారంబులఁ బరిక్రమించి పరాక్ర

మించి పరస్పర ప్రహరణపరాయణులై యన్యోన్యజిగీషాయత్తచిత్తులై యితరం బెఱుంగక యిహమో పరమో యిదే తేల్చవలె నన్నంతదృఢదీక్షతోఁ బోరుచుండ గగనతలంబున దేవగంధర్వులు గుంపులుకూడి యాదద్వంద్వయుద్ధం బాలోకించుచు గెలుపోడులు నిశ్చయింపలేక యౌరా! యీఖడ్గయుద్ధం బప్రతిమానంబు. వీరిలో నొకఁడు ద్రోణునిశిష్యుఁడు వేఱొకఁడు పినాకిశిష్యుఁడు. వీరిశౌర్యచాతుర్యంబు లెన్నవచ్చునే? వాసుదేవార్జునసాత్యకులు మువ్వురును శస్త్రాస్త్రకోవిదులు సంగ్రామదుర్జయులు, మహేశ్వరకార్త్తికేయడింభకులు మువ్వురు మహారథు లాహవదుర్దాంతులు, మొత్తమార్వురు నసదృశబలపరాక్రములు. ఇఁక వీరి తారతమ్యం బేర్పఱుప నెవరితర మంచుఁ బ్రశంసించుచుండి రట్టియెడ. 204

వసుదేవుఁ డుగ్రసేనుఁడు
ముసలితనం బనక మొనకు ♦ మొనగాళ్లైరా
క్షసనాయకుపై సాయక
విసరము గురిపింప, లక్ష్య♦ పెట్టకవారిన్. 205

కత్తి ఖణేల్ ఖణే లనెడి♦కాయమువాఁడు హిడింబుఁ డుద్ధతిన్
మత్తగజంబు తూళ్లు తిను♦మాడ్కిని వృష్ణిబలంబువారి ను
వ్వెత్తుగ మెక్కుచుండఁ గని ♦వృద్ధమహీపతు లాత్మతూణముల్
రిత్తలు గాఁగఁ దక్షలుశ♦రీరము ముంచిరి బాణధారలన్. 206

అప్పుడు వాఁ డాసాయకంబు లెల్ల దిగమ్రింగి వారివైపు నవ్వుచు వచ్చియోరీ! బడుగులమేనికండ యొకపంటిక్రిందికైనఁ జాల దని యింతదనుక మిమ్ము భక్షింపకుండుట నాతప్పు గాని యిది మీ తప్పుగా దనుచు వారి నరదంబులనుండి క్రిందికి దిగలాగి విండ్లువిఱిచి.

గీ. కాఁగి చల్లారినట్టిదు♦గ్ధంబులట్టు
లాస దీరంగ మీనెత్తు♦రానువాఁడ
ననుచుఁ దెఱవంగ నోరు, నా♦రాకలపడి
పరుగులెత్తిరి తమవెంటఁ♦ బడఁగ వాఁడు. 208

చ. అది గని యచ్యుతాగ్రజుఁ డు♦హాంసుని కచ్యాశుఁ గూర్చి వచ్చి, నీ
మద మణఁగింతు రమ్ము నను♦ మార్కొను మంచు హిడింబుఁ బిల్వ, వాఁ
డది విని మోము ద్రిప్పి వివృ♦తాననుఁడై బలభద్రుఁ జేరి యో
మ్మదరఁగ గ్రుద్దె, బాహుబల♦ మారఁగ నాతఁడు గ్రుద్దె వెంబడిన్.

క. అడిగెడి దే మిఁక వారల
పిడిగ్రుద్దులు చెంపపెట్లు ♦పిడికిటిపోట్లున్
మడమలతాపులు తన్నులు
నొడుపులు మోఁకాలిపోట్లు♦సహో రన మ్రోఁగెన్. 210

ఉ. ఎందును దీసిపోక యటు♦లిద్దఱు పోరుచునుండ దప్పికం
బొంది హిడింబుఁ డేపుచెడి ♦బోరగిలం బడ రాముఁ డాఖలున్
సందిట, బట్టి యెత్తి పది♦సారు లెగాదిగ నూఁచి చావరా
పంద!యటంచుఁ గ్రోసుపయి♦పట్టునఁ గూల గిరాటువేసినన్. 211

ఆ. చచ్చినట్లు వాఁడు♦ చాలసే పట్లుండి
యంతఁ దెలిసి లేచి♦చెంత నున్న
మడుగునీరు ద్రాగి ♦యడుగులు తడఁబడఁ
దప్పిపోయె నడవి♦దారి పట్టి. 212

ఆ. అంతనాహిడింబునిహతశేషపరిచరు
లందు నొక్కఁ డేని నమందు కైనఁ
గానరాక భీతిఁ గన్నదిక్కై మాయ
మైరి వేవెలుంగు నస్తమించె. 213

గీ. కలనిలో వారు సరిగ నొక్కరికి నొకరు
కనఁబడీకనఁబడకుండఁ జీఁకట్లు వేగ
నలముకొనుచుండ గ్రుడ్డివెన్నెలయు వచ్చెఁ
గాని యారేయియుద్ధంబు కట్టిపెట్టి. 214

గీ. ఆజిరంగంబు గోవర్ధనాద్రితటము
ప్రొద్దుపొడుపున రే పందు పోరు పొసఁగు
ననుచు నిర్ణయ మొనరించి హరి తెలుపఁగ
హంసడింభకు లౌఁగాకయనుచునపుడు. 215

గీ. చచ్చినాఁడు విచక్రుండు చచ్చినట్లు
జాఱినాఁడు హిడింబరాక్షసుఁడు, వారి
కాల్బలంబు హతంబు నిర్గతము నయ్యె,
ననుచు వినియును హరువర మాత్మఁ దలఁచి. 216

చ. అది మన కెంతయుం దగినయాహవరంగ మటంచు సేనకుం
గదలఁగ నానతిచ్చి యినకాంతులఁ బోలెడికాగడాలు త్రో
వ దెలుపఁ గొండ కేగిరి జవంబున, రే యట నిల్చి సేనతో
యదుకులవర్ధనుం డరిగెనగ్గిరికిన్ రవితోఁచువేళకున్. 217

గోవర్ధనాద్రిపై రెండవనాఁటియుద్ధము

వ. అంత నప్పర్వతంబునుత్తరపార్శ్వంబున యమునానదిచెంత నుభయ
బలంబులు వ్యూహంబులఁ దీరుటయు. 218

ఉ. భేరులు మ్రోఁగె, హేషలును బృంహితముల్ చెలరేఁగె, వీరవి
స్ఫారము తోఁచెఁ, జక్రములసందడి యేచెను, హంసడింభకుల్
తేరుల సిద్ధమైరి, వసుదేవుఁడు ముందుగఁ బెద్దపిన్న లౌ
శూరులు వారిమార్కొనిరి చూచుచునుండిరి రామకేశవుల్. 219

సీ. వసుదేవుఁ డేసె డెబ్బదిబాణములు హంస
డిభకులమీఁద గడించికడిమి
సారణుం డిరునది సాత్యకి యఱువది
మూఁ డుగ్రసేనుండు మూఁడుపదులు
ప్రద్యుమ్నసాంబులు పదియార్లు పదియేళ్లు
విరటుండు కంకుండు నిరువదేసి
ఎనుబది పృథుండు నేయంగ నతపర్వ
సితసాయకంబు, లచ్చెరువు గాఁగ

గీ. ఆసహోదరు లాయమ్ములవనిఁ గూల్చి
క్రూరబాణంబులు పదేసి కూర్చియొక్క-
రొక్కరిని గొట్ట నెత్తురు గ్రక్కుకొనుచు
భయపడుచు వారు తొలఁగి రా పట్టునందు. 220

ఉ. పాకము తప్పెఁగార్యమని పంకజనేత్రుఁడు హంసుఁడాఁకఁ గాఁ
డాఁకె హలాయుధుండు బల దర్పితు డింభకు, వారికయ్య మా
నాకమువారు తొంటిసుర నాయకతారకజిద్రణంబు తీ
రై కనుపట్టె నంచుఁ గొని యాడుచు నుండిరి పుష్పకంబులన్. 221

గీ. తమదుబాణాలు వీరికిఁ దగిలినప్పు
డఱచి శంఖాలు పూరింప హంసడిభకు,
లాత్మశరములు వారిఁ దూఁటాడినపుడు
సింహనాదం బొనర్చిరి సీరి శౌరి. 222

ఉ. ఆలము సాగుచో నటులు హంసునిచాపము త్రుంచి వేఱు వి
ల్కేలను బూనఁగాఁ దునిమి కృష్ణుఁడు పట్టఁగఁ బాంచజన్యమున్
శూలము లార్చుచున్ బ్రమథ శూరులు మీఁదికి వచ్చి రంతఁ జి
ల్లీలగ శౌరి తేరుటికి లేసగ వారఁగ వారి నిద్దఱిన్. 223

గీ. కేలు కేలును గాలును గాలు కలిపి
పట్టి పైకెత్తి కొఱకంచుఁ బగిదిఁ ద్రిప్పి
వెండికొండ మొగంబుగా విసర, వారు
హరహరా! యంచు బంతులట్లును పడిరి. 224

క. ఆపని గనుఁగొని హంసుఁడు
కోపారుణలోచనములఁ గొఱకొఱఁ గనుచున్
గోపాలకుతో నిట్లనె
భూపతులును మింట సురలు మునులున్ వినఁగన్. 225

హంసుఁడు కృష్ణుని ధిక్కరించి యుద్ధము చేయుట.

క. ఏమోచితక్రియము చేసితి
వీమాయలు తుచ్ఛమహిమలీ తంత్రంబుల్
నాముందు కట్టిపెట్టుము
నీమద మణఁగింపఁ గోరి నే నున్నాఁడన్. 226

చ. మనుజవరేణ్యు లందఱును మా కరియప్పన మిచ్చినారు మా
జనకుఁడు రాజసూయమును సల్పఁగఁ గోరుచు, నీ వొకండ వే
మని యది యడ్డుపెట్టెదవు? ప్రాణము తీపగునేని యిచ్చి పో
వెనుకకు, నివ్వవేని యొక వ్రేటున కిచ్చెదు నట్లు చేసెదన్. 227

చ. ఎఱుఁగుదువా యమర్త్యతతి కీశ్వరుఁ డీశ్వరుఁ డంచు? సల్లె న
న్నెఱుఁగుము మర్త్యసంతతికి నెల్లెడ నీశ్వరుఁ డంచు వింటివా?
యఱమర లేక చెప్పు మిపు డైన మనంబునఁ జింతచేసి నా
కఱకుమెఱుంగుతూపులకుఁ గంఠము నిత్తువొ కప్ప మిత్తువో! 228

వ. అనుడు జగన్నాథుం డపహసించి యోరీ దురహంకార! నావల్లఁ
గప్పము గొనఁ గోరుదేని నీబలంబు చూపికొమ్ము. నీవు బాధించిన
యతులు నిన్ను శపించుచుఁ బుష్కరంబున నున్నవారు. నే

నుండఁగా నీవు వర్ణాశ్రమంబులు శాసించువాఁడవా? నీవంటి బ్రహ్మ-ద్వేషులగు దుష్టుల ఖండించి లోకంబు రక్షింప నవతరించిన జగ-త్పాలకుఁడను నే నుండ నీవు ధరాతలేశ్వరుఁడవా? నీవు నన్నుఁ గప్ప మడుగునంతటివాఁడవే? ఎంతమదాంధత! నీపాపంబ నిన్నుఁ బొరియింప నున్నది చూడుమని తూలనాడ, వాఁడు కుపితుండై.

క. ఆకర్ణపూర్ణ ధన్వుం
డై కర్కశనిశితబాణ సమడరింప వడిన్
వైకుంఠునుదుట గట్టిగ
నాఁటుచు నయ్యాది లలామ♦శోభం దెచ్చెన్. 230

వ. అంత సముత్కటకోపారంభుఁడై. 231

ఉ. శౌరియు దారుకున్ వెనుక♦చక్కని గావఁగ నంపి తేరికిన్
సారథిఁ జేసి సాత్యకిని♦శాతశరం బనలాస్త్రసంగతిన్
గూరిచి, యోరి! నిన్ను ముని♦కుంజరుశాపము కొంత కాల్చె నిం
డారఁగఁ గాల్చివేయు నిది♦యంచు బలంబుగ లాగి యేయుడున్.

ఆ. వారుణాస్త్ర మేసి♦వాఁడు దాని నణంచె,
నితఁడు పావనాస్త్ర♦మేసె మరల,
నతఁడు దానిఁ ద్రొక్కె♦నైంద్రాస్త్ర మడరించి,
యపుడు హరి మహేశ్వ♦రాస్త్ర మేసె. 233

గీ. అతఁడు రౌద్రాస్త్రమున దాని♦నణఁప హరియుఁ
బ్రబలపైశాచగాంధర్వ♦రాక్షసములు;
బ్రాహ్మకౌబేరయామ్యాసు♦రంబు లతఁడు
సరి ప్రయోగించి పోరిరి♦సమముగాఁగ. 234

వ. అంత బద్ధమత్సరుండై. 235

చ. ప్రకటవిరోధినాశకము♦బ్రహ్మశిరోఽ_స్త్రము నెత్తి యేయ నం
దకధరుఁ, డట్టియ_స్త్రమున♦దాని నణంచెను హంసుఁ, డాతఁడం
దుకు వెఱఁగంది వశ్యమతి♦తో యమునాజల మాచమించి వ
చ్చి కడఁగి వైష్ణవా_స్త్రమునఁ♦జేర్చినయమ్మున హంసునేసినన్ 236

—♦ హంసుఁడు పాఱిపోయి యమునలో నణఁగారుట. ♦—

చ. దితిజులఁ గూర్చి తొల్లి యఁ♦త్రిప్రజకున్ జయ మిచ్చి విశ్వవం
దిత మయినట్టిదానిపడి♦ తేఱి కనుంగొన లేక దానికిం
బ్రతి గనరాక బెగ్గిలి గ♦భాలునఁ గిందికి దూఁకి కాళియా
హి తెగినచోట వాఁడు పడి♦యెన్ యమునాతటినీహ్రదంబునన్. 237

చ. హరియును వానివెంటఁ జొడి♦యందఱు నచ్చెరు వంది చూడ నీ
కరియును నప్పనంబు నిదె♦యంచు శిరంబును గాలఁ దన్ని వె
న్దిరిగెను, హంసుఁ డప్పుడ మృ♦తిం గనెనో యుడు గంటి పన్నగే
శ్వరునికి దక్కెనో యెఱుఁగఁ♦జాల మెఱైనను వాఁడు లేఁ డిలన్.

గీ. హంసుఁ డట్టులు మడుఁగులో♦నణఁగి పోవఁ
"జచ్చె హంసుండు వైష్ణవా♦స్త్రమున" నన్న
మాట కరతాళములతోడ♦మాఱుమ్రోఁగె
భువిని దివి నొక్క_తీరున♦భూతలేంద్ర!. 239

వ. అని చెప్పి వైశంపాయనుండు. 240

చ. జనవర! హంసు నాగతిని♦జంపకయున్న జనార్దనుండు, నీ
జనకునితాత ధర్మజుఁడు ♦సల్పఁగఁ జాలునె రాజసూయ? మ
య్యనుపమశ_స్త్రసంపదయు♦నవ్వరముల్ గల వానిముందు ని
ల్చునె మనరాజలోక? మద♦సూ! కత మాహరి వానిఁగూల్పఁగన్.

వ. అనుచు జనమేజయునకు హంసవధత_త్త్వం బెఱింగించి మఱియు నిట్లు
చెప్పందొడంగె. 242

డింభకుఁడు సోదరునికై విలపించుట. యమునలోఁబడిచచ్చుట.

చ. కలను గలంగ బోరు కలఁగం దనయన్న మడుంగులోఁ బలం
బొలిసినవార్త డింభకుఁడు భూధర మాదలఁ గూలినట్లు క్రుం
గిలి యరదంబు డిగ్గి హాలి కేరుచు వెంటఁ బడంగ నన్న! యెం
దులఁ బడినా వటంచు మది తూలఁగఁ బర్విడి యాహ్రదంబునన్.
గీ. దుమికి మడుఁగెల్ల గలఁచి లోఁతునకు మునిఁగి
కాలుసేతులఁ దడవి యెక్కడను గనక
తేలి యప్పటి కచటి కేతెంచియున్న
వాసుదేవుని గని కిన్కవంతదనర. 244
క. ఓరీ గోపాలక! రణ
ధీరుని మాయన్నఁ జూచితే? యని యడుగన్
శౌరి యమునాహ్రదంబుం
గోరి యడుగు మనియె వాఁడు గొబ్బున దానన్. 245
ఆ. మరలఁ జొచ్చి మునిఁగి మడుఁగెల్ల సగ్గడ
గలయఁ దిరిగి విసిగి గట్టు చేరి
నెత్తి బాదుకొంచు నేలపైఁ బొర్లుచు
నన్న యన్న! యంచు నడలె నిట్లు. 246
శా. అన్నా! ఒక్కనిఁ జేసి పోయితివె నన్నా! ప్రేమయేమయ్యె? నే
నన్నం బ్రాణము కాదె నీకుఁ దగునా? హా! యీశ్వరుం దల్పవే?
నన్నుం బిల్వవె! రాజమిత్రులకు నైనం దెల్పవే! యింతనీ
సన్నాహంబును దండ్రిజన్నమును హంసా! యేటికర్పించితే? 247
ఉ. ఆహరుమెప్పు గాంచి వర మందినధీరుఁడ వస్త్రశస్త్ర వి
ద్యాహవమర్మవేత్తవు నృపాళికాన్కలు చీటిఁ గొన్న నీ
బాహుబలంబు నీకు సరివచ్చెడుతమ్ముని దోర్బలంబు దు
ర్మోహవశంబున న్మడుఁగు రొంపి నణంపఁగ సాహసించితే? 248

చ. పరులను దగ్ధులంబులనుఁ భస్మముచేయుదు నైననేమి? సో
దరుఁడవు నీవు చూడవుగదా! నిను మ్రింగిన రాజసూయమా
దరమునఁ దండ్రి చేయఁడుగదా! నినుఁ జేరఁగ వచ్చునే
ధరణితలంబు నేలను గదా! యని యస్త్రము సన్యసించితిన్. 249

వ. అయ్యో! అన్నా! తలఁచినకొలఁదిని గుండె బద్దలగుచున్నది. మన యాలోచన మెంతయుఁ దల్లక్రిందైనదిగదా! యని తలనేలఁ బెట్టి కొట్టుకొని పెద్దపెట్టున నేడ్చి యేడ్చి. 250

గీ. అక్కటా! యెంతయవమాన? మెక్కడైన
సమరశూరుండు రణములోఁ జచ్చుఁ గాని
పాఱిపోవునే?, ఛీ! యింత బ్రతుకు బ్రతికి
యింక శత్రుని మొగము నేనెట్లుచూతు? 251

వ. అని కరతలంబుల మొగంబు గప్పుకొని. 252

సీ. శంకరా! నీసేవ సంతరించిన దివ్య
శస్త్రాస్త్రవితతి నిస్సార మయ్యె,
పురమర్దనా! మాకుఁ బోరిలోఁ దోడైన
భూతనాథులశక్తి పొల్ల యయ్యె,
ఈశ్వరా! నీకూర్మి కేకతావల మైన
మాయన్న యేటిలో మాయ మయ్యె,
రాజశేఖర! నీవరంబులు నమ్మిన
రాజసూయంబు ప్రభ్రష్ట మయ్యె,

గీ. శివశివా! ఉట్టినాలుగుచేర్లు తెగియె
నన్నుఁజూపింపు మిం నా కనుచు లేచి
వ్రేళులం బట్టి నాలుక పెఱికికొంచు
మడుగులోఁ బడి ప్రాణంబు విడిచె నంత. 253

వ. అట్లు హంసడిభకుల నణఁగించి పుండరీకాక్షుండు భండనరంగంబునం గరు దెంచి యఖిలబలంబులతో ద్వారకం జేర యాదవాదివీరుల కాన తిచ్చి బాల్యంబున గోపబాలకులం గూడి క్రీడించిన గోవర్ధనతటం బులం గొంతసేపు విహరింపఁ గుతూహలంబు వొడమ బలభద్రసహా యుండై యం దరిగె నాసమయంబున. 254

చ. అనఘులు రామకృష్ణులు విహార మొనర్చుచుండి రద్రిపై నని విని నందుఁ డుల్లమలరారఁ యశోదను గూడి పాయసం బును బులగంబు పాలు దధి పొంగలి పండ్లను వెన్న మీఁగడల్ గొని చనుదెంచి వారిఁగని కోర్కెలు దీరఁగ మ్రొక్కి యిచ్చినన్.

రామకృష్ణులు యశోదానందులఁ జూచుట.

గీ. రామకృష్ణులు భక్తిగౌరవములలర
వందనము చేసి ప్రేమతో వారు తెచ్చి
యిచ్చినపదార్థములు భుజియించి రంత
నచ్యుతుఁడు వారిఁ గన్గొని యడిగె నిట్లు. 257

సీ. వ్రేపల్లె చక్కఁగా వృద్ధి గాంచినదయ్య?
గోపికాజన మెల్ల కుశలమమ్మ
గోష్ఠంబు లవి గాక క్రొత్త వేర్పడెనయ్య?
పెరుగుగూనలసంఖ్య పెరిగెనమ్మ?
గోగ్రాసమునకుఁ దక్కువ కల్గదు గదయ్య?
మెచ్చ ధేనువులు పాలిచ్చునమ్మ?
ఆలమందల కెల్ల నారోగ్య మగునయ్య?
పసులకాపరుల గాపాడుదమ్మ?

గీ. పల్లెగొల్లలు నీవశవర్తులయ్య
గొల్లతలు భక్తితో నీకుఁ గూర్తురమ్మ?
పంట లన్నియు మెండుగాఁ బండునయ్య?
బీదసాదులఁ గృపఁ గని వెట్టుదమ్మ? 258

క. అని యడుగ వారు నీదయ
ననుకూలము సుఖము భద్ర మఖిలంబు జనా
ర్దన! నిన్ను సదా భక్తిం
గనుఁగొనలే కుంటి మన్న కష్టము దక్కన్. 259

వ. అనుడు నతం డలంతినవ్వు మొగంబునం దోఁప దాని కేమి లెండు. సద్గుణ సంపన్నుల కెందు నెట్టి లోపంబును గలుగఁబోదు. నాయందు వాత్సల్య ముంచి యిందు శ్రమపడి వచ్చితిరి. కృతజ్ఞుండ నింక సుఖంబుగ మీయింటికి వచ్చేయుఁ డని పలికి, యశోదం జూచి.

శా. అమ్మా! నీసుగుణంబులం దలఁచి ధన్యాత్ముల్ సదా సర్వసౌ
ఖ్యమ్ముల్ గాంతురు, నీకు మ్రొక్కి లిడులోకం బెల్లనా భక్తలో
కమ్మే నమ్మును, నీదుశీలము జగత్కల్యాణమూలంబు స
త్య మ్మోతల్లి! నమస్కరించెదను వాత్సల్యం బెద నిల్పుమా! 261

వ. అని మాతాపితృభక్తి వారికిఁ బునఃపునఃప్రణామంబు లాచరించి వీడ్కొలిపి బలదేవుం గూడి తిన్నగాఁ బుష్కరతీరంబున కేతెంచి యందలి మునీంద్రబృందంబునకు భక్తితాత్పర్యంబుల నతు లొనర్చి నంత వారు పరమానందభరితులై వారికుచితోపచారంబు లొనర్చి.

మునీంద్రులు కృష్ణుని స్తుతించుట.

చ. అమరుల నొంచినట్టి దురితాత్ము విచక్రుని జంపి రెండులో
కములకు మే లొనర్చిన, వరకారణ మాశ్రమవాసు లైనసం
యముల నలంచినట్టిఖలు హంసుని డింభకుఁ గూల్చి తుర్యమా
శ్రమమును నిల్పి ధర్మమును శాస్త్రము మమ్మును బ్రోచితీశ్వరా!

ఉ. కారణ మీవు కారణముకారణ మీవు వివేకసార మో
ఙ్కారము నీవు వేదము మఖంబును గర్తయు యోగముం దప
స్సారము నీవు నీమహిమ సర్వము నిక్కము గాదె? ధర్మని
స్తారక! నీకృపం బడసి ధన్యుల మైతిమి లోకరక్షకా! 264

వ. అని బహుప్రకారంబుల వినుతించి ప్రణామంబు లాచరించి నంత హృషీకేశుండు మందస్మిత వికసిత నయనారవిందంబుల నందఱి నొక్కమాఱు కలయం జూచి మమ్ము మఱవకుఁడు పోయివచ్చెద మని పలికి సాగ్రజుండై నిజపురంబున కేగుతెంచి ధర్మపాలనంబు ధరాపాలనంబు గావించుచు నానందించుచుండె నట్టి శ్రీకృష్ణపర మాత్ముని దివ్యచరితంబు పఠించువారికి వినువారికిం గూడ సకలశ్రే యోదాయకం బని పలికిన జనమేజయుండు. 265

క. భారతహరివంశకథా
పారాయణ మయ్యెఁ దృప్తిపడెఁ జిత్తి మిఁకన్
గూరిమిఁ దీర్పుము పురసం
హారకథాశ్రవణవాంఛ యని యడుగుటయున్. 266

—ఀఀ త్రిపుర సంహారోదంతము. ఀఀ—

వ. వైశంపాయనుండు కురుకులవర్ధనా! వేదపాఠశ్రవణమట్లు విష్ణుకథా శ్రవణము పరమపదప్రాప్తిమూల మని వేత్తలు చెప్పినతత్త్వ మిందు తేటపడు సావధానంబుగ నాకర్ణింతువుగాక. శ్రవణ మనననిదిధ్యా సనములను మూఁడును మూఁడక్షులు గా నాత్మతత్త్వసందర్శనంబు గావించు విద్వాంసుఁ డగుజీవుఁడు త్ర్యక్షుఁ డనఁబడును. స్థూల సూక్ష్మ కారణదేహంబులు మూఁడును త్రిపురము లనఁబడును. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలందు క్రమముగా విశ్వ తైజస ప్రాజ్ఞ రూపంబుల నున్నతన కుపభోగ్యము లైన యామూఁడుపురంబులను బ్రహ్మతత్త్వంబెఱింగిన యాత్ర్యక్షుఁడు బ్రహ్మజ్ఞాన నామక బ్రహ్మా స్త్రంబున నిర్మూలముగావించుట త్రిపురసంహారము లేక త్రిపుర దాహ మనఁబడును. ఈపరమార్థంబె మునిప్రణీతం బైనత్రిపురసం హారకథయందు నిగూఢమై యున్న దనుచు నిట్లు చెప్పఁదొడంగె.

చ. తొలి, తొలివేల్పుగుం పొకటి♦ తోడుగఁ గైకొని సూర్యనాథుఁ డ
న్ఖలుఁడును జంద్రనాథుఁ డను♦కావరుఁడిద్దఱు నాత్మమాయ వే
ల్పులు చొరరానికోట లన♦మూఁడుపురంబులు మూఁడువేలతే
జులు వహియించి యాకసము♦చుట్టెడునట్టివి కట్టి నేర్పునన్. 268

గీ. బహుపదార్థసమృద్ధి న♦బ్బలము తాము
నందు వసియించి చదల న♦నారతంబు
తిరుగఁ జొచ్చిరి పితృయాన♦దేవయాన
మార్గముల నరికట్టుచు ♦మత్తు లగుచు. 269

క. సురరాజపురమె వాటికి
సరి రా దనఁ జెప్పనేల♦సరిరా వని కి
న్నరగంధర్వపురంబులు ?
నిరవధినవరత్న హేమ♦నిధు లాపురముల్. 270

గీ. మెఱపుకాంతులతో నేగు♦మేఘము లన
నింగిఁ జరియించు సురగిరి♦శృంగము లన
వేల్పునదిఁ దోఁచురవిరథ♦బింబము లనఁ
బురము లామూఁడు సురవీథిఁ♦దిరుగునప్పుడు. 271

క. వారంద ఱొనర్చెడిహుం
కారంబులు సింహనాద♦కటుభాషణవి
స్ఫారాట్టహాసములు హే
షారవము నెసంగె గగన♦చరభీకరమై. 272

చ. దితిజపురంబు లట్లు నలు♦దిక్కులఁ గ్రిందికి మీఁదికిన్ మహో
ద్ధణగతిఁ బోవుచున్ జనప♦దంబులు కానలు కూలఁ ద్రొక్కుచున్
క్షితిచరఖేచరప్రతతి♦కీడ్పడఁ జేయుచు నూఁచముట్టుగాఁ
బితృగతిదేవయానముల♦పే రణఁగింప భయంబునన్ మరల్. 273

వ. నిఖిలదేవయోనివిశేషులు పితృదేవతలు వెంటరాఁ బురందర
పురస్సరులై. 274

గీ. అఖిలపైతృకకర్మఫ♦లానుభవము
పుణ్యలోకవిహారాను♦భూతి తొలఁగ
నింక దిక్కేమి మన కంచు♦నేడ్చుకొంచు
బ్రహ్మదేవునిచెంతకుఁ♦బరుగులెత్తి. 275

చ. శరణుపితామహా! శరణు!♦వచ్చి నినుం గనవచ్చినాము, మా
సురపురి కున్నత్రోవలకు♦నున్నలు చుట్టెను దానవాళికాఁ
పురములు చేయుమూఁడుపుర♦ముల్, గతిహీనుల మైతి మిట్టిదు
ర్భరదురవస్థ దాఁటెడియు♦పాయము దెల్ప ననుగ్రహింపవే! 276

చ. అన విని లోకనాథుఁ డిది♦యంతయు నేఁ గనియున్నవాఁడ, నీ
దనుజపురంబు లీశ్వరుఁడు♦తప్ప మఱెవ్వరు కూల్పఁ జాల ర
య్యనఘుఁడు శంకరుండు శర♦ణాగతవత్సలుఁ డేగుఁ డన్నఁ జ
య్యన విబుధాళి యెల్ల పర♦మాత్ము మహేశ్వరుఁ గాంచ వెల్వడెన్.

గీ. వేదపఠనంబు వేదాంత♦విషయచింత
జపతపోయోగమార్గవి♦చారణంబు
జ్ఞానవైరాగ్యభక్తిప్ర♦శంసనంబు
నాచరించుచుఁ జేరి హా♦రాలయంబు. 278

క. ధ్యాన ధ్యేయ ధ్యాతలు
జ్ఞానజ్ఞేయములు జ్ఞాత♦సర్వము తానై
యానందించెడుశంకరు
మానీంద్రపరీతుఁ గాంచి♦మఘవాద్యమరుల్. 279

చ. చల మలరం బురాసురులు♦సల్పుచునున్నదురాకృతంబులం
దెలిపి, శివా! సమస్తజగ♦తీశివతాతి! శివాప్రియంకరా!
తలఁపగఁ రానిదుర్గతికిఁ♦దక్కితి మే మని విన్నవింతు? మా
ఖిలులవధించునంతకును♦గా లిడఁజాలము మింటిత్రోవలన్. 280

చ. మును పడలేదె బాధ దితిపుత్త్రులచే? నది యింత ఘోరమా?
యనిలరవీందుకాంతిగతి యాకులపాటునఁ గుందె నన్న నే
మనఁగల! దావిహంగమవియచ్చరఖేచరు లన్నమాట లిం
కను వినవచ్చినన్ నిజముగా నవి యన్నియుఁ జెల్లవల్లలే. 281
గీ. గంగపాలయ్యెనయ్య! మాగతులు రెండు
హవ్యకవ్యంబులకు దూర మైతిమయ్య!
మీరు మీ రన్న మొఱ్ఱలేమిగిలెఁ గాని
యీశ్వరా! యేమి దేవత్వమేమి బ్రతుకు! 282
చ అని మొఱవెట్ట వారి కభయం బిడి శూలి పినాకపాణియై
ధనపతి యస్త్రశస్త్రసహితం బగుయక్షబలంబుతోడ వె
న్కను,వివిధాయుధంబులగణంబులు రుద్రులు ముందు వెల్వడన్
జనె వృషభంబు నెక్కి యిరుచక్కల వేల్పులు రాఁగ మింటికిన్.
వ. అంత పురదైత్యు లొక్కడిఁ దార్కొని, రక్తాక్షు నగ్రగు మగ్రగు లై.
గీ. చాప మెక్కిడి యొక్కొక్కసాయకమున
నెగిరి వెన్కకు నొఱఁగున నేసి కొట్ట
వజ్రనిర్భిన్నపక్షపర్వతములట్లు
కూలె మూఁడుపురంబులు నేలమీఁద. 285
గీ. తలలు బొప్పులు కట్టంగఁ దనువు లెల్ల
కుళ్లఁ బొడిచినయట్లుగాఁ గూలఁబడిన
దితిసుతులు మెల్లమెల్లఁగాఁ దెలివి చెంది
యిరులు గ్రమ్మినయంతఁ బైకెగసి మరల. 186
చ. ప్రమథగణంబు యక్షులు సుపర్వులు మూఁగినచోటు చొచ్చి కుం
తముల గదాసిముద్గరగణంబుల వ్రేయుచు గుంపు భిన్నభి
న్నముగ భయాతిరేకమున నల్గడఁ బర్వెడునట్లు ముట్టితీ
వ్రము తఱుమంగఁ జొచ్చిరి పురంబులతోఁ జడ లెల్ల తామయై.

ఉ. ఆసమయంబునందు ధనదాదులు దవ్వుల నిల్చి వారిపై
నేసినయస్త్రశస్త్రతతి యేగెను బోతులమీఁదివానయై
రోసము మీఱ దానవులు రువ్విన వచ్చియుఁ దాఁకఁ బోరిపై
నాసలు మాని నిర్జరులు యక్షులు చేరిరి శూలివెన్కకున్. 288

చ. అది గని దైత్యనాయకులు హర్షరవంబులు సింహనాదముల్
చదలఁ గలించునట్టియెడ సాగరముల్ కలఁగన్ మహీధ్రముల్
కదలఁగఁ జేయునట్టిలయకాలపయోధరమట్లు సాధ్వస
ప్రద మగునాద మొప్ప వడి వచ్చె రథం బొకఁ డీశుచెంతకున్.

గీ. అది రథంతరసామమయంబు నాఁగ
బ్రహ్మతేజోమయం బని పలుకుచంద్రు
వృషభరూపంబు ధరియించి విష్ణు వపుడు
దాని వహియించె ధర్మ మెత్తంగఁ దలఁచి. 290

క. హరుఁడు రథ మెక్కె నప్పుడు
హరిరథ్యము తనదుకొమ్ము లాడించుచు దు
ర్భర మైనఱంకె వేసిన
సురశత్రువు లదరిపడియు శూరత మెఱయన్. 291

చ. హరునరదం బెదిర్చి తమ కడ్డమువచ్చినయక్షభూతని
ర్జరులఁ బదేసిబాణముల సంగరరంగము వాయఁగొట్టి యీ
శ్వరు గుఱిచేసి సర్వవిధశస్త్రపరంపర లేకధారగాఁ
గురిసిన నాతఁ డన్నిటిని గూల్చి నవ్వుచు హుంకరించుచున్. 292

మ. శర మొక్కం డరిఁబోసి కూర్చి పరమాస్త్రం బైనయాగ్నేయమం
దరుదారంగఁ దపంబు యోగమును సత్యం బెల్ల సంధించియీ
శర మే మూఁడుశరంబు లంచు మనసా ధ్యానించి మంత్రించి యీ
పురముల్ మూఁటికి నాటనేసె నవి శంభో యంచు భస్మంబుగాన్.

వ. అట్లు త్రిపురదాహంబున దేవపితృయానంబులు నిరాతంకంబులు గావించినలోకశంకరుం డగుశంకరునికిని వృషరూపంబున ధర్మోద్ధరణం బొనర్చినధర్మస్వరూపుం డగుశ్రీమహావిష్ణువునకును భక్తనమ్రులై యఖిలదేవదేవయోనపితృదేవతాదులు సాష్టాంగనమస్కృతు లాచరించి సుఖంబుగం దమతమనెలవుల కరిగిరి. సత్యజ్ఞానానందమయంబు ననాదిమధ్యాంతంబు నైనహరిహరాత్మకదివ్యతేజంబంద యంతర్హితం బయ్యె. రాజేంద్రా! యిది త్రిపురదాహవృత్తాంతము. బ్రహ్మజిజ్ఞాసు వగుపురుషుండు సాధనచతుష్టయసంపత్తి నంతరరివర్గంబు నిర్జించి దేహత్రయంబును జ్ఞానాగ్ని నిర్దహించి యాత్మజ్ఞుండై బ్రహ్మభావము గాంచు ననుటయే యిందలినిగూఢంబైనపరమార్థ మని విశదీకరించి. 294

గీ. భార్గవ్యుదంతంబు పుష్కరప్రాభవంబు
ఘనవరాహ నృసింహ వామన చరితలు
హరశిఖరియాత్రి పౌండ్రక హంస డిభక
పురవధయు నా భవిష్యంబు పూర్తిగాంచె. 295

వ. అని పలికిన జనమేజయుండు మునీంద్రా! మహాభారతేతిహాసంబు వినిపించి నన్నుం గృతార్థుం గావించితివి. నీవాత్సల్యంబున కేతయుం గృతజ్ఞుండను. నీయనుగ్రహంబున నైహికాముష్మికఫలప్రదంబులగు నెల్ల ధర్మంబు లెఱింగిననాహృదయంబు వినిర్మలంబై సత్త్వసంపన్నం బయ్యె ధన్యుండ నింక నీశతపర్వామ్నాయంబు పఠించువారికి వినువారికిని లభించుఫలం బొక్కటియు ననుగ్రహించి తెలుపుమనుటయును.

—భారతామ్నాయపఠనశ్రవణఫలము—

చ. జనవర! భారతం బనంగ సత్యదయాంతరశౌచనీతివ
ర్తనపురుషార్థజాతిమత ధర్మవివేకవిరక్తిభక్తిసా
ధనపరమార్థచింతనని ధానము సద్గురుబోధ రాజశా
సనము హితోపదేశము నశక్యము దానిమహత్త్వ మెన్నఁగన్.

గీ. భారతము విన్నఁ జదివినఁ బాప మణఁగు
యాగములు చేసినట్టిపుణ్యము లభించు
దుష్టసంసారవాంఛలు తొలఁగిపోవు
బుద్ధి వికసించు బంధవిముక్తి కలుగు. 298

వ. అని యాదిపర్వాదిభవిష్యపర్వాంత శతపర్వాఖ్యాయపఠన శ్రవణ
ఫలంబు సంగ్రహించి తెల్పినంత. 299

క. ఘనుఁ డగువైశంపాయన
మునిపతి నుచితోపచారముల సత్కారం
బొనరించి యనిపి సుఖముగ
జనమేజయవిభుఁడు ధర్మరసంగతి నుండెన్. 300

ఇది

శ్రీమత్పవిత్ర హారితసగోత్ర మల్లాద్యన్వయసహస్రపత్రి కమలమిత్రా
పస్తంబసూత్రోదిత సకలతంత్ర రామస్వామిశాస్త్రి పౌత్త్రుండును,
శిష్టచరిత వెంకమాంబా వేదవేదాంతజ్ఞాని శ్రీరామావధాని
పుత్త్రుండును శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గురువరప్రియ
శిష్యుండును సంస్కృత వాఙ్మయచరితాంధ్ర భాషాను
శాసన మహావీర చరిదాది గద్య పద్యరూపక
రూపాద్యనేకకృతికర్తయు నాంధ్ర విశ్వకలా
పరిషత్కళాశాలా సంస్కృతాంధ్రాధ్యాప
కుఁడునైన సూర్యనారాయణశాస్త్రి
నిర్మించిన యాంధ్ర భవిష్య
పర్వము - ఓం తత్సత్.
షష్ఠాశ్వాసము.



# తప్పొప్పుల పట్టిక.

థ-ధ, ల-వ, ట-ఠ, శ-స, ఖ-భ, న-స-ప-వ, తాఱు మాఱగుట యెక్కువ. అరసున్నలు కొన్నిపోయినవి. పాఠకులిట్టి యచ్చు తప్పులు సవరించుకొనఁ గోరిక.

| పుట. | పం. | తప్పు. | ఒప్పు. | పుట. | పం | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 11 | 18 | యిది | యిదియేమి? | 83 | 5 | ఒకొ్కని | ఒక్కని |
| 13 | 9 | ఔండయు | ఔండియు | 85 | 9 | డయ్యోమ | డయ్యమ |
| 25 | 12 | యాత్రము | పాత్రము | 88 | 15 | మేని | మేన |
| ,, | 19 | జన్మము | జన్మము | 91 | 15 | మొయి | మెయి |
| 28 | 4 | న్యసంపు | న్యసింపు | 95 | 14 | గాకైక | రాపైక |
| 30 | 11 | కేకొర్ణ | సేకొగ్ణ | ,, | 19 | వేసె | లేసె |
| 33 | 8 | బాలు | బాల | 99 | 23 | లేవెలు | వేవెలు |
| 34 | 6 | భవతే | భవతేమహతే | 100 | 15 | చతం | శతం |
| 38 | 1 | బయి | బయిన | 103 | 16 | గల్పన-కియ్యోషన్ | (చదువు) |
| 39 | 12 | పోక్రి | పోఁక్రి | 104 | 16 | గావించె | గావించి |
| ,, | 13 | గనొ్కను | గన్గొని | 105 | 15 | సేవకా | సేనకా |
| 40 | 4-5 | చార్య-ఖ్యాతి | (చదువునది) | 106 | 7 | వేయని | లేయని |
| ,, | 16 | మక | ముక్త | 110 | 22 | పురుహో | పురుహూ |
| 45 | 6 | సృష్టె | సృష్టి | 114 | 7 | కశ్యప | కశ్యపప |
| 50 | 5 | కారుణుఁ | కారణుఁ | 120 | 16 | సాక్షరంమె | సాక్షరంబా |
| 51 | 14 | కరుణని | కరుణుని | 121 | 13 | దితి | నదితి |
| 53 | 9 | వత్తుఁ | వత్తుఁడు | ,, | 16 | పాశ్రివ | పాశ్రిమ |
| 54 | 10 | వైతవ్య | వైత్య | 124 | 7 | బలలిం | బలిం |
| 59 | 1 | బూన్చివ | బూన్చిన | ,, | 13 | ఆసుధామయ | (చదువు) |
| 62 | 16 | పడిముయి | పడిపోయి | 133 | 19 | యతిధైర్యంబును | ,, |
| ,, | 17 | సురవ | సురవా | 140 | 7 | హరిహరతత్త్వ | ,, |
| 66 | 9 | మహిమ | మాహిమ | 143 | 12, 15 | బునకున్, గూర్చుండి | ,, |
| 67 | 23 | శివాళి | శివావళి | 146 | 2, 24 | బుక్సాపూత్మ, గరుడ | ,, |
| 74 | 18 | | దిజ్ఞా | 151 | 10, 20, 22 | బర్వ్హ, త్రిగుచు, | |
| 76 | 17 | వేషు | వేషు | | | నార్చ్సను | ,, |
| 77 | 18 | వృత్తృ | వృత్రు | 156 | 6, 12 | శ్వగణం, వాగ్విభ | ,, |
| 79 | 11 | శచ్చంద్ర | శరచ్చంద్ర | 158 | 22 | నాపాల | నాపాలి |
| 81 | 12 | లేవెలుంగు | వేవెలుంగు | 160 | 8 | దంతవక్త్రం | (చదువు) |

| పుట. | పం. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 162 | 21, 24, | డెక్క-డ, బక్కానే | (చదువు) |
| 164 | 11 | కనుచు, ననుచు | ,, |
| 168 | 16, 19 | మేముందు, పరమాత్మ | ,, |
| 175 | 11, 13 | పూర్వము, గల్ల | ,, |
| 179 | 17 | లాత్మునకు | ,, |
| 180 | 4 | మెదురేగ | ,, |
| 187 | 2 | రౌద్ధవేని | ,, |
| 188 | 17, 19, 20 | మక్కలు. న్నలిగా, గడని | ,, |
| 189 | 24 | గట్టిన | గట్టన |
| 197 | 20 | చూడుండు | చూడండు |
| 199 | 9, 12 | మహాని, పరిమాళం | (చదు) |
| 201 | | కమండలల్ | ,, |
| 204 | 13 | జెఱుంగ | జెఱుంగు |
| 205 | 22 | ధమలీ | (దుచవు) |
| 208 | 22 | సమత్వ | ,, |
| 212 | 8 | మంతుర్లు | ,, |
| 218 | 4, 10, 12, | మునుము. భవ), గాంచెదవు | (చదువు) |
| 223 | | వాతలు పెట్టకుండుపో | ,, |
| 228 | 11 | వాదివీరవారము | ,, |
| 230 | 14 | కక్కడనేని | ,, |
| 232 | 5 | యద్యుతాగ్రి | ,, |
| 234 | 7 | విప్రఘుండు | ,, |
| 236 | 11 | జెనుకచక్కని | ,, |
| 237 | 6 | గూల్చితోల్లి | (చదువు) |
| 238 | 18 | ననాన్క్షేమ | ,, |
| 239 | 3 | నమ్మనేనునీ | ,, |
| 240 | 1, 18, 22, 26 | పుడరీకా, పెరిగనమ్మ, కాపరుల, పెట్టదమ్మ | ,, |
| 241 | 12 | న్నిల్పుమా. 19 లానర్చి | ,, |
| 245 | 24 | ముట్టె | ముట్టి |
| 246 | 10 | చంను) | చందు) |
| 247 | 19 | సత్యసం, 21 లభించు | (చదువు) |